# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక పత్రిక

అక్టోబర్ 2007 75 రు. 10

- ఫోకస్ : ఆదివాసి ప్రాంతాలలో పాలన, సంక్షేమం
- రామసేతుపై కిష్కింధకాండ
- 1948 సెప్టెంబర్ 17 పరిణామాలు
- ఎండమావులవుతున్న వలస బతుకులు
- యుద్ధం ఇప్పుడు లాభసాటి వ్యాపారం
- పవన్ కళ్యాణ్ ఉదంతం

## వెలువడింది




# విమర్శ పరామర్శ

ఓ జర్నలిస్టు అయిదు దశాబ్దాల
అనుభవాలు, అనుభూతులు

### వి. హనుమంతరావు

డేటా న్యూస్ ఫీచర్స్ ప్రచురణ

ప్రతులకు :
సిడిఆర్‌సి, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029
అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో

వెల : **రు. 25**

## వెలువడింది




# నా ప్రజాజీవితం

### పెండ్యాల రాఘవరావు

ప్రతులకు :
ఎన్. వేణుగోపాల్
జి-1, మైత్రీ రెసిడెన్సీ, స్ట్రీట్ నెం.3,
హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029

వెల : **రు. 50**

వీక్షణం 75
రాజకీయార్థిక, సామాజిక మాస పత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ
అక్టోబర్ 2007
సంపుటి : 5
సంచిక : 10



**వీక్షణం చందా వివరాలు**

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| 3 సంవత్సరాల చందా | రు. 350 |
| 5 సంవత్సరాల చందా | రు. 550 |
| 10 సంవత్సరాల చందా | రు. 1000 |

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా
వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : reachcdrc@yahoo.com
డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.
ఫోన్ : 98482 49695
98484 28516
ప్రింటర్స్
చరితా ఇంప్రెషన్స్,
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

సంపాదకీయం

# సమాజం ముందర సమాల్ సవాళ్లు

రాష్ట్ర ప్రభుత్వ అవినీతి నిరోధకశాఖలో పనిచేసి పదవీ విరమణ చేసిన సీనియర్ ఐ.ఎ.ఎస్. అధికారి రామచంద్ర సమాల్ విడుదల చేసిన ప్రకటన రాష్ట్ర రాజకీయ, అధికార వర్గాలలో ప్రకంపనలు సృష్టిస్తోంది. సమాల్‌కు మతిస్థిమితం లేదన్న దగ్గరినుంచి అసలు పదవీ విరమణ తర్వాత ఇటువంటి ప్రకటన చేయొచ్చునా అన్నంతవరకు, పదవిలో ఉన్నప్పుడు ఏమి చేశాడనే దగ్గరినుంచి ఆయన కూడ అవినీతికి పాల్పడలేదా అన్నంతవరకు అనేక ప్రతిస్పందనలు వెలువడ్డాయి, వెలువడుతున్నాయి. ఈ సాంకేతికమైన, నైతికమైన, దూషణా పూర్వకమైన స్పందనలలో ఉన్న విషయాలన్నీ పూర్తిగా నిజమైనవనే అనుకున్నా, అవేవీ సమాల్ ప్రకటనలోని వాస్తవాలపై మసిపూయజాలవు. ఆ ప్రకటన వెలువడిన వెంటనే రాజకీయ, అధికార వర్గాలు తీవ్రంగా స్పందించాయి గాని సామాజిక స్పందన ఉండవలసినంతగా ఉన్నట్టు లేదు. సమాల్ ప్రకటనలలో కొత్త విషయం ఏముందని ప్రజలు నిర్లిప్తంగా ఉన్నట్టున్నారు. నిజంగానే గత పది, పదిహేను సంవత్సరాలుగా ప్రజలు చెప్పుకుంటున్న విషయాలనే, పత్రికలలో అడపాదడపా వస్తున్న విషయాలనే ఇవాళ సమాల్ ప్రకటన ధ్రువీకరిస్తున్నది. అంతేగాని అది కొత్తగా చెపుతున్న విషయాలేమీ లేవు. అమెరికా దుర్మార్గాల గురించి ప్రపంచానికంతా దశాబ్దాలుగా తెలిసిన విషయాలనే జాన్ పెర్కిన్స్ బయటపెట్టినట్టు, మన రాష్ట్రంలో రాజకీయ, అధికార వర్గాల అవినీతి గురించి చాలరోజులుగా చాలమంది చెప్పుకుంటున్నవాటికే ఇప్పుడు సమాల్ కొన్ని ఆధారాలు బయటపెట్టారు. రాష్ట్రంలోని అత్యున్నతాధికార వర్గంలో భాగమైన ఐ.ఎ.ఎస్., ఎ.పి.ఎస్. అధికారుల గురించి, రాజకీయ నాయకుల గురించి ఫలానావారు అవినీతిపరులు అని చెప్పుకునే పరిస్థితి ఒకప్పుడు ఉండేది. అప్పుడు అవినీతిపరులు వేళ్లమీద లెక్కపెట్టగలిగినంత మంది ఉండేవారు. గత రెండు దశాబ్దాలలో ఫలానావారు అవినీతిపరులు కారు అని నీతిమంతులను వేళ్లమీద లెక్కపెట్టే పరిస్థితి వచ్చింది. సమాజంలో అందరికీ బహిరంగ రహస్యంగా ఉన్న ఈ విషయం గురించి ఏటేటా వార్షిక నివేదికలు సమర్పించారా లేదా, పదవిలో ఉన్నప్పుడు విచారణ జరిపారా లేదా, అసలు అవినీతికి ఆధారాలున్నాయా లేదా, ఆ ప్రకటన చేసినవారి మతిస్థిమితం ఎంత అనే ప్రశ్నలే అనవసరం. ఏ రాజకీయ నాయకుడి విషయంలోనైనా అధికారంలోకి రాకముందు అతని ఆస్తి ఎంత, రాజకీయాల్లో ప్రవేశించి ఇన్నాళ్లు గడిచిన తర్వాత అతని ఆస్తి ఎంత, ఆ కాలంలో అతని ఆదాయానికీ ఈ ఆస్తికీ ఏమన్నా పొంతన ఉందా అని ఆ రాజకీయ నాయకుడి గ్రామస్తులనో, ఇరుగు పొరుగువారినో అడిగితే తెలిసిపోతుంది. ఇక ఐ.ఎ.ఎస్., ఐ.పి.ఎస్. అధికారుల విషయంలోనైతే, వారి వార్షికాదాయం నాలుగు లక్షల రూపాయలకు మించకపోయినా, వారికి ప్రశాసననగర్‌లో కోట్లాది రూపాయల విలువ చేసే భవనాలు, ఇతర చోట్ల తమ పేర్లమీద, కుటుంబ సభ్యుల పేర్లమీద, బేనామీగా కోట్లాది రూపాయల ఆస్తులు ఎట్లా వచ్చాయో తెలుసుకుంటే సమాల్ నివేదిక ప్రకటించిన దానికంటే ప్రకటించనిదే ఎక్కువ అని తేటతెల్లమవుతుంది. అధికారంలో ఉన్నవారి అక్రమార్జన కౌటిల్యుని కాలం నుంచీ ఈ దేశంలో కొనసాగుతున్న ఆచారమే. నాలుగు దశాబ్దాల కింద కేంద్ర ప్రభుత్వం నియమించిన సంతానం కమిటీ నివేదిక అయినా, ఇవాళ్టి సమాల్ నివేదిక అయినా ఆ అవినీతి సముద్రం మీది తేలి ఆడుతున్న మంచుగడ్డలను మాత్రమే చూపుతున్నాయి. ఆ సముద్రం లోపల దాగిన బ్రహ్మాండమైన ప్రజాధనపు కొండలను బయటపెట్టి, అవినీతి పర్వతాల్ని కూలదోసే ప్రజా చైతన్యం వికసించడం ఒక్కటే పరిష్కారం. ◆

## అవ్యవస్థ చిహ్నాలివి

పైకి చూడడానికి లుంబినీ పార్క్, గోకుల్ చాట్‌లలో జరిగిన పేలుళ్లు, వాకపల్లిలో ఆదివాసి మహిళలపై జరిగిన అత్యాచారం, అధికారపార్టీ నాయకుడి కొడుకు హత్యచేసి తప్పించుకోవడం, పంజాగుట్ట ఫ్లైఓవర్ ప్రమాదం ఒకదానితో ఒకటి సంబంధంలేని సంఘటనలని అనిపిస్తుంది గాని ఆ నాలుగూ మన వ్యవస్థ ఎంత కుళ్లిపోయిందో చూపే నాలుగు ముఖాలు. ఆ మాటకొస్తే మనచుట్టూ ప్రతినిత్యం జరుగుతున్న ప్రతి ఒక్క సంఘటనా ఈ వ్యవస్థ ఎంత అస్తవ్యస్తంగా నడుస్తున్నదో, దీన్ని సరిగా నిర్వహించడం కొరకే అధికారం దక్కినవాళ్లు ఎంత దుర్మార్గంగా, ఎంత స్వార్థప్రయోజనాలతో, ఎంతగా ప్రజల పట్ల శ్రద్ధలేకుండా పాలన సాగిస్తున్నారో చూపుతుంది. తీవ్రవాదం పేరు మీద సాగే చర్యలు ఇవాళ ఎంత దుర్మార్గంగా కనబడుతున్నా, ఎంత అమానుషంగా ప్రజల ప్రాణాలు తీస్తున్నా వాటి మూలం ఎక్కడున్నదో చూడవలసి ఉంది. వ్యవస్థ కొందరి పట్ల చేసిన అన్యాయం, ఆ అన్యాయానికి చట్టబద్ధ నిర్మాణాలేవీ పరిష్కారాలు చూపకపోవడం వంటి చర్యల వల్ల కసి, ద్వేషం పెరిగినవారు ఒకరకమైన నిస్సహాయ స్థితిలో ఈ ఉన్మాద చర్యలకు దిగుతున్నారు. లుంబినీ పార్క్‌లో, గోకుల్‌చాట్‌లో ప్రాణాలు కోల్పోయిన అమాయకులకు పాలకులు చేసిన దుర్మార్గాలతో ఏమీ సంబంధం లేకపోవచ్చు. కాని ఆ దుర్మార్గాలకు వారు తమ ప్రాణాలతో ప్రతిఫలం చెల్లించవలసి వచ్చింది. ఇది చరిత్రలో గతంలో జరిగిన దుర్మార్గానికి కొనసాగింపు అయితే, వాకపల్లిలో జరిగిన దౌర్జన్యం రాజ్యం ఇప్పటికిప్పుడు వర్తమానంలో చేసిన దుర్మార్గం. దీనికి చరిత్రలో మళ్లీ ఎప్పుడో ప్రతీకారం ఉంటుంది. పంజాగుట్ట ఫ్లై ఓవర్ ప్రమాదం అనేది కూడ వ్యవస్థ గతంలోనూ, వర్తమానంలోనూ చేసిన దుర్మార్గాల ఫలితమే. అవినీతి రూపంలో, ఆశ్రితపక్షపాతం రూపంలో, ప్రజల ప్రాణాలపట్ల విలువలేకుండా, నాణ్యతా ప్రమాణాలు పాటించకుండా ప్రజా నిర్మాణాలు సాగించడంలో పాలకులు సాగిస్తున్న దుర్మార్గాలకు నిదర్శనమే పంజాగుట్ట ఫ్లై ఓవర్ ప్రమాదం. కలిగినవారు, అధికారాలలో ఉన్నవారు ఏ నేరాలు చేసినా ఫరవాలేదనేందుకు నిదర్శనం జూబిలీహిల్స్ హత్య. వ్యవస్థ సంస్కరణ సాధ్యమా అనిపించేంతగా పుచ్చిపోయిందనడానికి ఇవన్నీ ఉదాహరణలు.

## సేతు సముద్రం ఎవరి కోసం?

సామెత చెప్పినట్టుగా అయోధ్యలో కల్లుతాగిన సంఘపరివారం రామేశ్వరంలో నిప్పుతొక్కుతున్నట్టుంది. తమిళనాడు తీరంలోని రామేశ్వరం నుంచి శ్రీలంక ఉత్తరతీరంలోని మన్నార్ వరకు నలభై ఎనిమిది కిలోమీటర్ల పొడవున సముద్రం లోపల శిలలతో, పగడపు చిప్పలతో ఏర్పడిన సహజ వారధి ఉంది. అది రాముడు వానరులతో నిర్మింపజేసిన వారధియేనని రామభక్తుల విశ్వాసం. ఆ విశ్వాసం నిజమని రుజువుచేయడానికి ఎటువంటి చారిత్రక ఆధారాలు లేకపోయినా, ఆ విశ్వాసాన్ని తమ రాజకీయ ప్రయోజనాల కొరకు వాడుకోవచ్చునని సంఘపరివారం, ముఖ్యంగా భారతీయ జనతాపార్టీ నమ్ముతున్నాయి. ఆ వారధిని తెగగొడితే ఇప్పుడు శ్రీలంకను చుట్టి వస్తున్న ఓడలు ఆ మధ్యనుంచే ప్రయాణించవచ్చునని, దానివల్ల 30 గంటల ప్రయాణ కాలం, 800 కిలోమీటర్ల దూరం, అంటే సాలీనా కనీసం రు. 200 కోట్ల రూపాయల వ్యయం ఆదా అవుతాయనే సమర్థనతో, రు. 2700 కోట్ల ఖర్చుతో భారత ప్రభుత్వం సేతు సముద్రం పథకాన్ని 2005 జూన్‌లో ప్రారంభించింది. ఈ పథకం గురించి ఆలోచించవలసిన ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక కోణాలెన్నో ఉన్నాయి. అన్ని ప్రభుత్వ పథకాలలాగే ఈ పథకంలో కూడ ప్రభుత్వం ప్రకటిస్తున్న ప్రయోజనాలు నిజం కాదని, కాంట్రాక్టర్లకు అందే వ్యయం మాత్రమే నిజమని అభిప్రాయాలున్నాయి. అట్లాగే ఈ ప్రాంతంలోని వారధిని తెగగొట్టి పెద్ద ఓడల ప్రయాణానికి అనుమతిస్తే జలచరాల ఉనికి ప్రశ్నార్థకమవుతుందని, అంటే తమిళనాడు మత్స్యకారుల జీవన భద్రతకు ప్రమాదం ఏర్పడుతుందని వాదనలున్నాయి. అసలు ఈ ప్రాంతంలో సముద్రం ఎక్కువ లోతు లేదు గనుక పెద్ద ఓడలు ప్రయాణించజాలవని అప్పుడు ఈ మార్గం ఏర్పరచి కూడ ప్రయోజనం లేదని వాదనలున్నాయి. అసలు శ్రీలంక ఉత్తర తీరం ప్రస్తుతం తమిళ ఈలం ఉద్యమకారుల చేతిలో ఉంది గనుక వారి మీద దాడిచేసే యుద్ధనౌకలకు మార్గం సుగమం చేయడానికే ఈ పథకం తయారయిందనే వాదనలున్నాయి. హిందువుల విశ్వాసాలు, మనోభావాలు దెబ్బతింటాయనే వాదన ఎలాగూ ఉంది. ఈ నేపథ్యంలో సేతుసముద్రం పథకం గురించిన అన్ని వాస్తవాలనూ పారదర్శకంగా ప్రజలముందు ఉంచి, సరైన చర్చ జరిపి నిర్ణయం తీసుకోవలసి ఉంటుందిగాని అటు కాంట్రాక్టర్ల ప్రయోజనాల కొరకు వారధి తవ్వడమో, ఇటు సంఘ పరివార బెదిరింపులకు లొంగి పథకాన్ని ఉపసంహరించడమో సరయినది కాదు.

## నేపాల్‌లో మరొక మలుపు

నేపాల్‌లో ఇటీవలి పరిణామాలు ఒక చారిత్రక సత్యాన్ని మరొక సారి రుజువుచేస్తున్నాయి. పాలకవర్గాలు శాంతియుత మార్గాలలో తమ అధికారాన్ని వదులుకోబోవని, ప్రజలు అధికారంలో వాటా కోసం ప్రయత్నిస్తే భంగపడక తప్పదని నేపాల్ మరొకసారి రుజువు చేస్తున్నది. నిజానికి అక్కడ ప్రచండ నాయకత్వంలోని మావోయిస్టులు దేశాన్ని పూర్తిగా తమ హస్తగతం చేసుకుంటామని కూడ అనలేదు. బహుళపార్టీ వ్యవస్థను ఏర్పరుస్తామని, కొత్త ప్రభుత్వం ఎన్నికల ద్వారా ఏర్పడవలసిందేనని, దేశాన్ని రాచరికం నుంచి గణతంత్ర రాజ్యంగా మార్చాలని, ఒక ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని రచించాలని మాత్రమే వాళ్లు కోరుతున్నారు. ఈ మాత్రం ఆకాంక్షలకు కూడ ఒప్పుకునేది లేదని నేపాల్ పాలకవర్గాలు, వారికి మద్దతును ఇస్తున్న భారత, అమెరికన్ పాలకవర్గాలు మొండిగా వ్యవహరిస్తున్నాయి. ఆ నేపథ్యంలోనే ప్రభుత్వం నుంచి మావోయిస్టు ప్రతినిధులు వైదొలిగారు. ఎన్నికలకు ముందే రిపబ్లిక్‌ను ప్రకటించాలనే, ఎన్నికలలో దామాషా ప్రాతినిధ్య పద్ధతిని పాటించాలనే ప్రధాన డిమాండ్లతోపాటు తాము ప్రతిపాదించిన 22 డిమాండ్లను ప్రభుత్వం అంగీకరించకపోవడంతో మంత్రివర్గసభ్యులు కృష్ణ బహదూర్ మహారా, దేవ్ గురుంగ్, హిసిలా యామి, ఖడ్గ బిశ్వకర్మ రాజీనామా చేశారు. ఆ తర్వాత శాంతియుత నిరసన కార్యక్రమాన్ని ప్రకటిస్తూ, మావోయిస్టులను బలహీనపరచడమే భారత లక్ష్యంగా కనబడుతున్నదని బాబూరామ్ భట్టరాయ్ అన్నాడు. శాంతి చర్చలలో భాగంగా ఐక్యసంఘటన ప్రభుత్వం అంగీకరించిన ఒప్పందాలను ఉల్లంఘిస్తున్నదని, తమ శాంతియుత నిరసనను ఉక్కుపాదంతో అణచివేస్తే తాము మళ్లీ తగిన చర్యలు చేపట్టకతప్పదని కూడా ఆయన అన్నాడు. 'పార్లమెంటులోపలి నుంచి నేపాల్‌ను రిపబ్లిక్‌గా ప్రకటించాలని మేం అనుకున్నాం. అది సాధ్యం కాలేదు. ఆ పని ప్రజల మధ్యనుంచే చేస్తాం' అని భట్టరాయ్ అన్నాడు. గత రెండు సంవత్సరాలలో అనేక మలుపులు తిరిగిన నేపాల్ ప్రజా ఉద్యమం ఇప్పుడు మరొక మలుపు తిరుగుతున్నట్టున్నది. ప్రపంచానికి కొత్త ఆశలు రేకెత్తించిన నేపాల్ ప్రజాఉద్యమ పరిణామాలు ఆలోచనాపరులలో ఆందోళననూ, ఉత్సుకతనూ రేకెత్తిస్తున్నాయి. ◆

## లోపలి పేజీల్లో...



### ఆదివాసి ప్రాంతాలలో పాలన, సంక్షేమం

ఆదివాసులు పోదుకొడితే కేసు పెట్టే ప్రభుత్వం పర్యావరణ చట్టాలను, అటవీచట్టాలను, అనునిత్యం పారిశ్రామికవేత్తలు, ప్రభుత్వాలు అతిక్రమిస్తున్నా ఏమీ మాట్లాడదు. ఆధునికతపేరిట, అభివృద్ధిపేరిట ప్రభుత్వదన్నుతో షెడ్యూల్డ్ ఏరియాలో జరుగుతున్న విధ్వంసం ఫలితంగా వచ్చిన దుష్పరిణామాలనీ, లాభాపేక్షతో జరుగుతున్న మార్కెట్ల విస్తరణ స్వభావాన్నీ కప్పిపుచ్చడానికి ఆదివాసులే అడవి విధ్వంసకారులన్న అవాస్తవిక వాదనను ప్రజాస్వామిక ప్రగతి కాముకులు బట్టబయలు చేయాలి.

### ఫోకస్ : ఆదివాసి ప్రాంతాలలో పాలన, సంక్షేమం



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028












❖ **విమర్శ-పరామర్శ** – ఓ జర్నలిస్టు అయిదు దశాబ్దాల అనుభవాలు, అనుభూతులు – వి. హనుమంతరావు – డేటా న్యూస్ ఫీచర్స్ ప్రచురణ, 172 పేజీలు, 1/8 డెమీ, రు. 25. ప్రతులకు : సిడిఆర్‌సి, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029. అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో

❖ **కన్యాశుల్కం** – 19వ శతాబ్ది ఆధునిక భారతీయ నాటకాలు – డా. యు.ఎ. నరసింహమూర్తి – ఎన్.కె. పబ్లికేషన్స్, 722 పేజీలు, 1/8 డెమీ, రు. 375. ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో

❖ **చే గువేరా** – ఓ పోరాట వీరుని సంక్షిప్త జీవిత కథనం – డా. మానేపల్లి – జయంతి పబ్లికేషన్స్, 24 పేజీలు, 1/8 డెమీ, రు. 10. ప్రతులకు : ఎస్.వి. కృష్ణజయంతి, 19–90, పి&టి కాలనీ, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ – 500 060; వై. డేవిడ్‌రాజు, హేయర్‌పేట, చీరాల, ప్రకాశం జిల్లా – 523 155

❖ **ప్రజాకళా మండలి పాటలు 2007** – ఆంధ్రప్రదేశ్ ప్రజాకళా మండలి ప్రచురణ, 176 పేజీలు, 1/8 డెమీ, రు. 15. ప్రతులకు : కొర్రాయ్ నీలకంఠు, పెద్దరాజాం గ్రామం, వజ్రపుకొత్తూరు మం., శ్రీకాకుళం జిల్లా. ఫోన్ : 9989692019

❖ **జానపద వైద్యం** – డా. బి.వి.ఎ. రామారావునాయుడు, డా. టి.వి.వి. సీతారామిరెడ్డి – గాయత్రి పబ్లికేషన్స్, 180 పేజీలు, 1/4 క్రౌన్, రు. 300. ప్రతులకు : బి. విజయలక్ష్మి, 'హరిత', 3–67, విశాఖ 'ఎ' కాలనీ, శ్రీకాకుళం – 532 001. ఫోన్ : 220478

❖ **నా ప్రజాజీవితం** – పెండ్యాల రాఘవరావు – రాఘవరావు కుటుంబసభ్యుల ప్రచురణ, 207 పేజీలు, 1/8 డెమీ, రు. 50. ప్రతులకు: ఎన్. వేణుగోపాల్, జి1, మైత్రీ రెసిడెన్సీ, 3–6–394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ – 500 029

❖ **తెలంగాణ సందర్భాలు** – కాసుల ప్రతాపరెడ్డి – స్పృహ సాహితీ సంస్థ ప్రచురణ, 69 పేజీలు, 1/8 డెమీ., రు. 25, ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, జర్నలిస్టు, 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044.

❖ **యు.పి.లో బి.ఎస్.పి. గెలుపు** – బి.ఎస్. రాములు – సామాజిక తాత్విక విశ్వవిద్యాలయం ప్రచురణ, 128 పేజీలు, 1/8 డెమీ, రు. 40. ప్రతులకు : యూనివర్సిటీ ఆఫ్ ఫిలాసఫీ, 406, ఉషాకిరణ్ ఆర్కేడ్, ఉస్మానియా యూనివర్సిటీ రోడ్, విద్యానగర్, హైదరాబాద్ – 500 044. ఫోన్ : 65164929

**సిడిలు**

❖ **కన్నీటి పాట** – సంగీతం, సమర్పణ : ప్రజాకళా మండలి – రచన : సి. కాశీం, మల్లేశం, వై. వెంకన్న, స్నేహకోటి, ప్రేమ, గుండమళ్ల శ్రీనివాస్, ప్రభాకర్, గానం : జె. కోటి, రాంచందర్, విష్ణు, జె. గోపాల్, రడం శ్రీను, రాణి, నీలకంఠు, ప్రభాకర్ – వెల. రు. 30, సిడిల ప్రతులకు : ఎపి పికెఎం ఆడియోస్, కొర్రాయ్ నీలకంఠు, పెద్దరాజాం గ్రామం, వజ్రపుకొత్తూరు మం., శ్రీకాకుళం జిల్లా. ఫోన్ : 9989692019

❖ **గుండెల సవ్వడి** – స్నేహప్రియా ఆడియోస్ కరీంనగర్ – రచన & నిర్మాణం : కె. విజయనర్సింహారావు, సంగీతం : కె.బి. శర్మ, గానం : కె.బి. శర్మ, సి.హెచ్.పి. రాధాకృష్ణారావు, ఓలం లక్ష్మారెడ్డి, ఎస్. శైలజ, శ్రీవేదవ్యాస శ్రీరాం భట్టర్, ప్రతులకు : కె. విజయనర్సింహారావు, 7–3–244/1, కాశ్మీర్‌గడ్డ, రైతు బజార్ వెనుక, కరీంనగర్.











## పాఠకుల వీక్షణం

**పి.**యు.సి.ఎల్ ఛత్తీస్‌గడ్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి డాక్టర్ బినాయక్ సేన్‌ను ఆయన ఇంటి నుండి ఛత్తీస్‌గడ్ పోలీసులు మే 21న అరెస్ట్ చేశారు. సాధారణ ఐపిసి కింద కాకుండా ఛత్తీస్‌గడ్ విశేష ప్రజా భద్రతా చట్టం, 2005, చట్టవిరుద్ధ కార్యక్రమాల (నిరోధక) చట్టం 1967ల కింద అరెస్ట్ చేశారు. ఈచట్టాల కింద అరెస్ట్ చేసిన వారికి సాధారణంగా దీర్ఘకాలంపాటు బెయిలు లభించదు. డాక్టర్ సేన్ ఆనాటినుండి అండర్‌ట్రయిల్ ప్రిజనర్‌గా జైలులోనే ఉన్నారు.

డాక్టర్ సేన్ ఎం.డి. కోర్సును పూర్తి చేసిన తర్వాత గ్రామీణ, పారిశ్రామిక ప్రాంతాలలోని పేదలకు, శ్రామికులకు వైద్య సేవలను అంకితభావంతో చేస్తున్నారు. అమరుడు శంకర్‌గుహనియోగితో కలిసి గని కార్మికుల సహాయంతో బిలాస్‌పూర్ షహీద్ అనే ఆసుపత్రిని నెలకొల్పి ప్రజలకు వైద్యసహాయం అందిస్తున్నారు. ప్రభుత్వ పథకాలలో 'కమ్యూనిటి బేస్డ్ హెల్త్ ప్రోగ్రాం' ఒకటి, ఆ ప్రోగ్రాం సలహా మండలిలో డాక్టర్ సేన్‌ను ప్రభుత్వమే ఒక సభ్యుడిగా నియమించింది. మహానది డ్యాం నిర్వాసితులకు వైద్యసేవలను అందించారు. ఆ క్రమంలో ఆయనకు అనేక స్వచ్ఛంద సంస్థలతో సంబంధాలు ఏర్పడ్డాయి. వ్యాధిగ్రస్తులకు చికిత్స చేయడం డాక్టర్ విధి. వ్యాధిగ్రస్తులు ఏ సంస్థకు సంబంధించిన వాళ్లు అని డాక్టరు విచారించడు. అలా విచారించడం సరైంది కూడా కాదు. ఆ క్రమంలో నిషిద్ధ సంస్థలకు చెందిన కార్యకర్తలకు కూడా చికిత్స చేసి ఉండవచ్చు. అందులో అక్రమం లేదు. తప్పుపట్టాల్సింది లేదు.

చట్టవిరుద్ధంగా రాజ్యాంగ యంత్రం (పోలీసులు, పారా మిలిటరీ బలగాలు) పౌరుడి ప్రాణాన్ని హరించటం నేరం అన్న రాజ్యాంగ నిబంధన అమలు కోసం డాక్టర్ బినాయక్ సేన్ గత కొన్ని సంవత్సరాలుగా క్రియాశీలకంగా వ్యవహరిస్తున్నారు. ఛత్తీస్‌గడ్‌లో గత రెండు సంవత్సరాల కాలంలో జరిగిన 155 బూటకపు ఎన్‌కౌంటర్ల సమాచారాన్ని ఆయన సవివరంగా సేకరించి సిడిలలో భద్రపరిచారు. దేశంలోని అనేక హక్కుల సంఘాలను రాయపూర్‌కు ఆహ్వానించి సదస్సులు, బహిరంగసభలు, ఊరేగింపులు నిర్వహించారు. మానవతా సమాజం ఆయన ప్రగాఢ వాంఛ.

ఛత్తీస్‌గడ్ ప్రభుత్వం చట్టవిరుద్ధంగా సాగిస్తున్న హింసాకాండ దేశదేశాల్లో వెల్లడికావడం భరించలేక, సహించలేక, ప్రజాస్వామిక మేధావి అయిన డాక్టర్ సేన్‌ను పథకం ప్రకారం బెయిల్ రాని సెక్షన్ కింద కేసుపెట్టి కటకటాల్లో బంధించింది రమణసింగ్ ప్రభుత్వం.

ప్రజలందరూ ఈ పార్టీలోనే చేరండి, ఫలానా పార్టీలో చేరవద్దు, ఫలానా వాళ్లకు చికిత్స చేయవద్దు, న్యాయసహాయం చేయవద్దు, బట్టలు కుట్టవద్దు అని చెప్పే హక్కు ఈ పాలకులకు, పార్లమెంట్‌కు కూడా లేదు.

డాక్టర్ సేన్‌ను నిర్బంధించటం ద్వారా ప్రాథమిక దశలో ఉన్న హక్కుల ఉద్యమాన్ని పూర్తిగా నిర్మూలించాలనే ఆ రాష్ట్ర ప్రభుత్వ దుష్టపన్నాగాన్ని విఫలం చేయడానికి దేశవ్యాప్తంగా ప్రజలు, ప్రజతంత్ర వాదులు ఆందోళన చేయాలి.

**– వి. నారాయణరెడ్డి**
హైదరాబాదు

**నే**రం కూడా సమాజంనుంచి ఉత్పన్నమయ్యేదే కానీ తానంతటది శూన్యం నుండి ఊడిపడేది కాదు. అందుకే నేరస్తులను సంస్కరించడం, క్షమించడం, సమాజం మీద ఉన్న గురుతర బాధ్యతలు. దేశదేశాల సమాజాలన్నిటితో పాటు మన సమాజం కూడా ఈ బాధ్యతను స్వీకరించింది. అయితే శిక్షతోనే కాదు క్షమాభిక్షతోనూ నేరాన్ని అదుపు చేయవచ్చునేది ముమ్మాటికి వాస్తవం. క్షమాభిక్ష నేరస్తుడిలో పశ్చాత్తాపాన్ని కలిగిస్తుంది. శిక్ష కలిగించే భీతికంటే క్షమాభిక్ష పుట్టించే పశ్చాత్తాపం సమాజానికి ఎక్కువ మేలు చేస్తుంది. మన మత గ్రంథాలు, పురాణాలు కూడా క్షమకు ప్రాధాన్యం ఇచ్చాయి. శత్రువైనా, శరణుకోరిన వారిని ఆదరించడం, క్షమించడం మన భారతదేశ సాంప్రదాయం.

రాష్ట్రంలోని జైళ్లలో మగ్గుతున్న ఖైదీలకు, ఇతర రాష్ట్రాలలోని జైళ్లలో మగ్గుతున్న ఖైదీలకు ఏ మాత్రం పోలిక లేనేలేదు. మన రాష్ట్రంలోని జైళ్లలో మగ్గుతున్న వారిలో ఎక్కువమంది వ్యవసాయ భూతగాదాల వల్ల, అత్యంత నిరుపేద కుటుంబాల నుంచి వచ్చిన వారేనన్న సంగతి జగమెరిగిన సత్యం. క్షణికావేశంలో పెద్ద, చిన్న నేరాలుచేసిన ఖైదీల భార్య బిడ్డలు, ముసలి తల్లిదండ్రులు జీవనోపాధిలేక, సమాజంలో ఆదరణ లేక ఆకలితో అలమటిస్తున్నారు. అనారోగ్యం పాలై అకాల మృత్యువాత పడుతున్నారు. వారి కుటుంబాలు చిన్నాభిన్న మవుతున్నాయి. వారి పిల్లలైతే సరియైన విద్యకు నోచుకోలేక బాల కార్మికులుగా, బాలనేరస్తులుగా మారే దుస్థితికి గురి అవుతున్నారు.

ఖైదీల కుటుంబాలకు జీవనాధారమైన పెద్దదిక్కు జైళ్లలో దీర్ఘకాలికంగా మగ్గుతున్నందువలన ఖైదీల కుటుంబాలలోని వారు ఘోరమైన శిక్షను అనుభవిస్తూ నిరంతరం రోదిస్తూ కుమిలి పోతున్నారు. మానసిక వేదనతో కృంగిపోతూ, బిక్కుబిక్కుమంటూ ప్రతిక్షణం 'క్షమాభిక్ష ద్వారా మమ్మల్ని విడుదల చేయకపోతారా, ఆదుకోకపోతారా' అని కళ్లు కాయలు కాసేలా ఎదురుచూస్తున్నాం.

**– జీవిత ఖైదీలు**
కేంద్ర కారాగారం, కడప

**వీ**క్షణం సెప్టెంబర్ సంచికలో ఫోకస్‌గా వచ్చిన 'ఆంధ్రప్రదేశ్‌లో భూమి సమస్య – పరిష్కారాలు' అన్న అంశంపై వచ్చిన వ్యాసాలు బాగున్నాయి. ఆలోచించాల్సిన కోణాలనూ, ప్రశ్నలనూ విధానకర్తల ముందుంచింది. అలాగే కోనేరు రంగారావు కమిటీ సిఫారసులన్నింటినీ ఒక దగ్గర ప్రచురించడం వలన పాఠకులకు, ఆలోచనాపరులకు, ఉద్యమాలు చేసేవారికి కరదీపికగా ఉంటుందనడంలో ఎటువంటి సందేహం లేదు.

**– కె. గోపాలకృష్ణ**
నిజామాబాద్

**వీ**క్షణం ఇటీవల కాస్త గాఢత తగ్గినట్లు అనిపిస్తోంది. ఇ.పి.డబ్ల్యూ ఆదర్శంగా ప్రకటించుకున్న వీక్షణం పలుచనై పోకుండా లోతైన విశ్లేషణలు అందించాలని, అందిస్తుందని ఆశిస్తున్నాం.

**– ఎం.డి. ఇబ్రహీం**
కాకినాడ

**ఇ**టీవలి కాలంలో పత్రికలలో తెలుగుభాష చాలా అధ్వాన్నంగా ఉంటోంది. సాహిత్య పత్రికల్లో కూడా భాషాదోషాలు ఉంటున్నాయి. ఇక దినపత్రికల సంగతి చెప్పక్కర్లేదు. దీనంతటికీ అధ్యయనం లోపం కొట్టొచ్చినట్లు కనపడుతోంది. ముఖ్యంగా కొత్తతరం రచయితలు సాహిత్యం, చరిత్ర, తత్వశాస్త్రాలు ఇతోధికంగా చదవాల్సిన అవసరం ఎంతో ఉంది. పరాయి భాషలో సరిగా రాయలేకపోతే అర్థం చేసుకోవచ్చు. కాని మాతృభాషలోనే ఇంత వెనుకబడి పోతున్నామంటే ఇది ఆలోచించాల్సిన విషయం. ప్రముఖ రచయితలు అనుకుంటున్న వారి రచనల్లోనూ చాలా భాషాదోషాలు దొర్లుతున్నాయి. భాషను ఒక సమష్టి కృషిగా, బాధ్యతతో, శ్రద్ధతో మనం నిరంతరం అభివృద్ధి చేసుకొని, కాపాడుకోవాల్సిన అవసరం ఉంది. అది ఒక వ్యక్తి వల్లనో, ఒక పత్రిక వల్లనో సాధ్యం కాదు. వీక్షణం సాహిత్య పత్రిక కాకపోయినప్పటికి ఈ సూచనను పరిగణిస్తారని ఆశిస్తున్నాం.

**– పి. చంద్రశేఖర్**
నెల్లూరు

## హైదరాబాద్ అన్నిటా 'ఏవన్'

హైదరాబాద్ నగర జనాభా యాభైలక్షలు దాటడం, ఇంకా ఇతర ప్రమాణాలతో 'ఏ1' హోదాను ఇటీవలే సంతరించుకుంది. దరిమిలా కేంద్ర, రాష్ట్ర ఉద్యోగులకు ఇంటిభత్యం, నగర భత్యం లాంటివి పెరుగుతాయి. పెట్టుబడిదారులకు, వ్యాపారవర్గాలకు మరిన్ని రాయితీలు సమకూరుతాయి. బడుగుజీవులకు మాత్రం జీవితం మరింత భారం అవుతుంది. మక్కా మసీదు పేలుళ్లు, కోఠీ, లుంబిని పార్కుల్లో పేలుళ్లు, నాలుగు చినుకులు పడితే జలమయం అయ్యే రోడ్లు, నాలాల్లో కొట్టుకు పోయే ప్రాణాలు, కూలిపోయే ఫ్లై ఓవర్లు, బిల్డింగులు, జల, వాయు, శబ్ద కాలుష్యాలలోనూ ఏ-1 స్థానం సంపాదించుకుంది. లక్షలాది వాహనాల పొగలు, సెగలతో, క్యాన్సర్ కారక వాతావరణంతో ఒకప్పటి 'వెయ్యి సరస్సుల నగరం' కాస్తా వెయ్యిన్నొక్క ప్రమాదాల నగరంగా మారిపోయింది. హత్యలు, ఆత్మహత్యలు, రోడ్డు ప్రమాదాలు, వ్యభిచారం అన్నిటా ఏ-1 హోదాకు నిజంగానే అర్హతపొందింది. దాహానికి రూపాయి నీళ్లప్యాకెట్లు, మూత్రశాలకు రూపాయి చెల్లించే వ్యాపార సంస్కృతికి చిరునామా అయిపోయింది. పది జిల్లాల తెలంగాణ పేద రైతాంగం, ప్రజలు వైద్యం కోసం ఆధారపడే గాంధీ, ఉస్మానియా ఆసుపత్రులు ఫిట్ సర్టిఫికెట్‌లు కాకుండా పోస్టు మార్టమ్ నిర్వహించి డెత్ సర్టిఫికెట్లు జారీచేసే కేంద్రాలుగా మారిపోయాయి. ఏ1 హోదాతోనైనా ఈ సమస్యలపై దృష్టిపెడతారా, వేచి చూడాల్సిందే.

## స్థలమేదైనా

స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలు, లైంగికహింస, ఇంటా బయటా, పనిచేస్తున్న స్థలంలో, పోలీసు పహారాల్లో (?) ఒకటే పరిస్థితిని సూచిస్తూ భ్రష్టుపట్టిన సమాజ పరిస్థితికి అద్దం పడుతోంది. రాష్ట్రంలోనూ, దేశంలోనూ ఒకటి తరువాత ఒకటి స్త్రీలపై అత్యాచారాలు, హత్యలు, అవమానభారంతో ఆత్మహత్యలు జరుగుతున్నాయి. కడప శివానంద పురానికి చెందిన సునీత (27) ఓ ప్రైవేట్ స్కూల్లో టీచర్‌గా పనిచేస్తున్నారు. జగదీశ్వర్‌రెడ్డి, నరేంద్రకుమార్ అనే మతీ, గతీ తప్పిన కుర్రాళ్లు టీచర్ స్నానం చేస్తుండగా సెల్‌ఫోన్‌లో చిత్రీకరించామనీ, ఐదువేలు ఇవ్వకపోతే సిడిలు బయటికి విడుదల చేస్తామని బెదిరించడంతో ఆమె మనస్తాపానికి గురై ఆత్మహత్య చేసుకున్నారు. ఫిర్యాదు చేసినా పట్టించుకోని పోలీసుల నిర్లక్ష్యం కూడ ఈ పరిస్థితికి కారణమని తెలుస్తోంది. మరోపక్క సినీనటి మోనికాబేడి భోపాల్ సెంట్రల్ జైల్లో ఉన్నప్పుడు స్నానం చేస్తుండగా రహస్య కెమెరాలో చిత్రీకరించినవిగా పేర్కొంటూ ఓ ప్రైవేట్ టీవీ ఛానల్ (జీ న్యూస్) నిస్సిగ్గుగా, విలువల రాహిత్యంతో ఆ చిత్రాలను ప్రసారం చేసింది. జైలు సూపరింటెండెంట్ మాత్రం ఫోటోగ్రఫీ మాయాజాలంగా పేర్కొన్నారు.

## నేదురుమల్లి లక్ష్యంగా ...

సెప్టెంబర్ 7న మాజీ ముఖ్యమంత్రి, ప్రస్తుత విశాఖ ఎం.పి. నేదురుమల్లి జనార్ధనరెడ్డి మావోయిస్టులు పేల్చిన మందుపాతర నుంచి తృటిలో బయటపడ్డారు. రాష్ట్ర మంత్రి, ఆయన భార్య రాజ్యలక్ష్మి కూడా ఆయనతో పాటు ఉన్నారు. తిరుపతిలోని ఎస్.వి. యూనివర్సిటీలో గౌరవ డాక్టరేట్ అందుకోవడానికి నెల్లూరు జిల్లాలోని వాకాడులోని తన స్వగృహం నుండి బయలుదేరారు. నాలుగో వాహనంలో ఉన్న ఇద్దరు కాంగ్రెస్ కార్యకర్తలు, జీపు డ్రైవర్ మరణించారు. నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడే 1992 మే 21న రాజీవ్‌గాంధీ మొదటి వర్ధంతి సందర్భంగా అప్పటి పీపుల్స్‌వార్ నక్సలైట్లపై నిషేధం విధించారు. ఆయన హయాంలో జరిగిన ఎన్‌కౌంటర్లలో చాలామంది నక్సలైట్లు చనిపోయారు.

## చదివేది ఎట్లా?

సంక్షేమ హాస్టళ్లను సామాజిక బాధ్యతతో, చిత్తశుద్ధితో నిర్వహించాలంటూ రాష్ట్ర హైకోర్టు ప్రభుత్వానికి ఇటీవలే సూచించింది. ఇది దృష్టిలో పెట్టుకొని సెప్టెంబర్ మొదటివారంలో సంక్షేమశాఖ ఉన్నతాధికారులు జిల్లాల్లో పర్యటించి 120 హాస్టళ్లను తనిఖీ చేశారు. అత్యధిక హాస్టళ్లలో పసుపు అన్నం, చింతపండుచారు మాత్రమే ఆహారంగా ఇస్తున్నట్టు అధికారులే స్వయంగా గుర్తించారు. ప్రభుత్వం ప్రకటించిన పౌష్టికాహారం ఎక్కడా అమలుకావడంలేదని తేలింది. గత రెండేళ్లుగా హాస్టళ్ల నిర్వహణ కింద ప్రభుత్వం నిధులు విడుదల చేయడం లేదు. రాష్ట్రంలో 645 హాస్టళ్లలో పారిశుధ్యం జాడ లేదు. వీటిలో 120 బాలికల హాస్టళ్లు ఉన్నాయి. స్నానపు గదులు, మరుగుదొడ్లు వాడుకోలేని విధంగా దుర్గంధాన్ని వెదజల్లుతున్నాయి. దీనివల్ల ఆరుబయటే కాలకృత్యాలు వెళ్లదీసుకోవాల్సి వస్తోంది. ఇటీవలే అనంతపురం జిల్లా కదిరిలో ఓ బాలిక కాలకృత్యాలు తీర్చుకునేందుకు బయటకు వెళ్లినప్పుడు అత్యాచారానికి గురైన సంఘటన జరిగింది. ఎటువంటి కనీస సౌకర్యాలు లేకుండా భావి భారత పౌరులు ఎలా నిలదొక్కుకుంటారు?

## వర్షాలు - వరదలు - కన్నీళ్లు

సెప్టెంబర్ మూడవ వారంలో ఎడతెరిపిలేకుండా కురిసిన భారీవర్షాలకు పంటనష్టం, ప్రాణనష్టం జరిగాయి. 1.5 లక్షల హెక్టార్లలో పంటలు దెబ్బ తిన్నట్టు అధికారులు అంచనా వేస్తున్నారు. ప్రాథమిక అంచనాల ప్రకారం పంటనష్టం రు. 350 కోట్ల వరకు ఉండవచ్చని తెలుస్తోంది. గత ఏడాది నష్టాల నుంచి ఊపిరి తీసుకోకముందే మళ్లీ నష్టం. కొన్ని ప్రాంతాల్లో అతివృష్టి, కొన్ని ప్రాంతాల్లో అనావృష్టితో రైతాంగం అతలాకుతలం అవుతోంది. సెప్టెంబర్ 20 నాటికి పిడుగుపాటుకు 15 మంది, వరదలకు 37 మంది మరణించారు. వివిధ జిల్లాల్లో 57 గ్రామాలు వరద తాకిడికి గురయ్యాయి. ప్రభుత్వాలకు దీర్ఘకాలిక ప్రణాళికలు, ముందుచూపు కొరవడడం వలన ఏటా ఆ కష్టాన్నీ, నష్టాన్నీ రైతాంగం, సామాన్య ప్రజానీకం మోస్తోంది.

## అర్థాంతరంగా ముగిసిపోతున్న జీవితాలు

1996 నుండి 2006 వరకు రాష్ట్రంలో దాదాపు 3.5 లక్షల రోడ్డు ప్రమాదాలు జరగ్గా లక్షమందికి పైగా మృతిచెందారు. 4.67 లక్షల మంది క్షతగాత్రులయ్యారు. అర్థరహితంగా మరణిస్తున్న, అసహజ మరణాల పాలవుతున్న పౌరసమాజం ఆగి ఆలోచించాల్సిన అవసరాన్ని ఈ అంకెలు సూచిస్తున్నాయి. మనిషి ప్రాణం పట్ల బాధ్యతలేనితనాన్ని, నిర్లక్ష్యస్వభావాన్ని మొత్తంగా సామాజిక రోగలక్షణాన్ని ఈ మరణాలు చూపుతున్నాయి. ◆

**ప్రభుత్వాలు ఏదో ఒక వివాదాన్ని లేవనెత్తి, ఆ అరుపులు గందరగోళాల మధ్య శాస్త్రీయమైన చర్చ లేకుండా ప్రమాదకరమైన విధానాలను ప్రజలపై రుద్దుతుయని అంటున్నారు జి.ఎస్. రామ్మోహన్**

# రామసేతుపై కిష్కింధకాండ

**భా**రతదేశంలో భారీ ప్రాజెక్టులను వ్యతిరేకించే శ్రేణుల్లోకి విచిత్రమైన శ్రేణి ఒకటి వచ్చి చేరింది. అది హిందూ అతివాదుల సమూహం. సేతు సముద్రం అటువంటి చిత్రమైన పరిస్థితిని తెచ్చిపెట్టింది. వాళ్లు అణు విస్ఫోటనాలను దిక్కులు పిక్కటిల్లేలా సమర్థించారు. వ్యతిరేకించినవారిని జాతివ్యతిరేకులంటూ నిందించారు. నర్మద ఆనకట్ట నిర్మాణానికి మద్దతుగా నిలిచారు. ఆనకట్ట నిర్మాణానికి వ్యతిరేకంగా, నిర్వాసితుల హక్కుల కోసం పోరాడుతున్న సంస్థలను అభివృద్ధి నిరోధకులంటూ నిందించారు. చివరకు దాడులకు సైతం తెగబడ్డారు. అప్పుడు ఎంత తప్పుడు కారణాలతో వాటిని సమర్థించారో ఇపుడు అంతే తప్పుడు కారణాలతో సేతు సముద్రాన్ని వ్యతిరేకిస్తున్నారు. మరోవైపు ఉన్నట్టుండి డిఎంకె పెరియార్ కాలానికి వెళ్లిపోయింది. కరుణానిధి పాతబడిన నాస్తికవాదానికి పదును పెట్టుకుంటూ వస్తున్నారు. ప్రాజెక్ట్‌ను వెనక్కునెట్టి రాముడు సెంటర్ స్టేజీ ఎక్కేసాడు. సేతు సముద్రాన్ని ఇజ్జత్‌కి సవాల్‌గా డిఎంకె తీసుకోవడం వల్ల జరుగుతున్న పరిణామాలా? కొడిగడుతున్న కరుణానిధి చివరి దశలో ఒక్క ద్రావిడ వెలుగువెలిగి వెళ్లిపోవాలని ఆశిస్తున్నాడా? లేక అణు వివాదాన్నుంచి యుపిఏను గట్టెక్కించడానికి పన్నిన పన్నాగమా? అనేక ప్రశ్నలు ముందు కొస్తున్నాయి. ఏతా వాతా ఇంతకుముందు ఏ భారీ ప్రాజెక్టుకు లేనన్ని రాజకీయపరమైన కోణాలను సేతుసముద్రం ముందుకు తెచ్చింది. వాటిలోకి వెళ్లే ముందు అసలు సేతు సముద్రం అంటే ఏమిటో నాలుగు ముక్కలు మాట్లాడుకుందాం.

భారత్-శ్రీలంకల మధ్యన పాక్ జలసంధి గుండా ఓడల ప్రయాణానికి అనువైన కాలువలను తవ్వడానికి ఉద్దేశించిన ప్రాజెక్ట్ సేతు సముద్రం. నిర్దిష్టంగా భారత్ వైపున్న పాక్ జలసంధిని శ్రీలంకవైపున్న మన్నార్ ప్రాంతాన్ని కలుపుతూ నిర్మించే ఓడమార్గం. అంటే భారత్ నుంచి శ్రీలంకకు, శ్రీలంకనుంచి భారత్‌కు అని మాత్రమే కాదు. ఆ మార్గంలో అని అర్థం. భారత్‌లోని తూర్పుతీరానికి గానీ చైనాకో, బంగ్లాదేశ్‌కో, మరో తూర్పుదేశానికో పశ్చిమం నుంచి వెళ్లడానికి గాని ఇది మార్గాన్ని సులభతరం చేస్తుంది. ఇపుడు అసలు మార్గమే లేదా అంటే ఉంది. ముంబాయి నుంచి విశాఖ రావాలన్నా ప్రస్తుతం శ్రీలంక చుట్టూ తిరిగి పోవాల్సి వస్తోంది. శ్రీలంక భారత్ మధ్యన ఉన్న రామసేతు(ఆడమ్స్ వంతెన), పాక్ జలసంధి కారణంగా ఓడలు వెళ్లగలిగే అవకాశం లేదు. దీనివల్ల మన కోస్ట్‌గార్డ్, నేవీ ఓడలతో పాటు అంతర్జాతీయ సరుకు రవాణా ఓడలన్నీ తూర్పు తీరానికి వెళ్లాలంటే శ్రీలంకను చుట్టుకుని పోవాల్సి వస్తోంది. ఆ ప్రయాసను తప్పించడానికి ఈ ఓడమార్గం ఏర్పాటు చేస్తున్నారు. శ్రీలంక వారి మన్నార్ తీరంనుంచి పాక్ జలసంధిని కలుపుతూ రామసేతు గుండా దీన్ని తవ్వుతారు. మొత్తం రెండు కాలువలుంటాయి. ఒకటి నేరుగా రామసేతు గుండా తవ్వుతారు. రెండోది పాక్ జలసంధిని మరింత లోతుగా తవ్వి ఏర్పరుస్తారు. ఈ ఐడియా నిన్న కాక మొన్న వచ్చిందేమీ కాదు. 1860లో ఎడి టేలర్ అనే బ్రిటిష్ కమాండర్ ఇటువంటి ప్రాజెక్టు ప్రతిపాదన చేశారు. ఎందుకో అది అమలు కాలేదు. తర్వాత భారత ప్రభుత్వం 1955లో ప్రాజెక్టు సాధ్యాసాధ్యాల గురించి కమిటీ వేసింది. అనేక కమిటీలు మారిమారి 2000-2001లో ఒక రూపు తీసుకుంది.

ఇక్కడ పదేపదే ప్రస్తావనకు వస్తున్న రామసేతు గురించి కూడా రెండు మాటలు మాట్లాడుకోవాలి. పేరును చూసి అదేదో నిజంగానే వంతెన అనుకునే ప్రమాదముంది. రామసేతు అనేది శ్రీలంక భారత్‌ల మధ్యన తక్కువ లోతులో ఉండే ఇసుకదిబ్బల, చిన్నచిన్న దీవుల సమాహారం. ఒక రకంగా సముద్రపు మెరక. 'లేదులేదు అది నిజంగానే వంతెన. రాముడి కోసం కట్టారు. మా వాళ్లే కట్టారు ..కావాలంటే చూడండి' అని ఎవరైనా కుప్పిగంతులు పిల్లిమొగ్గలు వేసి నిరూపించాలనుకుంటే నిరూపించుకోవచ్చు. మనం చేయగలిగింది ఏమీ లేదు. అంత పవిత్రమైన వంతెన అలాగే తేలుతూ ఉండకుండా ఎందుకంత నీళ్లలోకి కుంగిపోయింది లాంటి హేతువాద ప్రశ్నలు వేసి ఫలితముండదు. 'పాపం పెరిగిపోయి' అని సమాధానలివ్వగలరు వాళ్లు. హేతువు ఒక్క ప్రశ్న వేస్తే విశ్వాసం వంద సమాధానాలు చెపుతుంది. ఎందుకంటే దానికి లాజిక్ అవసరం లేదు. 'రాముడు-వానరసేన లాంటి దైవ వ్యవహారం కాకపోయినా అపుడెపుడో ఇవాల్టికంటే మెరుగైన నాగరికతే విరాజిల్లి ఉండవచ్చును. నిజంగానే వంతెన నిర్మాణం జరిగి ఉండవచ్చును. తదుపరి అది యిలా అయి ఉండవచ్చును' అని పురాణాలకు చారిత్రక అంశను అద్దే వారూ ఉండవచ్చును. అటువంటి వారికి కొదువ లేదు. వేరెవరో ఎందుకు, మన సిపిఎం మేధావి ఏచూరి వారే అన్నా ఆశ్చర్యపోనక్కర్లేదు. వారు నిన్న కాకమొన్ననే మహీధర వారిని అరువుతెచ్చుకుని ఆది మహా విష్ణువు దశావతారాలకు భౌతికవన్నెలద్దిఉన్నారు. 'అది వంతెన అయినా కాకపోయినా అదొక అద్భుతమే కదా! దాన్నెందుకు పాడుచేయాలి' అని కూడా అనుకునేవారుండొచ్చు. ఎంత అద్భుతమైనా అది నాసా కళ్లతో చూస్తే తప్ప కనిపించనిదీ ఉపయోగపడనిదీ, కనీసంలో కనీసం

తాజ్‌మహల్‌లాగా చూసి ఆనందించునది కూడా కాదు. ఎందుకు పోనిద్దురూ' అని సమాధాన పడువారుండవచ్చును. ఊహాత్మకంగా తప్ప భౌతికంగా ఉపయోగపడని ఈ రామసేతును తవ్వితే తప్ప సముద్రమార్గం తవ్వలేము అని దానిని సమర్థించువారు అనుకోవచ్చును. ఎన్నిరకాలుగానైనా అనుకోవచ్చును. తప్పులేదు. కానీ దాన్ని రాజకీయ పనిముట్టుగా ఉపయోగించుకోవాలనుకోవడమే ప్రమాదం. సేతు సముద్రం మీద నిప్పులు చెరుగుతున్న వారు గుర్తించవలసినది ఒకటుంది. ఇది నిర్దిష్ట రూపం దాల్చింది, స్థూలమైన డిజైన్ రూపొందింది వారి హయాంలోనే. ఘనత వహించిన ఎన్డీఏ హయాంలో నావికాదళ అధికారులు దాని చోదక శక్తులు. జార్జి ఫెర్నాండెజ్ గారు అప్పటి రక్షణ మంత్రి. వాజపేయి ప్రధాని. సెలక్టివ్ జ్ఞాపకశక్తి, సెలక్టివ్ మతిమరుపు రాజకీయాల్లో ఆనవాయితీగా మారి చాలా కాలమే అయింది. గొంగలిని ఏరే పని జయప్రకాశ్ నారాయణ్ గారికి వదిలేద్దాం. బిజెపి హయాంలో వారికి అభ్యంతరం కనిపించలేదు. ముఖ్యంగా కోస్ట్‌గార్డ్, నేవీలు తమ అవసరాల కోసం ఈ ప్రాజెక్టు పనిని వేగిరంచేసినా వారికేమీ అనిపించలేదు. ఇపుడు కాంగ్రెస్ హయాంలో అదివారికి మహాపాపంగా నేరంగా కనిపిస్తోంది.

పురావస్తు శాఖ అఫిడవిట్‌లో ఏమి రాసింది? విపరీతమైన ప్రచారం జరిగినట్టుగా అదేమీ 'దైవనింద'కు పాల్పడలేదు. 'రామసేతుకు సంబంధించి రామాయణంలో పేర్కొన్న పాత్రలు కానీ ఘటనలు కానీ వాస్తవాలనడానికి ఆధారాలు లేవు' అని చాలా డిప్లమేటిక్‌గానే పేర్కొంది. శాస్త్రజ్ఞులు అలా కాకుండా ఎలా రాయాలి? రామ రామ జయరామ జయజయరామ అని అఫిడవిట్‌లో రాస్తే వాళ్లు మనగుళ్లో తాళాలు కొట్టే భక్త శిఖామణులవుతారు కానీ నిపుణులెలా అవుతారు? వారిపని వారు చేయాలికదా? దైవానికి ఆధారాలు అక్కర్లేదు అని భక్తులు అనవచ్చును. అంతేకానీ అదేదో ఘోరం జరిగిపోయినట్టు ఊరూ వాడా ఏకం చేస్తే, మీడియా కూడా దానికి వంతపాడితే ఏమనుకోవాలి? ఇక కరుణానిధి ఏమన్నాడు? రాముడు లేడన్నాడు. అంతమాత్రానే హిందువుల మనోభావాలు గాయపడడమేమిటో అర్థం కాదు. ఈ మనోభావాలు అనేదొక బ్రహ్మపదార్థం. చెవుల్లో మైకులు కట్టి అల్లాను, అయ్యప్పను, గణేశున్ని పెట్టి డిజిటల్ డాల్బీ సౌండ్లతో హింసిస్తుంటే ఎవరి మనోభావాలు గాయపడవు. రోడ్లకు అడ్డంగా గుళ్లూ గోపురాలూ, మసీదులు కట్టి షామియానాలు వేసి ఇష్టమొచ్చినట్టు అందరినీ ఇబ్బంది పెట్టినా ఎవరి మనోభావాలు గాయపడవు. సర్కారువారు కోట్లకు కోట్లు ఖర్చుపెట్టి విమానాలెక్కించి మక్కాకు, గుర్రాలెక్కించి వైష్ణోదేవి ఆలయాలకు పంపిస్తుంటే మనోభావాలు గాయపడవు. సొంత వాస్తుపిచ్చికోసం కార్యాలయాలు కూల్చి ఎక్కడంటే అక్కడ గోడలు లేపి ప్రజాధనానికి గోతులు తీస్తున్నా మనోభావాలు గాయపడవు. ఊర్కే లేడు అన్నందుకే అంతగా గాయపడితే ఎలా? విశ్వాసాలు ప్రకటించుకునే హక్కు ఒక్క ఆస్తికులకే పరిమితమైతే ఎలా? ఎంత బుల్‌డోజింగ్ మెజారిటీ అయితే మాత్రం! నాస్తికుల అభిప్రాయవ్యక్తీకరణకు రవ్వంతైనా చోటుండదా! దైవాన్ని నమ్మని వ్యక్తి తొలి ప్రధానిగా పనిచేసిన దేశంలో! తమ ఆరాధ్యసంస్థలు ఆరెస్సెస్, ముస్లింలీగ్ వ్యవస్థాపకులు హెగ్డేవార్, జిన్నాలిద్దరూ దైవమును నమ్మువారలు కారన్న స్పృహ నేటి మత తీవ్రవాదులకు ఉందా అసలు! బహుశా కనీసం నిజమైన విశ్వాసం నుంచి కూడా కాకుండా దాన్ని రాజకీయ ఆయుధంగా ఉపయోగించుకునే వారసత్వం నుంచి రావడం వల్ల కాబోలు రెండింటి తీవ్రవాదుల్లోనూ ఆ బూటకత్వం కనిపిస్తుంది. హిందూ అతివాదులు హడావిడి చేయడంవల్ల కరుణ మరింత మొండిగా రాముడు తాగుబోతని వాల్మీకిని ఉటంకించడం మనం చూస్తూనే ఉన్నాం.

కరుణానిధిది నిజమైన నాస్తికత్వమా లేక సెలక్టివ్ నాస్తికత్వమా అనే ప్రశ్న ముందుకొస్తున్నది. యుపిఏ సర్కారును అణువివాదం నుంచి, వామపక్షాల బెదిరింపుల నుంచి కాపాడడానికి ఈ కురువృద్ధుడు వేసిన పాచిక అనే అభిప్రాయం ఉంది. అంటే దారుణంగా దెబ్బతిని చతికిల పడిఉన్న శత్రువు బిజెపి చేతికి చిన్న పాటి ఆయుధాన్ని అందించి తద్వారా వామపక్ష మిత్రులు తొందరపడి మధ్యంతరానికి వెళ్లకుండా కొంత బ్రేక్ వేసే ఆలోచన ఉండొచ్చని అంచనా. నిజంగా అంత నాస్తిక శిఖామణి అయితే అయోధ్య వివాదమప్పుడు కరుణానిధి ఏమయ్యాడు అనేది దీనికి అనుబంధమైన ప్రశ్న. అయితే తాత్కాలిక రక్షణ కోసం ఇంత ఆత్మహత్యాసదృశమైన వ్యూహానికి పాల్పడతారా? కాంగ్రెస్ మరీ అంతదూరం వెడుతుందా?

ఈ అంశాన్ని మరోరకంగా కూడా చూడొచ్చు. కరుణానిధి ఈ ప్రాజెక్టు అమలును ప్రతిష్ఠాత్మకంగా తీసుకుని ఉండవచ్చును. ఆయన కొన్ని విషయాల్ని ఎలా తీసుకుంటారో ఎలా సాధించుకుంటారో మనం గతంలో ట్యుటికోరన్ విషయంలో చూశాం. అంతేకాదు. ఇతర రాజకీయ పార్టీలకు తమిళ పార్టీలకు మధ్య ఒక తేడా ఉంది. అందరూ థింక్ గ్లోబల్లీ యాక్ట్ లోకల్లీ అనుకుంటే తమిళ నేతలు థింక్ లోకల్లీ యాక్ట్ లోకల్లీ అనుకునే రకం. వారికి వారి రాష్ట్రం దానికదే గానే ప్రపంచం. చాల అంశాల్లో వారిది ప్రాపంచిక దృక్పథం కాదు– రాష్ట్రీయ దృక్పథం. రెండు జర్మనీలు కలుస్తున్నాయి అంటే అయితే మాకేంటి అనేవాళ్లు అక్కడ ఎక్కువగానే తగుల్తారు. ప్రజలకు కాకపోయినా నాయకులది మాత్రం కొంతకాలంగా అదే పరిస్థితి. అయోధ్య వ్యవహారం తమిళనాడుపై పెద్దగా ప్రభావం చూపగలిగిన అంశం కాదు. రాష్ట్రంపై ప్రభావం చూపనప్పుడు అది ఎంత తీవ్రమైన విషయమైనా కరుణ స్పందిస్తారని ఊహించలేం. కరుణానిధి సేతు సముద్రాన్ని ప్రతిష్ఠాత్మకంగా తీసుకొని ఉండవచ్చు. జనతా హయాంలో సంఘపరివారకులు వ్యూహాత్మకంగా విద్య, మానవవనరులు, సమాచార మంత్రిత్వ శాఖలు తీసుకున్నట్టే కరుణ కేంద్రంలో ఏరి కోరి షిప్పింగ్, పర్యావరణ శాఖలు(పర్యావరణం ప్రధాని దగ్గరే ఉండడంతో సహాయమంత్రితో సరిపెట్టుకున్నారు) తీసుకున్నారు. ముందుచూపుతోనే అవి తీసుకున్నారని అనుకోవచ్చు. దీనికి హిందూ అతివాదులు అడ్డుపడగానే వారి అభ్యంతరాలకు మూలమైన దైవాంశపైనే దెబ్బకొట్టాలని ఆయనలోని ద్రావిడ ఉద్యమకారుడు ఉబలాటపడి ఉండవచ్చును. పైపెచ్చు అంత్యదశలో మళ్లీ లోలోపలి ఉద్యమకారుడిని సంతృప్తిపర్చుకోవాలనే తపన కూడా ఉండవచ్చును. ఏమైనా కావచ్చును. ఇదే సత్యమని ఇపుడిపుడే చెప్పలేము. ఏమైనా ఒక రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉండి రాబోయే ఎన్నికల్లో విజయానికి ఇప్పటినుంచే పావులు కదుపుతున్న నేత ఇటువంటి ప్రకటనలు ఇవ్వడానికి ఎంత ధైర్యం కావాలి. తన ప్రజలపై ఎంత నమ్మకముండాలి. ఇంతటి నమ్మకాన్ని, ధైర్యాన్ని ఇచ్చిన ద్రావిడ ఉద్యమానికి జోహార్లు. దేశంలో ఎక్కడా కనిపించనంతటి గుళ్లూ, గోపురాలు గల్లీ గల్లీన ఉండి కూడా మతం సంఘ జీవనాన్ని

## సహవాసి



ప్రముఖ అనువాదకుడు, రచయిత, పాత్రికేయుడు జంపాల ఉమామహేశ్వర రావు ఆగస్ట్ 29న కన్నుమూశారు. ఆయన 'సహవాసి' అన్న పేరుతో పాఠక లోకానికి సుపరిచితులు. కొంతకాలంగా క్యాన్సర్‌తో బాధపడుతున్నారు. తెనాలి నుంచి చికిత్స కోసం హైదరాబాద్ వస్తుండగా మార్గమధ్యంలో మరణించారు. ఆయన 1934లో గుంటూరుజిల్లా దుగ్గిరాలలో జన్మించారు. 1954-58లలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో బి.ఎ. ఆనర్స్ చేశారు. 1959లో ఎ.జి. కార్యాలయంలో ఆడిటర్‌గా ఉద్యోగ జీవితాన్ని ప్రారంభించి 1981 వరకు కొనసాగారు. 1983 నుంచి 1997 వరకు ఈనాడు దినపత్రికలో పనిచేశారు. అలెక్స్ హేలీ ప్రఖ్యాత నవల 'రూట్స్'కు 'ఏడు తరాలు' పేరుతో ఆయన చేసిన సంక్షిప్తీకరణ అత్యంత ఆదరణ పొందింది. ఇంకా నార్మన్ బెతూన్ జీవితకథ 'రక్తాశ్రువులు', మేరీ టేలర్ 'భారతదేశంలో నా జైలు జీవితం', జాక్ లండన్ 'ఉక్కుపాదం', రొమిల్లా థాపర్ 'తరతరాల భారత చరిత్ర', అంబేద్కర్ గ్రంథాలు 'శూద్రులెవరు', 'అస్పృశ్యులెవరు', ఎమిలీజోలా నవల 'భూమి' పాఠకాదరణ పొందాయి. గోర్కీ నవల 'అమ్మ', 'పంచతంత్రం', వీరేశలింగం 'రాజశేఖర చరిత్ర'లను ఆయన సంక్షిప్తీకరించారు.

ఆయన స్వయంగా 'ప్రవక్త, సంస్కర్త – వీరబ్రహ్మేంద్రస్వామి', 'వేమన మాట – బాట', 'స్వరాజ్య సమరం' పుస్తకాలు రచించారు. తిరస్కృతులు, విముక్త అనే అనువాదాలను సొంతంగా ప్రచురించారు. ఆయన ఇటీవలే పూర్తిచేసిన 'వందేళ్ల తెలుగు నవల' విశ్లేషణ గ్రంథం ఇటీవలే విడుదలయ్యింది. పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం నుంచి ఉత్తమ జర్నలిస్టు అవార్డు, రెంటాల స్మారక ఉత్తమ అనువాదకుడు అవార్డు అందుకున్నారు. ◆

---

శాసించకుండా కాపాడుకుంటూ వస్తున్న తమిళుల జీవన విధానానికి, దానికి కారణమైన ద్రావిడ ఉద్యమానికి జేజేలు.

ఈ రాజకీయ కోణమే కాకుండా సేతు సముద్రంపై ఇతరత్రా వివాదాలు కూడా ఉన్నాయి. మామూలుగానే ఏ భారీ ప్రాజెక్టు మీదనైనా అనుకూల ప్రతికూల వివాదాలు భారీగానే ఉంటాయి. అనుకూల వాదులు మొత్తం ఎన్ని లాభాలున్నాయో అరచేతిలోనే స్వర్గం చూపిస్తారు. (సేతు సముద్రం ప్రాజెక్టు వారు చాలా పెద్ద జాబితా ఇచ్చారు) మూటలు మూటలుగా ఇన్ని లాభాలు కళ్లముందు కదలాడుతుంటే వ్యతిరేకించే వెర్రివారెవరు అనిపిస్తుంది వారి మాటలు వింటే. వ్యతిరేక వాదులు అంతే తీవ్రంగా ఉంటారు. ప్రపంచంలోని ఎక్కడెక్కడి భూకంపాలు, పెనుఉప్పెనలు దీనివల్లే ముంచుకొస్తున్నట్టు భయపెట్టి చంపుతారు. ఇక పర్యావరణవాదుల సంగతి చెప్పనక్కర్లేదు. సకల జీవజాలమూ దీనివల్ల ఎంత సర్వనాశనమవుతోందో వివరించి వటపత్రశాయి రాకకు ప్రళయాన్ని సిద్ధం చేసి పెడతారు. మామూలుగా భారీ ప్రాజెక్టులు దాని ప్రభావాలను అర్థం చేసుకోవడానికి సాంకేతిక పరమైన ఎక్స్‌పర్‌టైజ్ అవసరమవుతుంది. కానీ అన్ని అంశాలపై అందరం మాట్లాడేస్తుంటాం. మన లాంటి సమాజాల్లో ఇది అనివార్యం అవుతోంది కూడా! సాంకేతిక నిపుణులు తమంతతాము ఆబ్జెక్టివ్‌గా స్టడీ చేసి నివేదికలందజేసే వాతావరణం ఉంటే ఈ పరిస్థితి ఉండకపోను. కానీ మన దగ్గర నివేదికల లైన్ ముందే మన నాయకులు నిర్దేశిస్తారు. నిపుణులు చేసేదల్లా ఆ లైన్ వివరించడానికి అవసరమైన జార్గాన్ నింపడమే. (షిప్పింగ్, పర్యావరణ మంత్రులు మన పార్టీ వాళ్లే ఉన్నప్పుడు మనం ప్రతిష్ఠాత్మకంగా భావించే ప్రాజెక్టుకు అనుమతులు ఆగుతాయా!) దీంతో నిర్వాసితుల వెతల గురించే కాకుండా ఇటువంటి సాంకేతిక అంశాలపై కూడా నోరువిప్పాల్సిన అవసరం ఎప్పటికప్పుడు ఏర్పడుతూ ఉంటుంది. అంతెందుకు! సేతు సముద్రమే తీసుకుంటే అధికారిక సమాచారంలో ఎక్కడా రామసేతు అనే పేరేలేదు-భూతద్దంతో వెతికినా. ఆడమ్స్ బ్రిడ్జి అనే ఉంది. అది రామసేతు అయినా కాకపోయినా వ్యావహారికంలో ఆ పేరు కూడా ఉన్నప్పుడు రాయాలి కదా! కనీసం బ్రాకెట్‌లో అయినా! అయినా ఇవ్వరు. వివాదాలు రాకుండా చేసుకోవడానికి ముందుగానే చాలా జాగ్రత్తలు తీసుకున్నారని దీన్ని బట్టి అర్థమవుతుంది. అందరికీ పరిచయమైన పేరు విషయంలోనే ఇంత దాగుడుమూతలాడిన వారు సాంకేతికమైన అంశాల్లో ఇంకెంత దాచి ఉంటారో చెప్పడం కష్టం. ఏ ప్రాజెక్టులో నైనా నిర్వాసితులయ్యేది ఎక్కువలో ఎక్కువ గిరిజనులు, బెస్తలు, దళితులు, రైతులు వంటి నోరువాయిలేని మూగజీవాలే కాబట్టి నిర్వాసితుల గురించి మాట్లాడడం ప్రజాస్వామిక వాది అనుకునే ప్రతి వ్యక్తి కనీస బాధ్యత. అందులో మరో మాటకు తావే లేదు. కాకపోతే సాంకేతికతల విషయంలోనే కొంచెం వెనుకా ముందూ చూసుకోవడం అవసరం. ఇంత సొద ఎందుకంటే సేతు సముద్రం ప్రాజెక్ట్ సముద్రంలో జరిగే వ్యవహారం కాబట్టి నిర్వాసితులు ప్రత్యక్షంగా లేరు. కాబట్టి ఆ సమస్యలేదు. చేపల కదలిక తగ్గిపోయి రామేశ్వరం ప్రాంత బెస్తలు దిబ్బతినొచ్చు అనే భయం ఉంది. సముద్ర జీవులు, ప్రకృతి సంపద నాశనమవుతుందనే ఆందోళనలైతే ఎలాగూ ఉన్నాయి. అలాగే సునామీ భయాలూ ఉన్నాయి. అయితే ఇలాంటి విషయాల్లో ఊరికే పర్యావరణ సంస్థలన్నింటికి తలూపాల్సిన అవసరం లేదు. ఈ పర్యావరణ సంస్థల్లో నిజంగానే ప్రజానుకూలమైనవీ ఉంటాయి, రకరకాల ప్రయోజనాలతో పనిచేసే లాబీలూ ఉంటాయి. ఈ అంశంపై ప్రజానుకూల నిపుణుల అధ్యయనాలను బట్టి అంచనాకు రావాల్సి ఉంటుంది.

ఇవన్నీ అటుంచితే ఒక్క నాస్తిక ప్రకటన వినిపించగానే వారిని చంపుతామంటూ ప్రకటనలిచ్చేవారు,ఫలానా రచయిత్రి మళ్లీ హైదరాబాద్ వస్తే ప్రాణాలతో తిరిగి వెళ్లదు అని అనగలిగిన వారు ఇంత మంది ఉండడం సమాజంలో పెరుగుతున్న అసహనానికి, మేధావుల ప్రేక్షక స్వభావానికి సూచిక. ఈ పరిస్థితి బారాఖూన్ మాఫ్ అనేంతగా ముదిరిపోకముందే మేలుకోవడం ప్రజాస్వామిక అవసరం. ◆

**పునరావాస, పునర్నిర్మాణ సదుపాయాలను కల్పించకుండానే ప్రభుత్వాలు వేలకోట్ల రూపాయల వ్యయంతో, అంతులేని అవినీతితో భారీప్రాజెక్ట్‌ల నిర్మాణానికి నడుం బిగించడం అమానుషం అంటున్నారు జి. రమేష్**

# పోలవరం పనులతో నరకం

'అన్నం తిందామంటే కంచంలోకి దుమ్ము వస్తుంది, బాంబుల మోతతో మంచాల మీద కూర్చున్న వాళ్లం కిందపడుతున్నాం. ఈ నరకాన్ని భరించలేకపోతున్నాం. మందుగుండు ప్రభావంతో రోగాల పాలవుతున్నాం. పనులు ఆపామని చెబుతున్నారు, కానీ వాస్తవాన్నీ ఎవరు కూడా పట్టించుకోవడం లేదు' – పోలవరం ప్రాజెక్ట్ పరిధిలో ఏ రైతును కదిపినా ఇవే ఆవేదనలు. తరతరాలుగా భూమిని, అడవిని నమ్ముకుని జీవిస్తున్న ప్రజలు ఆ ప్రాంతాలను ఖాళీ చేయలేకపోతున్నారు. ఆ గ్రామం, ఆ ఇల్లు, ఆ మట్టి వాసనలతో పెనవేసుకున్న బంధాన్ని తెంచుకోవాల్సి రావడాన్ని జీర్ణించుకోలేకపోతున్నారు. మరోవైపు పనుల్లో భాగంగా పేలుస్తున్న బాంబులు వీరి గుండెల్లో గుబులు పుట్టిస్తున్నాయి. దీనికి తోడు ప్రభుత్వం, అధికారులు స్థానికులపట్ల చూపుతున్న ఉదాసీన వైఖరి మరో దారుణం. 'పోలవరం పనుల వలన నష్టపోయే రైతులందరికీ భూమికి భూమి, పంట నష్టానికి బదులు పరిహారం చెల్లిస్తాం. అప్పటి వరకు మీ భూములను అసలు ముట్టుకోం. ముందు పునరావాస చర్యలు, తర్వాతే పనులు. ఇందులో ఎలాంటి అపోహలు వద్దు" అని పోలవరం పనులు ప్రారంభించే ముందు అవగాహన సదస్సులో అధికారులు రైతులకు నచ్చజెప్పారు. ఆచరణలో ఇవన్నీ ఒట్టిమాటలవడంతో, ఆయా ప్రాంతాల రైతులు దిక్కుతోచని స్థితిలో పడ్డారు. పరిహారం కల్పించకుండా పునరావాసం చూపించకుండా ప్రాజెక్ట్ పనులు మొదలుపెట్టేశారు. పనుల కోసం పేలుస్తున్న బాంబుల వల్ల స్థానిక ఆదివాసుల ఇళ్లు బీటలు వారుతున్నాయి. కనీసం తమకు ఏ మాత్రం చెప్పకుండా బాంబులు పేల్చడంతో రాత్రుళ్లు బిక్కుబిక్కుమంటూ గడుపుతున్నారు. మరోవైపు రైతుల అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకుని అధికారులు వారిని బెదిరిస్తున్నారు. ఇచ్చిన కాడికి డబ్బు తీసుకుని భూమి అప్పగించకపోతే, ఆ భూమి ఆదివాసులదని చెప్పి ఒక్క నయా పైసా రాకుండా చేస్తామని రెవెన్యూ అధికారులు ఓ రైతును హెచ్చరించడం వారి దాష్టీకానికి పరాకాష్ఠ. పోలవరం స్పిల్‌వే పనులు జరుగుతున్న ప్రాంత సమీపంలో ఉన్న పైడిపాక, రామయ్యపేట, చేగొండిపల్లె, దేవరగొంది, మావిడిగొంది, తోటగొంది గ్రామాల్లో సుమారు 7,000 మంది జీవిస్తున్నారు. ఈ గ్రామాలన్నీ ప్రాజెక్ట్ ముంపుకు గురవుతున్నా వీరిలో ఏఒక్కరికీ ఇంతవరకు పరిహారం ఇవ్వలేదు సరికదా పునరావాసమూ చూపలేదు. దీంతో గ్రామస్తులెవరూ తమ నివాసాలను ఖాళీచేయలేదు. మరోపక్క అధికారులు ఖాళీ చేయాలంటూ ఆదేశాలు జారీచేస్తున్నారు. దేవరగొంది ప్రజలకు స్థానిక ఎమ్మార్వో కార్యాలయం పక్కన 95 గృహాలను కొంతమేరకు నిర్మించారు. ఈలోగా 1/70 చట్టం ప్రకారం షెడ్యూల్డ్ ప్రాంతాల వారికి ఆ ప్రాంతంలోనే ఇళ్లు ఇవ్వాలి గానీ మైదాన ప్రాంతంలో ఇవ్వరాదని ఓ వ్యక్తి కోర్టుకు వెళ్లడంతో, కోర్టు ఆ నిర్మాణాలను నిలిపివేసింది. అలాగే పైడిపాక గ్రామస్తులకు పట్టాలిచ్చినా ఇంకా భూములు చూపించలేదు.

## పునరావాసం – ఒక బూటకం

ప్రాజెక్ట్‌ల వలన లేదా అభివృద్ధి పనుల వలన నిర్వాసితులయిన వారికి ప్రభుత్వం నష్టపరిహారం చెల్లించడానికి, పునరావాసం కల్పించడానికి జాతీయ పునరావాస విధానం 2004 ప్రకటించారు. ఈ విధానంలో చాలా లోప భూయిష్టమైన అవగాహన ఉంది. అంతే కాకుండా ప్రకటించిన పునరావాస చర్యలు నష్టపరిహారం చెల్లించడంలో కూడా ప్రభుత్వం చాలా ఉదాసీనంగా వ్యవహరిస్తోంది.

భూమికి భూమి ఇస్తామని ఈ పునరావాస విధానంలో స్పష్టంగా ప్రకటించినా వ్యవసాయానికి అనుగుణంగా ఉన్న చోట భూమిని ఇవ్వడం లేదు. నిర్వాసితుల ప్రాంతాల్లో నిర్మించే ఫ్యాక్టరీలు, గనుల్లో ఉద్యోగాలు కల్పిస్తామన్న విషయం హామీలుగానే మిగిలిపోతున్నాయి. గతంలో నిర్మించినా భిలాయి, రూర్కెలా ప్లాంటుల్లో స్థానికులకు ఉద్యోగాలు కల్పించినా, ఇవ్వాళ అవి ప్రైవేట్ రంగంలోకి మారుతున్న క్రమంలో చాలా మందిని ఉద్యోగాలు నుంచి తొలగిస్తున్నారు. నిర్వాసితులు అంటే బలవంతంగా తమ స్వస్థలం నుండి గెంటివేయబడినవారే. ఈ క్రమంలో జీవనోపాధి, జీవనవిధానం, వారి సంస్కృతి సాంప్రదాయాలు విచ్ఛిన్నం అవుతున్నాయి. డబ్బు రూపంలో నష్టపరిహాం చెల్లించినంత మాత్రాన పూర్వ జీవితం రాదు. కొత్త ప్రాంతాల్లో సెటిల్‌మెంట్స్ ఏర్పాటు చేసినా అక్కడ ప్రజలు వీరిని పరాయి వారిగా చూసే అవకాశముంది. కాబట్టి నష్టపరిహారం, పునరావాసం కల్పించినా జీవించే హక్కుకు చాలా అవరోధాలు ఎదురవుతాయి. ఈ విషయాలపై ఎవరైనా మాట్లాడితే అభివృద్ధికి వ్యతిరేకులని పాలకవర్గాలు, పారిశ్రామికవేత్తలు ముద్రవేసి ఆందోళనలను పాశవికంగా అణచివేస్తున్నారు.

## భూముల నిండా రాళ్లు

పోలవరం కుడి కాలువ వద్ద స్పిల్‌వే కోసం ప్రస్తుతం ఓ పెద్ద కొండను బాంబులతో పేలుస్తున్నారు. దానివల్ల పెద్ద ఎత్తున మట్టి,

రాళ్లు వస్తున్నాయి. దీన్నంతటిని తీసుకెళ్లి ఎక్కడోచోట పోయాలి. ఇందుకు గాను పక్కనే ఉన్న దేవరగొంది, రామయ్యపేట గ్రామాల్లో 70 ఎకరాలను సేకరించాలని అధికారులు నిర్ణయించారు. దగ్గర్లో చిన్న రైతులతో మాట్లాడి వారిని ఒప్పించారు. ప్రస్తుతం ఉన్న మొక్కజొన్న పంటతో పాటు, భూమికి భూమి లేదా పరిహారం ఇస్తామని చెప్పి కావలసినంత భూమిని దౌర్జన్యంగా లాక్కున్నారు. వెంటనే పనులు కూడా మొదలు పెట్టారు. టిప్పర్లతో మట్టి తెచ్చి ఈ భూములను గత సంవత్సరకాలంగా కప్పేస్తున్నారు. ఇంతవరకు రైతులకు అసలు పరిహారమే చెల్లించలేదు. భూమికి భూమి అడిగిన రైతులకు అదీ ముట్టజెప్పలేదు. పనులు మాత్రం యథావిథిగా జరిగిపోతున్నాయి. ఇటీవల గట్టిగాఅడిగిన కొందరికి పంట నష్టపరిహారం కింద ఎకరాకు రు. 3 వేల చొప్పున ఇచ్చి చేతులు దులిపేసు కున్నారు. ఇంకా అడిగితే బెదిరించి, దౌర్జన్యానికి దిగుతున్నారు.

## కొండల్ని కప్పేస్తున్నారు

పనులు జరుగుతున్న ప్రాంతం నుంచి మట్టి పోయడానికి సేకరించిన భూమి వద్దకు వెళ్లాలంటే చుట్టూ ఉన్న కొండలను దాటాలి. ఇది వృథా ప్రయాసని భావించిన కాంట్రాక్టరు, ఏకంగా ఆ కొండలపైనే టిప్పర్లతో మట్టి, రాళ్లుపోస్తున్నారు. అలా ఓ కొండ పూర్తిగా పూడుకుపోగా, దానికి ఆనుకుని ఉన్న మరో కొండను కప్పడానికి గాను రహదారి సిద్ధం చేశారు. కొద్దిరోజుల్లో ఈ కొండ పరిస్థితీ అదే మాదిరి కానుంది. ఇవి కాకుండా సొరంగమార్గం కోసం మరో మూడుకొండలను తవ్వు తున్నారు. ఆ మట్టిని అక్కడే వదిలేస్తున్నారు. ఇలా అటు కొండలతోపాటు వాటి మధ్య ఖాళీప్రదేశాలను సైతం కనుమరుగు చేస్తున్నారు. మరోవైపు ఈ కొండలపై అడవిపందులు, దుప్పులు, కుందేళ్లు, కొండ గొర్రెలు, జింకలు, కారుకోళ్లు వంటి వన్యప్రాణులు నివసిస్తున్నాయి. పక్కనే జరుగుతున్న ప్రాజెక్టపనుల్లో పగలు, రాత్రుళ్లు బాంబులు పేల్చడంతో ఆ శబ్దాలకు భయపడి ప్రాణభయంతో అవి పరుగులు తీస్తున్నాయి.

## అన్నింటా అపహాస్యమే

స్పిల్‌వే పనులకోసం సమీపంలోని రైతుల నుంచి పది నెలల కిందట పదెకరాల భూమి తీసుకున్నారు. ప్రస్తుతం అక్కడ పనులు జరుగుతున్నాయి. ఇప్పటి వరకు వాటికి సంబంధించి రైతులకు పరిహారం ముట్టజెప్పలేదు. దీనికి పక్కనే ఉన్న రెండు కొండలమధ్య స్థలాన్ని సేద్యం నిమిత్తం గతంలో ప్రభుత్వం ఆదివాసీలకు ఇచ్చింది. వీటిని కూడా మట్టితో కప్పేశారు. కనీసం మట్టి వేస్తున్నట్లు తమతో చెప్పలేదని అక్కడ రైతులు వాపోతున్నారు.

## ఊరొదిలిన రైతు

పోలవరం గ్రామానికి చెందిన కరిబండి నరసింహమూర్తి ఓ రైతు. ఆయన కృష్ణారావుపేట ప్రాథమిక వ్యవసాయ సహకార సంఘంలో తనకున్న ఎకరంపొలం తనఖాపెట్టి రు. 60,000 అప్పుగా తీసుకున్నాడు. తరువాత పరిస్థితులు అనుకూలించక అప్పు చెల్లించలేకపోయాడు. ఇప్పుడు ప్రభుత్వం ఎకరానికి రు. 75,000 మాత్రమే చెల్లిస్తామనడంతో ఆ రైతు తిరస్కరిస్తున్నాడు. తన పొలం కనీసం ఆరులక్షలు విలువ చేస్తుందని, దాన్ని 75 వేల రూపాలయలకు ఇవ్వాలంటే తనవల్ల కాదని చెప్పాడు. ప్రభుత్వం ఎలాగైనా భూమిని తీసుకునేట్లుందని, అదే జరిగితే అప్పు వసూలు అసాధ్యమౌతుందని భావించిన సొసైటీ, నరసింహమూర్తి పై ఒత్తిడి తీసుకొచ్చింది. ఇంట్లో సామాగ్రి జప్తుచేస్తామని బెదిరించడంతో ఆయన ఊరొదిలి వెళ్లిపోయాడు.

దేశంలో వివిధ ప్రాంతాల్లో బలవంతంగా నిర్వాసితులౌతున్న వారి హక్కులకు విలువ లేకుండాపోతోంది. చాలా సందర్భాల్లో వారు మాతృ భూమిలోనే శరణార్థుల మాదిరిగా బతకాల్సిన పరిస్థితి ఎదురౌతోంది. కనీస సదుపాయాలకు కూడా నోచుకోకుండా బతకాల్సిన దుర్భర పరిస్థితి వారిది. పోలవరం ప్రాజెక్ట్ నిర్మాణం వల్ల లక్షలాది మంది పేదరైతులు, ఇతర వృత్తుల వారు ఇల్లూ వాకిలీ కోల్పోయి నిర్వాసితులు కావడం, పర్యావరణం దెబ్బతినడం ఈసమస్యలలో ముఖ్యమైనవి. ఎన్ని అడ్డంకులు ఎదురైనా పోలవరం ప్రాజెక్ట్ నిర్మించితీరుతామని ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి మొండిధోరణితో చేస్తున్న ప్రకటనలు బాధితుల గాయాల మీద కారం చల్లుతున్నాయి. ప్రాజెక్ట్ నిర్మాణంతో వందలాది గ్రామాలు నీటమునిగి, లక్షలాది పేదలు నిర్వాసితులయి అత్యంత క్లిష్ట సామాజిక సమస్యలు ఉత్పన్నమయినాయి. ఈ సమస్యలను పరిష్కరించడానికి, లక్షలాది నిర్వాసితులకు పునరావాసం కల్పించి, వారి హక్కులను, ప్రయో జనాలను పరిరక్షించడానికి బలమైన ప్రజాఉద్యమాన్ని నిర్మించాల్సిన అవసరం ఉంది. ఇతర ప్రాంతాలలో నిర్వాసితులవుతున్న వారి క్రియాశీల మద్దతు కూడగట్టాల్సిన బాధ్యత ప్రజాస్వామిక శక్తులపై ఉంది.

దేశంలో వివిధ రాష్ట్రాలలో నీటి ప్రాజెక్టలను, భారీ ప్రాజెక్టలను నిర్మించాలనుకుంటున్న ప్రభుత్వాలు అన్నిటికన్నా ముఖ్యంగా ఆయా ప్రాంతాలలోని ప్రజల ప్రయోజనాలకు, వారి శ్రేయస్సుకు, ఆయా ప్రాంతాలపై వారికుండే సార్వభౌమధికారానికి, జీవించే హక్కుకి అధిక ప్రాధాన్యం ఇవ్వాలి. ప్రాజెక్టలు, పరిశ్రమల నిర్మాణం పేరిట లక్షలాది పేదలను వారి ఇండ్లకు, వాకిండ్లకు దూరం చేయడం, వారి జీవన సరళికి సంస్కృతీ, సాంప్రదాయాలకు విఘాతం కల్గించడం, చారిత్రక సంపదలను జల సమాధి చేయడం సమంజసం కాదు. ఆదివాసీలు, పేదలకు, చిన్న రైతులకు తమ అడవి, భూములు, స్థలాలతో ఉన్న అనుబంధం గాఢమయినది. ఈ అనుబంధం తెగినపుడు ఆవేదన తప్పదు. పునరావాస, పునర్నిర్మాణ సదుపాయాలను కల్గించకుండానే ప్రభుత్వాలు వేలకోట్ల రూపాయల వ్యయంతో, అంతులేని అవినీతితో భారీప్రాజెక్టల నిర్మాణానికి నడుం బిగించడం అమానుషం. ◆

వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.

భూమిలో తన న్యాయమైన హక్కు కోసం బందగీ చేసిన పోరాటం ఇవ్వాళ ఆంధ్రప్రదేశ్‌లో తన న్యాయమైన హక్కు కోసం తెలంగాణ చేస్తున్న పోరాటానికి తొలి రూపమని అంటున్నారు **వరవరరావు**

# 1948 సెప్టెంబర్ 17 పరిణామాలు

అభిప్రాయాలు, దృక్పథాలు ఎలా ఉన్నా ముందు జరిగిన వాస్తవాలు చెప్పుకుని, చరిత్ర పరిణామాలను యథాతథంగా చెప్పుకుని ఆ తర్వాత వాటిపై వ్యాఖ్యానించుకోవచ్చు, సమీక్షించుకోవచ్చు.

వాస్తవాలను వాస్తవాలు (ఫ్యాక్ట్స్)గా ముందు క్లుప్తంగా చెప్పుకుందాం.

1948 సెప్టెంబర్ 13 నుంచి 17 వరకు భారత కేంద్ర ప్రభుత్వ సైన్యాలు అన్ని వైపుల నుంచి హైదరాబాదు సంస్థానంలో ప్రవేశించి 17న హైదరాబాదును ఆక్రమించుకున్నాయి. హైదరాబాదు సంస్థానం దీనిని భారత సైన్యం ఒక స్వతంత్ర దేశంపై ఆక్రమణ చేయడంగా భద్రతామండలిలో ఫిర్యాదు చేసింది. భద్రతామండలి ఈ విషయంలో హైదరాబాదు సంస్థాన ప్రతినిధి వాదనలు, భారత ప్రభుత్వం ప్రతినిధి వాదనలు విన్నది. రష్యా, చైనాలు హైదరాబాదు ప్రతినిధి నుంచి మరిన్ని వివరాలు వినాలని కోరిన మీదట సభ సెప్టెంబర్ 16 నుంచి 20కి వాయిదా పడింది. హైదరాబాదు సంస్థానం ఎన్నడూ ఢిల్లీ పాలనలో లేదని, స్వతంత్ర రాజ్యమని హైదరాబాదు ప్రభుత్వ వాదన. ఆ వాదన కన్నా ముఖ్యం ఐక్యరాజ్యసమితి అంతర్జాతీయ మానవ హక్కుల విధానపరంగా సైనిక జోక్యం, ఆక్రమణ చెల్లవు. అందుకే రష్యా, చైనాలు తప్ప భద్రతా మండలి సభ్యులందరూ భారత సైన్యం జోక్యాన్ని ఖండించారు. రష్యా చర్చను వాయిదా వేయించగలిగింది. ఈ లోపుగా 17 సాయంత్రానికల్లా భారత సైన్యం హైదరాబాదు నగరంలో ప్రవేశించింది. నైజాం ఆఖరి నవాబు మీర్ ఉస్మాన్ అలీఖాన్ లాయక్ అలీ ప్రధానిగా ఉన్న ప్రభుత్వాన్ని రద్దు చేసాడు. అప్పటికే భారత ప్రభుత్వ సైన్యానికి చెందిన మేజర్ జనరల్ జె.ఎన్. చౌధురీని హైదరాబాదు సంస్థాన ఆర్మీ కమాండర్ ఆహ్వానించి బొలారం అతిథి గృహంలో ఉంచాడు. నిజాం తాను కొత్త ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తానని ప్రతిపాదన జె.ఎన్. చౌధురీకి పంపించాడు. ఆయన తిరస్కరించాడు. కనుక హైదరాబాదు సంస్థానాధీశ్వరుడు భారత ప్రభుత్వానికి లొంగిపోవడం పూర్తయినట్లే.

భారత రాజ్యాంగ రచన పూర్తయి 1950 జనవరి 26న గణతంత్ర రాజ్యం ఏర్పడే సరికి ఇండియన్ యూనియన్‌లో హైదరాబాదు సంస్థానం పూర్తిగా విలీనమైనట్లే. మీర్ ఉస్మాన్ అలీఖాన్‌ను రాజప్రముఖ్‌గా భారత ప్రభుత్వం నియమించింది. తాత్కాలిక ఆక్రమణలు మినహాయిస్తే (గోల్కొండను ఔరంగజేబు జయించి తన సుబేదారును నియమించి ఢిల్లీ వెళ్లగానే అతడు స్వతంత్రం ప్రకటించుకున్నాడు) మొట్టమొదటిసారి తెలంగాణ హైదరాబాదు రాష్ట్రంలో భాగంగా ఢిల్లీ పాలన కిందికి వచ్చింది.

అంటే 1948 సెప్టెంబర్ 17న తెలంగాణ నైజాం పాలన నుంచి ఢిల్లీ పాలన కిందికి వెళ్లింది. హైదరాబాదు రాజ్యంలో భాగంగా ఇండియన్ యూనియన్‌లో విలీనమైంది.

కనుక ఒక చారిత్రక పరిణామమైన వాస్తవఘటన (మాటర్ ఆఫ్ ఫ్యాక్ట్)గా ఇది విలీనం.

ఢిల్లీలో అప్పటికే కాంగ్రెస్ ప్రభుత్వం ఉన్నది గనుక హైదరాబాదు రాష్ట్రంలో స్టేట్ కాంగ్రెస్ ఈ విలీనాన్ని స్వాగతించింది. స్థూలంగా జాతీయోద్యమంగా పేర్కొనే బ్రిటిష్ వ్యతిరేక ఉద్యమంలో ఉన్న జాతీయ భావజాలానికి చెందిన పార్టీలన్నీ ఈ విలీనాన్ని స్వాగతించాయి. అప్పటికి హైదరాబాదు సంస్థానంలో కాంగ్రెస్ తర్వాత ఎంతో కొంత ప్రాబల్యం ఉన్న పార్టీ సోషలిస్టు పార్టీ, సంస్థలుగా ఆర్యసమాజ్ వంటివి కూడ స్వాగతించాయి.

మీర్ ఉస్మాన్ అలీఖాన్ ప్రభుత్వం ఐదు రోజులు ప్రతిఘటించి లొంగిపోయింది గనుక విలీనాన్ని మనస్ఫూర్తిగా అంగీకరించలేదనేది స్పష్టమే. కాశిం రజ్వీ నాయకత్వంలో రజాకార్లు ఆధికారికంగా హైదరాబాదు సైన్యానికి మద్దతుగా వేల సంఖ్యలో సాయుధంగా భారత సైన్యాన్ని ఎదుర్కొని పోరాడారు. ఇండియన్ యూనియన్ సైన్యాలు లక్షలాది మందిని చంపుతూ హైదరాబాదులో ప్రవేశించాయి. అలా చనిపోయిన వారిలో ఎక్కువగా ముస్లింలు, ప్రత్యేకించి ప్రతిఘటించిన రజాకార్లు ఉన్నారనేది వాస్తవం. సెప్టెంబర్ 18న ప్రధాని లాయక్ అలీని గృహ నిర్బంధంలోకి తీసుకొని, తప్పించుకొని పాకిస్థాన్‌కు పారిపోయే ప్రయత్నం చేసిన కాశిం రజ్వీని వరంగల్ జైల్లో నజర్‌బంద్ చేసారు. చంపుతారనుకున్న లాయక్ అలీకి గృహ నిర్బంధంలో తన కుటుంబంతో పాటు నెలల తరబడి ఉండడం వసంతంగానూ, అద్భుతమైన విముక్తిగానూ అనిపించింది. హైదరాబాదు సంస్థానం స్వతంత్రంగా ఉండాలని భావించిన అత్యధికులకు, పాకిస్థాన్‌లో చేరాలనుకున్న ముస్లింలకు ఇది తప్పకుండా దురాక్రమణగానే కనిపించింది.

హైదరాబాదు రాజ్యం స్వతంత్రంగా ఉండాలని భావించిన వారిలో కమ్యూనిస్టు పార్టీలోని ప్రముఖ తెలంగాణ నాయకులు కూడ ఉన్నారు. వాళ్ల దృష్టిలో కూడ ఇది దురాక్రమణే. పాకిస్థాన్‌లో చేరాలనుకున్న వాళ్లు మాత్రమే మతవాదానికి చెందిన ముస్లింలు కావచ్చు

కానీ స్వతంత్రంగా ఉండాలని కోరుకున్న వాళ్లు తక్కువ సంఖ్య కాదు. ముస్లింలు మాత్రమేకాదు.

ప్రజల అభీష్టం, నిర్ణయం, ఆహ్వానం మేరకు కాకుండా అప్పటికి ఇంకా అమలులో ఉన్న యథాతథ స్థితి ఒడంబడిక (మీర్ ఉస్మాన్ అలీఖాన్‌తో భారత ప్రభుత్వం 1947 నవంబర్‌లో చేసుకున్నది) గడువు కూడ తీరకుండానే భారతసైన్యం ప్రవేశించడాన్ని ప్రజాస్వామ్య వాదులందరూ వ్యతిరేకించారు. వాళ్లలో కమ్యూనిస్టులు ప్రబలమైన శక్తి అయినా ఆ తర్వాత 1952 ఎన్నికల్లో ప్రొగ్రెసివ్ డెమొక్రటిక్ ఫ్రంట్ (పి.డి.ఎఫ్.) పేరుతో డా. జయసూర్య నాయకత్వంలో పోటీ చేసిన కమ్యూనిస్టేతరులు కూడ చాలామంది ఉన్నారు. వీళ్ల దృష్టిలో ఈ విలీనం ప్రజల పరంగా కూడ స్వచ్ఛందంకాదు.

బ్రిటిష్ ఇండియా నుంచి బ్రిటిష్ వాడువెళ్లిపోయి 1947 ఆగస్ట్ 15న లాల్‌ఖిల్లాపై త్రివర్ణ పతాకం ఎగురవేసి, నెహ్రూ స్వతంత్రం ప్రకటించిన తర్వాత సెప్టెంబర్ 11న సాయుధ పోరాటానికి పిలుపు ఇచ్చినందున కమ్యూనిస్టు పార్టీ విలీనాన్ని ప్రతిపాదించలేదనేది స్పష్టం. పైగా ఈ పిలుపు ఇచ్చిన ముగ్గురు కమ్యూనిస్టు నాయకులు కూడ తెలంగాణ వారే. రావినారాయణ రెడ్డి, రాజబహదూర్ గౌడ్, బద్దం ఎల్లారెడ్డి. తెలంగాణలో కామ్రేడ్స్ అసోసియేషన్ మొదలుకొని కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం వరకు చాల ప్రముఖ పాత్ర వహించిన వాళ్లలో రాజబహదూర్ గౌడ్‌తోపాటు ప్రముఖులు దేవులపల్లి వెంకటేశ్వరరావు, మగ్దుం మొహియొద్దీన్ మొదలయినవాళ్లు.

ఆంధ్ర మహాసభలో పనిచేస్తున్న కాలం నుంచి కూడ కమ్యూనిస్టు పార్టీ అవగాహన తెలంగాణ విమోచనం, భూమి, భుక్తి, విముక్తి పోరాటం, వెట్టిచాకిరీ రద్దు, కౌలుదారుగా దున్నుతున్న రైతుకు కాలగమనంలో ఆ భూమి మీద హక్కు – దాని ఆర్థిక పోరాట రూపమే 'దున్నేవారికే భూమి'. ఇవి పందొమ్మిది వందల నలభైల నాటికే గ్రామీణ తెలంగాణలో ఆంధ్రమహాసభగాను, సంగంగాను కమ్యూనిస్టు పార్టీ అమలు చేసింది. జమీందారీ, జాగీర్దారీ వ్యవస్థ రద్దు కొరకు పోరాడింది.

బందగీ భూమిలో తన న్యాయమైన హక్కు కోసం చేసిన పోరాటం ఇవ్వాళ తెలంగాణ ఆంధ్రప్రదేశ్‌లో తన న్యాయమైన హక్కు కోసం చేస్తున్న పోరాటానికి తొలి రూపమనవచ్చు. అది తన సోదరుడు అబ్బసలీ చేసిన అన్యాయానికి వ్యతిరేకంగా చేసిన పోరాటంగా కనిపించవచ్చు కానీ, ఇవ్వాళ ఈ ఆంధ్ర దళారీ పాలకులకు దన్నుగా కేంద్ర ప్రభుత్వం ఉన్నట్లుగా, సామ్రాజ్యవాదం ఉన్నట్లుగా ఆనాడు అబ్బసలీకి దన్నుగా విసునూరు దేశముఖ్, ఆయన వంటి ఫ్యూడల్ భూస్వాముల మీద నిలిచిన నిర్మాణంగా నైజాం ప్రభుత్వం ఉన్నది.

కమ్యూనిస్టుల దృష్టిలో భూమి అంటే వనరు, పంట కూడ. పాలకుర్తిలో చాకలి ఐలమ్మ, ఆమె సంతానం తమ మడిమాన్యంలో పంట పండించుకుని ఇంటికి కోసుకపోవాలనుకున్నప్పుడు దొర గూండాలు అడ్డగించారు. ఆ గూండాలను ప్రతిఘటించడంలో ఐలమ్మకు అండగా నిలిచింది సంగం. మొండ్రాయిలో లంబాడీల కౌలు హక్కును హరించాలని పూసుకూరు రాఘవరావు దొర కుట్ర చేసినపుడు లంబాడీ స్త్రీలు ప్రతిఘటించారు. దొర గూండాలను, నైజాం పోలీసులను, తోడుగా వచ్చిన బ్రిటిష్ సైనికులను రోకళ్లు, కారప్పొడితో తరిమికొట్టారు. ఇట్లా దశలుగా సాగిన పోరాటం 4 జులై 1946న వ్యవసాయ కూలీ పోరాట ఊరేగింపుపై కడివెండిలో దొడ్డి కొమురయ్య, మల్లయ్యలపై దొర ఏజెంటు మిస్కిన్ కాల్పులతో ఆత్మరక్షణకైనా సరే ఆయుధం పట్టక తప్పదని కమ్యూనిస్టు పార్టీ ప్రజలను అప్రమత్తం చేసే దశకు తెచ్చింది.

ఈ కాలానికి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోని ప్రతిఘటనను తానుగా అణచివేయలేక పోయిన నైజాం చట్ట వ్యతిరేక రజాకారు సాయుధ సైన్యాన్ని కాశింరజ్వీ నాయకత్వంలో సమకూర్చుకున్నాడు. గ్రామాలమీద రజాకార్ల దాడులు నిజాం పోలీసుల సహాయంతో ముమ్మరమైనవి. ఈ రజాకారు దాడుల నుంచి గ్రామాలను కాపాడుకోవడానికి గ్రామరక్షక దళాలు ఏర్పడినవి. గ్రామాల మీద దాడులు, స్త్రీలపై లైంగిక అత్యాచారాలకు పరాకాష్ఠ ఆకునూరు, మాచిరెడ్డిపల్లి దురంతాలు. పద్మజానాయుడు మొదలైన వాళ్లు హక్కుల సంఘాలుగా వీటిపై నిజనిరూపణలు చేసి ప్రపంచం దృష్టికి తెచ్చారు. కాళోజీ ప్రబోధగీతాలు రాసాడు. దాశరథి తన పదహారవ ఏటనే వరంగల్ కోటలో జరిగిన సభలో 'ఈ నిజాం రాజు తరతరాల బూజు' అని ఒకవైపు సభల పందిళ్లు రజాకార్లు తగులబెడుతుంటే కంచుకంఠంతో ఆలపించాడు. మొగిలయ్య రజాకార్ల కత్తులకు బలయ్యాడు.

ఇంత దుర్మార్గమైన ప్రభుత్వంతో ఢిల్లీలోని కాంగ్రెస్ ప్రభుత్వం యథాతథ ఒప్పందం చేసుకున్నది. 1947 సెప్టెంబర్ 11న సాయుధ పోరాటానికి పిలుపు ఇచ్చిన కమ్యూనిస్టు పార్టీ సాయుధ దాడులు చేయకతప్పని పరిస్థితి. 1948 సెప్టెంబర్ 13 నుంచి 17 వరకు హైదరాబాదు రాజ్యంలోకి భారత సైన్యం ప్రవేశించే కాలానికి కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో నలగొండ, వరంగల్ జిల్లాల్లో మూడువేల గ్రామాల్లో ప్రజలు పదిలక్షల ఎకరాల భూమిని స్వాధీనం చేసుకున్నారు. బీజప్రాయంలో ఎర్రరాజ్యాన్ని చవిచూస్తున్నారు.

భూమి, భుక్తి, విముక్తి అన్నా విమోచనమన్నా సారాంశంలో అర్థం అది.

పోలీసు చర్య పేర సైనిక దాడి చేసిన కాంగ్రెస్ ప్రభుత్వం ఏం చేసింది' విమానాల నుంచి లక్షలాదిగా కరపత్రాలు తెలంగాణ గ్రామాల్లో వెదజల్లింది. భూస్వాముల నుంచి స్వాధీనం చేసుకున్న భూములను వారికి తిరిగి ఇవ్వవలసిందిగా రైతాంగానికి విజ్ఞప్తి చేసింది. హైదరాబాదు రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి భూములు తామే పంచుతామని వాగ్దానం చేసింది. ఈ విజ్ఞప్తులు, వాగ్దానాలు చేసే క్రమంలోనే నరహంతక సైనికాధికారులు నంజప్ప, పళనియప్పన్‌ల నాయకత్వంలో మిలిటరీ క్యాంపులు ఏర్పాటు చేసి ప్రజలను చిత్రహింసలు పెట్టి చంపింది. ఈ ప్రజలు చేసిన నేరం భూపోరాటం. ఈ భూపోరాటానికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టు పార్టీకి అండగా ఉండడం. 17 సెప్టెంబర్ 1948 దాకా, రజాకార్లతో దాడులు చేయించి తమ భూములను, అధికారాన్ని కాపాడుకున్న హిందూ దేశముఖ్‌లు, జమీందార్లు యూనియన్ సైన్యం ప్రవేశించగానే షేర్వానీలు, కుచ్చుటోపీలు వదిలేసి ఖద్దరు దుస్తులు, గాంధీ టోపీలు పెట్టుకుని గ్రామాల్లో ప్రవేశించారు.

రెండో ప్రపంచ యుద్ధం ముగియగానే నిజాం కమ్యూనిస్టు పార్టీపై నిషేధం విధించాడు. బ్రిటిష్ ఇండియాలో ఇదివరకున్న మద్రాసు ప్రావిన్సు (అందులోనే 53లో ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రముండేది) లో ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వం కూడ కమ్యూనిస్టు పార్టీని నిషేధించింది. సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావులు రాసిన 'మాభూమి'

నాటకాన్ని నిషేధించింది. మద్రాసు 'వాణిమహల్'లో ప్రదర్శించిన 'మాభూమి' నాటకాన్ని చూసి కన్నీళ్లు పెట్టుకున్న మంత్రి కళావెంకట్రావు బయటికి రాగానే నిషేధం విధించాడని శ్రీశ్రీ రాసాడు. ఇదీ కాంగ్రెస్ ప్రభుత్వ నిజస్వరూపం.

'మాభూమి' నాటకం తెలంగాణ భూమి, భుక్తి, విముక్తి పోరాటాల చారిత్రక కల్పన. అందులో ఆకునూరు, మాచిరెడ్డిపల్లి అత్యాచారాలు, హత్యలు, యథాతథ స్థితికి ఒప్పందం, యుద్ధకాలంలో లేవీ యిప్పించే విషయంలో సంపన్నుల గాదెల నుంచి ధాన్యం తీసి, గ్రామాల నుంచి ధాన్యం చీకటి బజార్లకు పోకుండా రైతాంగానికి అండగా నిలిచిన సంగం, రజాకార్ల, పోలీసుల దాడులు, సంగం నాయకత్వంలో ప్రజల ప్రతిఘటన అన్నీ కళాత్మకంగా చిత్రితమయ్యాయి. ఒక్క మాటలో ఇవ్వాటి మనపోరాటం 'తలకిందులైన భూమిని సరిచేయడం' అని ఒక పాత్ర ఈ నాటకంలో చెప్తుంది.

అట్లా సరిచేసిన భూమిని, ఆ భూమిపై ప్రజల స్వామ్యాన్ని మళ్లీ తలకిందులు చేయడానికి తలపెట్టిందే ఢిల్లీలోని కాంగ్రెస్ ప్రభుత్వ సైనిక చర్య.

అందువల్లనే సాధించుకున్న ఫలితాలను కాపాడుకోవడానికి సాయుధ పోరాటం కొనసాగించవలసిందే అని నిర్ణయించింది కమ్యూనిస్టు పార్టీ. ఆ పార్టీలో కొందరు నాయకులు పోరాట విరమణ చేయాలని సూచించినప్పటికీ ప్రజలు, శ్రేణులు, మెజారిటీ నాయకత్వం పోరాటం కొనసాగించడానికే నిర్ణయించారు. అయితే ఈసారి పోరాటం నిజాం పోలీసులు, రజాకార్లతో కాదు. యూనియన్ సైన్యంతో, కేంద్ర ప్రభుత్వంతో.

సముద్రతీరం లేకపోవడం, తెలంగాణ భౌగోళికంగా మరో దేశానికి సరిహద్దు కాకపోవడం, సరిహద్దులుగా ఉన్న ఆంధ్ర, కర్ణాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఉండడం పోరాట విస్తరణకు అవకాశం లేకపోయింది. సైన్యంతో పోరాడిన అనుభవం కూడ కొత్త. కాటూరు ఎలమర్రులలో యూనియన్ మిలిటరీ అఘాయిత్యాలు, హత్యలు, తెలంగాణలో మిలిటరీ క్యాంపులలో చిత్రహింసలు, హత్యలు – హరీంద్రనాథ్ చటోపాధ్యాయ దీర్ఘ కవితలో చదివిన వారికి నాలుగు వేల మంది ప్రజల అమరత్వం ఎంత త్యాగపూరితమో కళ్లకు కడుతుంది.

అందువల్ల ఇది ఆక్రమణ, దురాక్రమణ అవుతుంది తప్ప ప్రజల అభీష్టంతో జరిగిన విలీనం కాదు. ఇది నైజాం ప్రభుత్వాన్ని ఢిల్లీ కాంగ్రెస్, ప్రభుత్వం ఆక్రమించడం మాత్రమే కాదు, ప్రజలు విముక్తం చేసుకున్న భూముల్ని తిరిగి దొరలు ఆక్రమించడం కూడ.

నైజాం లొంగిపోయాడు కానీ ప్రజలు లొంగిపోలేదు. నైజాం ఆ తర్వాత కాలంలో రాజప్రముఖ్ అయ్యాడు. 1969 వరకు రాజభరణాలు పొందాడు. కాంగ్రెస్ ప్రభుత్వం జమీందారీ, జాగీర్దారీ వ్యవస్థను చట్టం ద్వారా రద్దు చేసి రక్షిత కౌల్దారీ చట్టాన్నీ చేసినప్పటికీ ఆచరణలో బేనామీ భూస్వామ్యం కొనసాగింది. చాలకాలం వరకు దేశముఖ్, దేశపాండే, ముక్తేదార్‌లు నష్టపరిహారాలు పొందారు.

ప్రజలు మాత్రం తాము స్వాధీనం చేసుకున్న భూముల్ని భూసంస్కరణల ఎండమావుల కోసం వదులుకోవాల్సి వచ్చింది. కనుక ఇది ఆక్రమణమే కాని విలీనం కాదు.

1951 అక్టోబర్‌లో కమ్యూనిస్టు పార్టీ సాయుధ పోరాట విరమణ చేసింది. ఈ విరమణ బేషరతుగా చేసింది. అంటే ఆయుధాలు నెహ్రూ ప్రభుత్వానికి అప్పగించింది. ప్రజలు స్వాధీనం చేసుకున్న భూములపై వాళ్లకు హక్కు కల్పించాలన్న కనీస డిమాండయినా పెట్టలేదు. పైగా కాంగ్రెస్‌తోపాటు కమ్యూనిస్టు పార్టీ కూడ భూసంస్కరణలు జరుగుతాయని ప్రజల్ని మభ్యపెట్టింది. కనీసం పార్టీపై నిషేధాన్ని కూడ ఎత్తివేయించుకోలేకపోయింది. 1952 ఎన్నికల్లో పి.డి.ఎఫ్. పేరుతో పోటీచేసి తెలంగాణలో తొంభైస్థానాల్లో నలభై ఎనిమిది స్థానాలు గెలుచుకున్నది. పార్లమెంటరీ రాజకీయాల్లో ప్రవేశించి 1946లో తానే 'చైనా మార్గమే మన మార్గమని' ప్రకటించిన నూతన ప్రజాస్వామిక విప్లవ పంథాకు నీళ్లు వదిలింది. ఇది విద్రోహం. ఇది విద్రోహమని భావించిన శ్రేణులు, ప్రజలు పదహారేళ్లపాటు 1967లో మళ్లా నక్సల్బరీ పంథా నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని చేపట్టేవరకు నిరీక్షించవలసి వచ్చింది.

అంతర్జాతీయ పరిణామాల వల్ల కూడ 1951లో ఇక్కడి కమ్యూనిస్టు పార్టీ తీసుకున్న నిర్ణయానికి కృశ్చేవ్ శాంతియుత సహజీవనం, సామరస్య పంథా ఆలంబన అయింది.

1948 సెప్టెంబర్ 17న సాయుధ పోరాటం విరమించి ఉండవలసింది అని భావించిన నాయకత్వం, శ్రేణులు ఉన్నట్లు గానే 1951లో కూడ విరమించి ఉండవలసింది కాదు అని భావించిన నాయకులు, శ్రేణులు, ప్రజలు కూడ ఉన్నారు. ముఖ్యంగా నక్సల్బరీ పంథాను ఈనాడు బలపరుస్తున్నవాళ్లు, అనుసరిస్తున్న వాళ్లు అందరూ 1948 సెప్టెంబర్ 17న జరిగింది భారత సైన్యం దురాక్రమణ అని, అక్టోబర్ 1951లో కమ్యూనిస్టు పార్టీ చేసింది విద్రోహమనే భావిస్తున్నారు. వర్గపోరాటంలో విశ్వాసమున్నవాళ్లు, దేశాల స్వాతంత్ర్య పోరాటాలైనా, జాతుల విముక్తి పోరాటాలైనా, ప్రజల విప్లవ పోరాటాలైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో సాగినపుడు అవి దీర్ఘకాలిక సాయుధ పోరాటాలుగా, ప్రజల విప్లవ పోరాటాలుగానే విజయవంతమవుతాయనే మావోయిస్టు అవగాహన ఉన్నవాళ్లు కూడ సెప్టెంబర్ 17, 1948లో సాయుధ పోరాట విరమణ చేసి ఉండాల్సింది అనే అవగాహననయినా, అక్టోబర్ 1951లో సాయుధ పోరాట విరమణ చేసిన ఆచరణనైనా రివిజనిజంగా, పాలకవర్గాలకు దాసోహంగా, ప్రజలకు విద్రోహంగానే భావిస్తారు. ముఖ్యంగా 1946లో చైనా మార్గమే మన మార్గమని గ్రహించిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం సోవియెట్ రష్యాలో వలె సాయధతిరుగుబాటు కాకుండా చైనాలో వలె దీర్ఘకాలిక సాయుధ పోరాటం నిర్వహించాల్సి ఉంటుంది అని ఒక వంక ప్రకటించి, మరొక వంక అప్పటి నుంచే సాయుధ పోరాట విరమణ ఆలోచన చేస్తూ (కిషన్ డాక్యుమెంట్ పేరుతో దేశానికి 1947 ఆగస్ట్ 17న స్వాతంత్ర్యం వచ్చి నెహ్రూ ప్రభుత్వం ఏర్పడితే సాయుధ పోరాట విరమణ చేయాలని పార్టీ నాయకత్వం ప్రతిపాదించి, పార్టీలో అత్యధికుల ఆమోదం లేకపోవడం వల్ల సాయుధ పోరాటానికే పిలుపు ఇచ్చిందని పార్టీలో అంతర్గత చర్చ ఉన్నది) 1948 సెప్టెంబర్ 17న కాకున్నా 1951 అక్టోబర్‌లో నైనా పోరాట విరమణ చేయడం స్పష్టంగా రివిజనిస్టు ఆలోచనా ధోరణే. విద్రోహమే. మరీ ముఖ్యంగా చైనా రైతాంగ పోరాటం కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో దీర్ఘకాలిక సాయుధ పోరాటంగా కొనసాగుతూ, 1937లో జపాను దాడితో సామ్రాజ్యవాద వ్యతిరేక జాతివిముక్తి పోరాటంగానూ, దేశ స్వాతంత్ర్య పోరాటంగానూ తక్షణ

సమస్యగా ముందుకువచ్చింది. జపాను సామ్రాజ్యవాదాన్ని సాయుధంగా ప్రతిఘటించి ఓడించి 1949 అక్టోబర్ 1న కమ్యూనిస్టు పార్టీ అది దేశ స్వాతంత్ర్య, జాతివిముక్తి, ప్రజావిప్లవ విజయంగా ఏకకాలంగాను సాధించగలిగింది. ఈ అనుభవాన్ని పాలకవర్గాల ప్రతినిధి ఐన నెహ్రూ గ్రహించినంతగా ప్రజాపోరాటాల ప్రతినిధియైన కమ్యూనిస్టు పార్టీ గ్రహించలేకపోవడం రివిజనిజమే, విద్రోహమే. వియత్నాం పోరాటం కూడ ఇటువంటి జాతివిముక్తి పోరాటానికి తెలంగాణ ముందున్న ఒక ఉత్తేజకరమైన ఉదాహరణ. మావో నుంచిగానీ, హోచిమిన్ నుంచిగానీ ఏమీ నేర్చుకోలేని కమ్యూనిస్టుపార్టీ 1956లో కృశ్చేవ్ నాయకత్వంలో బయటపడిన వర్గ సామరస్య వైఖరికి మన దేశంలో 1951లోనే తెర ఎత్తింది.

అందుకే భారత కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం కృశ్చేవ్, గోర్బచెవ్‌ల కన్నా చాల ముందుగానే వర్గసామరస్య రాజకీయాలకు, గ్లాస్‌నాస్త్, పెరిస్త్రోయికాలకు 1951లోనే బాటలు వేసిందని, ఈ విద్రోహాన్ని ప్రజలు క్షమించరని నక్సల్బరీ పంథా స్పష్టం చేసింది.

భూమి, భుక్తి, విముక్తి పోరాటాల ద్వారా తెలంగాణ విమోచన సాధిస్తానని బయల్దేరిన కమ్యూనిస్టు పార్టీ 17 సెప్టెంబర్ 1948న సైనిక చర్యను విలీనంగా భావించడమైనా, 1951 అక్టోబర్‌లో సాయుధపోరాట విరమణ చేయడమైనా విద్రోహమే.

కమ్యూనిస్టు పార్టీ 1964లో సిపిఐ, సిపిఎంగా చీలిపోయిన తర్వాత ఇవ్వాళ వారిలో ఎవరు దానిని విమోచన దినంగా భావించినా అది వర్గసామరస్య ధోరణే. విద్రోహమే.

మరి ఎవరి దృష్టిలో సెప్టెంబర్ 17, 1948న తెలంగాణ విమోచన జరిగింది? ఒక్క మాటలో బూర్జువా పార్టీల కన్నిటికీ విలీనమే విమోచనం. ఆగస్ట్ 15, 1947న బ్రిటిష్ వాడు వెళ్లిపోవడమే స్వాతంత్ర్యమైనట్లు, రూపమే సారమైనట్లు.

ఈ విలీనాన్ని జాతియోద్యమ పార్టీలన్నీ స్వాగతించాయని పైన చెప్పాను.

అప్పటికి హిందుత్వ భావజాలంతో ఉండి తర్వాత ఏర్పడిన భారతీయ జనసంఘ్‌కు అయినా, ఇప్పటి భారతీయ జనతా పార్టీకైనా తప్పకుండా ఇది విమోచనమే. ఆర్యసమాజ్ హిందూ మతసంస్కరణ వాద సంస్థ అయినా వాళ్లు హిందూ సమాజంలోనైనా విగ్రహారాధనకు వ్యతిరేకంగా, కొన్ని మూఢవిశ్వాసాలకు వ్యతిరేకంగా పోరాడారు. గ్రామాల్లో మత పరివర్తనను అడ్డుకున్న ఆర్య సమాజ్ కార్యకర్తలు దళితులతో, బడుగువర్గాలతో ఉంటూ భూమి సమస్యవంటి మౌలిక సమస్యల పరిష్కారానికి పెత్తందార్లతో తలపడినారు. తర్వాత కాలంలో ఇప్పుడు ఆర్యసమాజ్ విమోచనాదినంగా జరుపుతున్నప్పటికీ అప్పటికి విలీనంగా మాత్రమే దానిని స్వాగతించారు. కాంగ్రెస్ పార్టీ భూసంస్కరణలు, సాంఘిక సంస్కరణలు చేపడ్తుందని భ్రమపడ్డారు.

నైజాం రాజు ముస్లిం కనుక తొలగిపోవాలని, ఆయనకు ముస్లింలయిన రజాకార్ల అండ ఉందని కనుక రజాకార్ల అణచివేత, ఊచకోత, ముస్లిం రాజు పాలన అంతం కావడం హిందుత్వవాదులకు విజయమే. అందుకే పోరాటకాలంలో నామరూపాలు కూడ లేని భారతీయ జనతాపార్టీ ఏర్పడినప్పటినుంచి సెప్టెంబర్ 17 విలీన దినాన్ని విమోచనా దినంగా జరుపుతున్నది. ముఖ్యంగా కేంద్రంలో బిజెపి నాయకత్వంలో ఎన్డీఏ ప్రభుత్వం ఏర్పడినప్పటి నుంచీ ఆగస్ట్ 15, జనవరి 26 వలె సెప్టెంబర్ 17ను ప్రభుత్వమే అధికారికంగా తెలంగాణ విమోచనదినంగా జరపాలని డిమాండ్ పెడుతున్నది. 1998లో నిజాం కాలేజ్ గ్రౌండ్స్‌లో తెలంగాణ విమోచన దినం స్వర్ణోత్సవాలు జరిపింది. విలీనం ద్వారా విమోచన సాధించిన సర్దార్ వల్లభభాయ్ పటేల్‌తో అప్పటికి బాబ్రీమసీదును కూల్చిన లాల్‌కృష్ణ అద్వానీని హోంమంత్రి కూడ అయ్యాడు గనుక ఉక్కుమనిషిగా పోల్చింది. పదేళ్లుగా విలీనాన్ని విమోచనోత్సవంగా ప్రభుత్వమే జరపాలనే డిమాండు పెడుతూనే ఉన్నది. రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్‌లోను, బిజెపిలోను పులిగా పేరు తెచ్చుకున్న ('పులి' శివసేనగుర్తు) నరేంద్ర తెలంగాణ ప్రత్యేకరాష్ట్ర డిమాండుతో బిజెపికి రాజీనామా చేసి తెరాసలో చేరినా సెప్టెంబర్ 17 విషయంలో ఆయన వైఖరి ఏమీ మారలేదు. బిజెపి కూడ ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని కోరుతున్నది కనుక మారవలసిన అవసరం లేదు. అట్లాగే తెరాస కూడ ఈ సంవత్సరం గ్రేటర్ హైదరాబాదు ఎన్నికల దృష్ట్యా సచార్ కమిషన్ రిపోర్టును ముస్లింల యోగక్షేమాలకోసం అమలు చేయాలని డిమాండు చేస్తున్నది గనుక ఎక్కువ మాట్లాడడం లేదు గానీ సెప్టెంబర్ 17 విలీనదినాన్ని విమోచనదినంగా భావించి నిర్వహిస్తున్నదే.

కాకపోయినా సెప్టెంబర్ 17 ఆక్రమణ (దురాక్రమణ?) దినమని మాత్రం తెలంగాణ రాష్ట్ర సమితి కూడ భావించదు. అంగీకరించదు. తెలుగుదేశం పార్టీకి పోరాట చరిత్రలేదు. ఉన్నదల్లా వలసవాద ఆక్రమణ చరిత్రే. కనుక ఆ పార్టీ సెప్టెంబర్ 17ను విమోచన దినంగా భావించి నిర్వహించడం ఆశ్చర్యం కాదు. అయినా ఆ పార్టీకి చరిత్రమీద గురి లేదు. తెలంగాణ సందర్భంగా ఆ పార్టీ గురించి ఎంత తక్కువ మాట్లాడుకుంటే అంత మంచిది.

1948 సెప్టెంబర్ 17 ఆక్రమణ (దురక్రమణ?) దినంగా భావించేవాళ్లు కమ్యూనిస్టులు, ముస్లింలు, ప్రజాస్వామ్యవాదులు, ఐక్యరాజ్యసమితి పొందుపరుచుకున్న మానవ హక్కుల నియమావళిని గౌరవించే వాళ్లు మాత్రమే.

జాతుల స్వయం నిర్ణయ హక్కును, ప్రజల ప్రజా స్వామిక ఆకాంక్షలను గౌరవించే వారు ఎవరైనా 1948 సెప్టెంబర్ 13 నుంచి 17 వరకు భారత ప్రభుత్వ సైన్యాలు చేసింది దురాక్రమణ అనే భావిస్తారు. విలీనం ఆక్రమణ అనే భావిస్తారు. విమోచనపోరాటం చేపట్టిన కమ్యూనిస్టు పార్టీ పోరాట విరమణ చేయడం విద్రోహమనే భావిస్తారు.

అందువలన సెప్టెంబర్ 17న తెలంగాణ విమోచనదినంగా నిర్వహించడం హిందుత్వ వాదాన్ని, దోపిడీవర్గాల ఆక్రమణవాదాన్ని సమర్థించడమే అవుతుంది. నిజమైన స్వాతంత్ర్యాన్ని కోరుకునే వాళ్లు ఆగస్ట 15ను నిరసన దినంగా పాటిస్తున్నట్లుగా, నిజమైన ప్రజాస్వామ్యాన్ని కోరుకుంటున్నవాళ్లు జనవరి 26న బూటకపు ప్రజాస్వామ్య దినంగా నిరసిస్తున్నట్లుగా, నిజమైన తెలంగాణ విమోచన కోరుకునేవాళ్లు సెప్టెంబర్ 17ను విద్రోహదినంగా, ఆక్రమణదినంగా నిరసన తెలియ చేయవలసిందే తప్ప బలవంతపు విలీనాన్ని విమోచనగా గుర్తించడం అప్రజాస్వామిక అవగాహన. అది ప్రత్యేక తెలంగాణ ప్రజాస్వామిక పోరాటానికి అపచారం చేయడమే అవుతుంది. ◆

**భూస్వామ్య వ్యవస్థ రద్దుకావటం దళారీ బూర్జువా వర్గానికి ఎంతో లాభదాయకమని, అందుకే అంత ఆసక్తితో దేశంలో ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకు ప్రభుత్వం అనుమతి ఇస్తోందని అంటున్నారు సత్యనారాయణ**

# సెజ్‌లపై కేంద్ర ప్రభుత్వ ఆసక్తి

పారిశ్రామిక దేశంగా దేశాన్ని అభివృద్ధి చేయాలని కేంద్ర ప్రభుత్వం దేశంలో ప్రత్యేక ఆర్థిక మండలాలు (సెజ్) ఏర్పాటుకు అత్యధిక ఆసక్తిని చూపిస్తోంది. పెట్టుబడులు పెట్టమని, ప్రాథమిక సౌకర్యాలన్నిటిని కల్పిస్తామని బహుళజాతి సంస్థలను, ప్రవాస భారతీయులను దేశంలోని బడా పెట్టుబడిదారులను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆహ్వానిస్తున్నాయి. దేశంలోని కీలకరంగాలను కూడా అప్పగించటానికి కూడా సిద్ధమౌతున్నాయి. వేల ఎకరాలతో ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకు ఆ సంస్థలతో ఒప్పందాలు కుదుర్చుకుంటున్నాయి. భూమిని కూడా రైతుల నుండి బలవంతంగా సేకరించి పెడుతున్నాయి. పెట్టుబడులపై రాయితీలు ఇవ్వటానికి, లాభాలను స్వదేశాలకు తరలించుకు పోవటానికి వీలుగా హామీలు ఇస్తున్నాయి. పన్నులలో రాయితీలు ఇస్తున్నాయి. విదేశీ బహుళజాతి సంస్థలతో మిలాఖత్ అయి పరిశ్రమలు పెడితే ఏమౌతుందో అన్న విషయం మరుగు పరుస్తున్నాయి. ఇతర దేశాలతో వచ్చిన అనుభవాల నుంచి గుణపాఠాలు నేర్చుకోడానికి నిరాకరిస్తున్నాయి.

సరళీకృత ఆర్థిక విధానాల అమలుకు ఈ మండలాల ఏర్పాటు తప్పదని సమర్థించుకుంటున్నాయి. వీటి ఏర్పాటు వల్ల ఉపాధి అవకాశాలు పెరుగుతాయని చెబుతున్నాయి. ప్రపంచ మార్కెట్‌లో భాగస్వామ్యం పొంది అభివృద్ధి చెందిన దేశాలతో పోటీలో మన సరుకులు నిలవాలంటే, మన ఎగుమతులు పెరగాలంటే మండలాల ఏర్పాటు తప్పందంటున్నారు.

దేశంలో భూసంస్కరణలు అమలు జరిపినందున, దేశంలో రైతుల కొనుగోలు శక్తి పెరిగినందున, వారికి అవసరమైన వస్తువులు అందుబాటులో ఉండాలంటే ఈ మండలాలు అవసరమని వాదిస్తున్నాయి. కమ్యూనిస్టు దేశమైన చైనా కూడా ఈ ప్రత్యేక మండలాలను ఏర్పాటు చేస్తున్నదని ఉదహరిస్తున్నాయి. ఇతర దేశాల నుండి ఆధునిక సాంకేతిక విజ్ఞానం, యంత్రాల దిగుమతికి ఇదే ఉత్తమ మార్గమని సమర్థించుకోజూస్తున్నాయి.

అయితే, ఈ ఆర్థిక మండలాల్లో ఏర్పాటు చేసే పరిశ్రమల పై గానీ, ఆ పరిశ్రమలలో పని జేసే కార్మికులపై గాని మన దేశంలోని చట్టాలు ఏవీ వర్తించవు. కార్మికులు సంఘం పెట్టుకునే హక్కుగాని, సమ్మె జేసే హక్కుగాని ఉండవు. కాంట్రాక్ట్ లేబర్ పద్ధతిలో కార్మికులను ఉద్యోగాలలో చేర్చుకుంటారు. ఎవరికీ పర్మనెంట్ ఉద్యోగం అంటూ ఉండదు. ఆ రకంగా కార్మికవర్గాన్ని పూర్తిగా తమ చెప్పుచేతలలో ఉంచుకుంటారు. కార్మికవర్గం పరిస్థితి ఇలా ఉంటే, భూమిని పోగొట్టుకున్న రైతుల పరిస్థితి మరింత అధ్వాన్నమౌతోంది. భూమికి బదులు భూమి ఇవ్వరు. నష్టపరిహారం చెల్లిస్తారు. దానితో వారి జీవన విధానమే మారిపోతుంది. తమ భూములలో కూలీలుగా పనిచేయాలి అంటే దేశంలోనే మరొక స్వతంత్ర ప్రాంతం ఈ ప్రత్యేక మండలాల ఏర్పాటు వల్ల ఏర్పడుతోంది. మన ప్రభుత్వపు అధికారం ఈ ప్రాంతంలో చెల్లదు.

ఈ వాదనలలోని పస ఏమిటో పరిశీలిద్దాం. ప్రత్యేక మండలాల ఏర్పాటు వల్ల భూమి కోల్పోయిన రైతులు, ఫ్యాక్టరీలలో చేరిన కార్మికులు కట్టుబానిసలుగా ఎలా మారుతారో ఇంతకు ముందే చూశాం.

ఇక కమ్యూనిస్టు దేశమైన చైనా కూడా ఈ ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు చేస్తోందని చెబుతున్నారు. చైనాలో ప్రత్యేక ఆర్థిక మండలాలు ఎప్పుడు, ఎక్కడ, ఎన్ని ఏర్పాటు చేస్తున్నారో చూద్దాం. చైనాలో కమ్యూనిస్టుల నాయకత్వాన నూతన ప్రజాస్వామిక విప్లవం జయప్రదం అయిన తరువాత ఏర్పడిన కమ్యూనిస్టు ప్రభుత్వం భూ సంస్కరణలను జయప్రదంగా అమలు జరిపి భూస్వామ్య వ్యవస్థను రద్దు చేసింది.

ఆ పునాదిపైనే తరువాత వచ్చిన ప్రభుత్వం పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధికి కృషి చేసింది. ప్రత్యేక ఆర్థిక మండలాలను కూడా ఓడరేవులకు దగ్గరలో ఏర్పాటు చేసింది. అవి కూడా అయిదారుకి మించిలేవు. తమ దేశ చట్టాలు అమలు జరిపే షరతుపైన ఏర్పాటుకు అంగీకరించింది. అందువల్లనే ఆ దేశపు జాతీయ సంపద అభివృద్ధి రేటు 8 శాతానికి పైగానే ఉంటోంది. ఎగుమతులు బాగా పెరిగాయి. ప్రపంచ మార్కెట్‌ను శాసించే దశను చేరుకుంది.

మరి మనమెక్కడ ఉన్నాం. మనదేశంలో ప్రజాస్వామిక విప్లవాన్ని నిర్వహించాల్సిన పెట్టిబడిదారీ వర్గం, బ్రిటిష్ ప్రభుత్వపు ఒత్తిడివల్ల అప్పటి వరకు దేశ విభజనకు ససేమిరా ఒప్పుకునేది లేదన్న భారత నాయకత్వం, దేశవిభజనకు అంగీకరించి 'స్వాతంత్ర్యాన్ని' అర్ధరాత్రి సంపాదించుకుంది. భూస్వామ్య శక్తులతో రాజీపడి, వారి ఆస్తులు వారికి విడిచిపెట్టటమే కాకుండా, వారికి రాజాభరణాలు యిచ్చింది. రాజప్రముఖుల్ని చేసింది. రాజ్యాధికారంలో భాగం పెట్టింది. అందువల్లనే దేశంలో భూసంస్కరణలు తూతూ మంత్రంగా అమలు జరిగాయి.

దాని మూలంగానే మన దేశం అర్ధవలస, అర్ధ భూస్వామ్య దేశంగా ఉండిపోయింది. కేంద్రంలో బడాపెట్టుబడిదారీ శక్తుల పెత్తనం కొనసాగు

బ్రిటిష్ పరిపాలనలో రైతులు ఆత్మహత్యలకు పాల్పడలేదనీ, రాయలసీమలాంటి కరువు ప్రాంతంలో కూడా ఆత్మహత్యలు వినలేదనీ, కాని ప్రభుత్వ విధానాలవల్ల ఇప్పుడు వింటున్నామని అంటున్నారు **వి. హనుమంతరావు**

# అనుత్పాదక రంగాలకు బ్యాంకు రుణాలు

**బ్యాం**కులిచ్చే రుణాలు క్రమంగా ఉత్పత్తికి తోడ్పడే రంగాల నుంచి, అనుత్పాదక రంగాలకు మరలుతున్నాయని రిజర్వుబ్యాంకు గణాంకాలు తెలియజేస్తున్నాయి. అలాగే రుణాలు కలవారికే అధికంగా ముడుతున్నాయని, బలహీనవర్గాలకు చేరటంలేదని కూడా ఆ గణాంకాలు రుజువు చేస్తున్నాయి.

వ్యవసాయానికి వస్తున్న రుణాలు మొత్తం బ్యాంకు రుణంలో 1990లో 16 శాతం నుంచి 2003 నాటికి పదిశాతానికి పడిపోయాయి. అదే కాలంలో పారిశ్రామిక రంగానికిస్తున్న రుణాలు 48.7 శాతం నుంచి 38.8 శాతానికి తగ్గిపోయాయి. వ్యవసాయానికిస్తున్న రుణం తగ్గిందని ప్రభుత్వమే అంగీకరించింది కాబట్టి వేరే వివరణ అవసరం లేదు. ప్రస్తుతం కేంద్రంలో అధికారంలోకి వచ్చిన ప్రభుత్వం వ్యవసాయానికిస్తున్న రుణాన్ని మూడు సంవత్సరాల్లో రెట్టింపు చేయటమే అందుకు తిరుగలేని ఉదాహరణ. ఇక్కడ ఒక విషయం గుర్తుచేయాల్సి ఉంది. దేశంలో సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత, నరసింహం కమిటీ ప్రపంచబ్యాంకు పరోక్ష ఆదేశాల మేరకు వ్యవసాయానికిచ్చే రుణం పది శాతానికి తగ్గించాలని సిఫార్సు చేసింది. ఆ సిఫార్సు మేరకు పది శాతానికి తగ్గించింది కాని, అది వ్యవసాయరంగం క్షీణతకు, సంక్షోభానికి, ఆత్మహత్యలకు దారితీయటం, దేశవ్యాప్తంగా ఆందోళన వ్యక్తం కావటంతో ప్రభుత్వం వెనుకడుగువేసి రుణాన్ని రెట్టింపు చేసి ఆందోళన వేడిని కాస్త చల్లార్చింది. కాని వ్యవసాయానికి ఎంత రుణం అవసరమో, అందులో ప్రభుత్వం ఏర్పాటు చేసిన రుణం రుణదాహాన్ని పాక్షికంగా కూడ తీర్చటం లేదని, వారు వడ్డీ వ్యాపారస్తుల మీదే ఆధారపడుతున్నారని అదే రిజర్వ్ బ్యాంక్ గణాంకాలు తెలియజేస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాల్లో వయోజనుల్లో 61 శాతం మందికి బ్యాంకుల్లో ఎక్కౌంట్లే లేవు. ఎక్కౌంట్లున్న 39 శాతం మందిలో 9.5 శాతం మందికే బ్యాంకులు రుణాలిస్తున్నాయి. ఈ పరిస్థితిని మరో వైపు నుంచి చూస్తే గ్రామాల్లో నివసించే 14.70 కోట్ల కుటుంబాల్లో 8.90 కోట్ల వ్యవసాయదారుల కుటుంబాలు. వీరికి వ్యవస్థాగత, అవ్యవస్థాగత రుణసౌకర్యం అందుబాటులో లేదు. 27 శాతం వ్యవసాయ కుటుంబాలకే వ్యవస్థాగత రుణ సౌకర్యం లభిస్తోంది. 1991 నుంచి చూస్తే గ్రామీణ కుటుంబాలు చేసిన అప్పులో వడ్డీ వ్యాపారస్తుల వాటా 1991లో (అంటే సంస్కరణలు ప్రవేశపెట్టిన సంవత్సరం) 17.5 శాతం నుంచి 2001లో 29.6 శాతానికి పెరిగింది. వ్యవస్థాగత రుణసౌకర్యం లభించని వారిలో సన్నకారు రైతులు, భూమిలేని వ్యవసాయకూలీలు, నోటిమాటగా తీసుకొన్నవాళ్లు, స్వయం ఉపాధిలో నిమగ్నమైనవారు, అసంఘటిత వ్యాపారులు, పట్టణాల్లో మురికివాడ నివాసులు, మైనారిటీలు, ఎస్సీ, ఎస్టీలు, వృద్ధులు, స్త్రీలు ఉన్నారని రిజర్వ్ బ్యాంక్ డిప్యూటి గవర్నర్ ఉషాథొరత్ వెల్లడించారు. స్వయాన రిజర్వ్‌బ్యాంక్ గవర్నర్ వై.వేణుగోపాల్‌రెడ్డి మాట్లాడుతూ "విశాల జనబాహుళ్యాన్ని, ముఖ్యంగా పెన్షనర్లను స్వయం ఉపాధి వారిని, అసంఘటిత రంగంలో ఉండేవారిని

తున్నా రాష్ట్రాలకు వచ్చేసరికి, భూస్వామ్య శక్తుల ప్రాబల్యం ఎక్కువగా ఉంది. ఆ శక్తులపై చర్య తీసుకునే శక్తి కేంద్ర ప్రభుత్వానికి లేదు. మన దేశ జాతీయ సంపద అభివృద్ధి రేటు నాలుగు శాతానికి దాటడం లేదు.

ఇప్పుడు భూస్వామ్య వ్యవస్థను రద్దు చేయాలంటే రైతు కూలీల అండ ప్రభుత్వానికి కావాలి. వీరిని ఉద్యమంలోకి తీసుకురావాలంటే వారిలో రాజకీయ చైతన్యం కలిగించాలి. దేశంలో రైతాంగ, కార్మిక వర్గం ఇప్పటికీ, భూస్వామ్య వ్యతిరేక, పెట్టుబడిదారీ వ్యతిరేక పోరాటాలలో కొంతమేరకు రాటుతేలింది. తెలంగాణలో సాయుధ రైతాంగ పోరాటామే నిర్వహించింది. ఆ అనుభవం రైతాంగానికి ఉంది. ఇప్పుడు గనుక బడాబూర్జువా, పెట్టిబడిదారీ వర్గం భూస్వామ్య వ్యతిరేక పోరాటం ప్రారంభిస్తే, ఆ ఉద్యమం అక్కడితో ఆగకుండా ప్రజాస్వామిక విప్లవానికి, తద్వారా సోషలిస్టు విప్లవానికి దారితీయవచ్చన్న భయం పెట్టుబడిదారీ వర్గానికి ఉంది. బహుళజాతి సంస్థలకు, ఏకధృవప్రపంచం కోసం కలలుగంటున్న అమెరికా సామ్రాజ్యవాదానికి కూడా ఇష్టం లేదు.

ఇటువంటి పరిస్థితులలో ప్రపంచీకరణ, సరళీకరణ, ప్రైవేటీకరణ సంస్కరణలను ప్రపంచబ్యాంక్, ప్రపంచ వాణిజ్య సంస్థ, అంతర్జాతీయ ద్రవ్య సంస్థలు అమలుకు పూనుకున్నాయి. స్వకార్యం, స్వామికార్యం పూర్తి అవుతాయన్నట్లుగా కేంద్రంలోని బడా పెట్టుబడిదారీ దళారీ వర్గం ఆ సంస్కరణలను విధేయురాలుగా అమలు జరుపుతున్నది. అందులో భాగమే ఈ ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటు. ప్రత్యేక ఆర్థిక మండలాలు ఐదువేల హెక్టార్ల భూమిలో ఏర్పాటు చేయవచ్చు. ఈ మండలాల్లో కొంత భాగంలో ఫ్యాక్టరీలు నిర్మించినా, ఎక్కువ భాగంలో పెట్టిబడిదారుల నాయకత్వాన కార్పొరేట్ వ్యవసాయ వ్యవస్థ ఏర్పాటు చేయవచ్చు. ఆ విధంగా భూస్వామ్య వ్యవస్థను బలహీనపరచి, క్రమంగా రద్దు చేయవచ్చు. భూస్వామ్య వ్యవస్థ రద్దుకావటం దళారీ బూర్జువా వర్గానికి ఎంతో లాభదాయకం. అందుకే అంత ఆసక్తితో దేశంలో ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకు అనుమతి ఇస్తోంది. ఒకే దెబ్బకు రెండు పిట్టలను కొట్టినట్లు అవుతుంది. ◆

బ్యాంకింగ్ సేవలనుంచి దూరంగా ఉంచటం పట్ల" అందోళన వ్యక్తం చేశారు. గ్రామీణ ప్రాంతాన్ని, ముఖ్యంగా వ్యవసాయం, తత్సంబంధిత రంగాలను బ్యాంకులు ఎప్పుడూ చిన్నచూపు చూస్తునే వచ్చాయి. ఉదాహరణకు మే 25, 2007 నాటికి వ్యక్తులకు ఇచ్చిన రుణాలు నాలుగున్నర లక్షల కోట్ల రూపాయలైతే, వ్యవసాయానికి ఇచ్చిన రుణం రు. 2.2 లక్షల కోట్లు మాత్రమే. అంటే సగానికిసగం. వ్యవసాయ రంగం సంక్షోభంలో పడిందంటే పడదా?

బ్యాంకులను జాతీయం చేయకముందు, చేసిన తర్వాత వ్యవసాయానికి, గ్రామీణ ప్రాంతాలకు అవసరమైన మేరకు రుణాలిచ్చిందేపుడు? జాతీయం చేసిన అనంతరం గణనీయమైన మార్పు చోటు చేసుకొన్న విషయం కాదనలేం. పల్లెల్లో బ్యాంకు శాఖలు ఇబ్బడిముబ్బడిగా పెరిగాయి; గ్రామీణ బ్యాంకులేర్పడ్డాయి; నాబార్డ్ గ్రామీణ ప్రాంతాల అవసరాల మీద కేంద్రీకరించింది. నిరుపేదలకు ప్రత్యేక పథకాల ద్వారా రుణసదుపాయం కల్పించింది. అయితే, 1991 లో ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత పరిస్థితి తారుమారయింది. వ్యవసాయ రుణాలు గుంటపూలు పూయటం ప్రారంభమై రైతాంగం, ముఖ్యంగా సన్నకారు, చిన్న రైతులకు బ్యాంకు రుణాలు దూరమయ్యాయి. వడ్డీ వ్యాపారస్తుల పంట పండింది. బ్యాంకు శాఖలు గ్రామీణ ప్రాంతాల్లో 1993లో 35 వేల నుంచి 2006లో 30 వేలకు పడిపోయాయి. గ్రామీణ బ్యాంకులు (ఆర్.ఆర్.బి.) 1990లో 196 ఉంటే 2006కు 104కు తగ్గిపోయాయి. అప్పు తీసుకొన్న వారి ఎకౌంట్ల సంఖ్య 1991లో 659 లక్షలనుంచి 2001లో 524 లక్షలకు తగ్గించేశారు. గ్రామీణులకిచ్చిన రుణం 1987లో 15.3 శాతం (మొత్తం బ్యాంకు రుణంలో) నుంచి 2006లో 8.4 శాతానికి దిగజారింది. పై గణాంకాలు గ్రామీణ ప్రాంతానికి సంబంధించినవి. నేరుగా వ్యవసాయం విషయానికి వస్తే, బ్యాంకులిచ్చిన మొత్తం రుణంలో వ్యవసాయం వాటా 1990లో 19 శాతం నుంచి 2005లో 11 శాతం కన్నా తక్కువకు పడిపోయింది. దీర్ఘకాలిక రుణాల విషయానికొస్తే వ్యవసాయానికిచ్చిన రుణంలో చిన్న, సన్నకారు రైతులకిచ్చిన రుణం 1991-2000 మధ్యకాలంలో ఆరు శాతం మేరకు పడిపోయింది. 25 వేల రూపాయలకన్నా తక్కువరుణం పొందిన వారి సంఖ్య తగ్గింది. రెండు హెక్టార్లలోపు (అయిదెకరాల) రైతులకు 57 శాతం రుణం మాత్రమే అందింది.

వ్యవసాయానికి నిర్వచనం కేవలం పంట పండించడమే కాదు, పశు సంపద, కోళ్లు, గొర్లు, మేకల పెంపకం లాంటి వన్నీ వ్యవసాయం పద్దు కింద వస్తాయి. వ్యవసాయదారులకు పంట పండించడానికి ఎరువులు, విత్తనాలు, పురుగు మందులు అమ్మేవారికిచ్చే రుణాలు కూడా ఈ పద్దు కింద చేర్చారు. ఇన్ని కార్యక్రమాలకు కలిపి పదిశాతం మాత్రమే రుణంగా అందు తుందంటే అదెలాంటి సాయమో అర్థం చేసుకోవచ్చు. వ్యవసాయదారులు అనేక ప్రకృతి వైపరీత్యాలను ఎదుర్కొంటుంటారు. వర్షాభావం, అధిక వర్షాలు, తుఫాన్లు, పురుగుల దాడులు ఎదుర్కొంటుంటారు. ఒకోసారి వరుసగా రెండు మూడు సంవత్సరాలు వైపరీత్యాలు సంభవిస్తుంటాయి. అలాంటప్పుడు తీసుకొన్న రుణాన్ని తిరిగి చెల్లించలేని పరిస్థితి. కొన్ని సందర్భాల్లో రుణం వసూళ్ల వాయిదా వేస్తూ ప్రభుత్వం ప్రకటించే నిర్ణయం అమలులో అనేక పరిమితులు, చిక్కులు ఉండడంతో ఆచరణలో రైతుకు సహాయం అందటంలేదు. రుణం తీర్చలేక ఆత్మహత్యలకు పాల్పడుతున్నాడు. బ్రిటిష్‌వారి పరిపాలనలో కరువు కాటకాలు వచ్చి జనం చనిపోయారు కాని ఆత్మహత్యలకు పాల్పడలేదు. రాయలసీమలాంటి కరువు ప్రాంతంలో

**మొత్తం బ్యాంకు రుణంలో వ్యవసాయానికిచ్చిన రుణం శాతం**

| సంవత్సరం | శాతం | సంవత్సరం | శాతం |
|---|---|---|---|
| 1990-91 | 15.00 | 1998-99 | 11.00 |
| 1991-92 | 15.10 | 1999-00 | 9.90 |
| 1992-93 | 13.60 | 2000-01 | 9.60 |
| 1993-94 | 13.00 | 2001-02 | 9.80 |
| 1994-95 | 11.90 | 2002-03 | 10.00 |
| 1995-96 | 11.40 | 2003-04 | 10.90 |
| 1996-97 | 11.40 | 2004-05 | 10.79 |
| 1997-98 | 11.40 | | |

కూడా ఆత్మహత్యలు జరిగాయని వినలేదు. కాని ఇప్పుడు వింటున్నాం ఎందుచేత? వ్యవసాయానికి కావాల్సిన రుణ సహాయం చేయాల్సిన బాధ్యతను ప్రభుత్వం గాలికి వదిలిపెట్టి, రైతులను వడ్డీ వ్యాపారస్తుల విష కౌగిలిలోకి నెట్టింది. వారికి వ్యవస్థాగత రుణం ఏడాదికేడాది ఎలా తగ్గుతూ వచ్చిందో పట్టిక తెలియజేస్తుంది.

వ్యవసాయానికి రుణసౌకర్యం కలిగించడంలో బ్యాంకులు సాధించిన 'ప్రగతి' ఇదే. వ్యవసాయానికి ఆర్థిక సంస్కరణలు చేసిన మేలు ఇదే. ప్రపంచబ్యాంకు ఆదేశాల మేరకు వ్యవసాయం ఇలా గుంటపూలు పూస్తుంటే, ముఖ్యమంత్రి ఆ బ్యాంకు చుట్టూ ఇంకా ఇంకా రుణం కావాలని ప్రదక్షిణలు చేస్తున్నారు. ప్రాజెక్టులు పూర్తి అయినపుడు పొలాలకు నీరు రావచ్చు. కాని భూమిలేని పేదలకు ఏం లాభం? మహా అయితే మరికొన్ని రోజులు కూలి పని దొరకవచ్చు. అందుకనే నేడు భూపోరాటాలు ఉధృతంగా జరుగుతున్నాయి. పేదల భవిష్యత్తు ఈ పోరాటాలలోనే ఉంది.

పారిశ్రామికరంగానికే బ్యాంకులు పెద్దపీట వేస్తుంటాయని, మొండి బాకీల్లో సింహభాగం వారిదేనని అనుకొంటుంటాం. అది ఇప్పుడూ వాస్తవమే. అయితే ఇటీవలి పరిణామమేమంటే పారిశ్రామికవేత్తలు, కార్పొరేట్లు రుణం కోసం బ్యాంకుల వద్దకు వెళ్లటం తగ్గించాయి. ప్రొఫెసర్ సి.పి. చంద్రశేఖర్ చేసిన విశ్లేషణ చెబుతున్నదేమిటంటే పరిశ్రమల్లో లాభాలు మిన్నంటుతున్నాయి. నికర లాభాలు 30 నుంచి 40 శాతంగా ఉంటున్నాయి. పరిశ్రమల రిజర్వ్ నిధులు మస్తుగా ఉన్నాయి. పెట్టుబడుల కోసం వ్యక్తుల నుంచి, మార్కెట్‌కు వెళితే 2003-04లో రు. 2422 కోట్లు సేకరిస్తే, 2005-06లో రు. 13,781 కోట్లు సేకరించగలిగాయి. బిజినెస్ స్టాండర్డ్ పత్రిక అంచనా ప్రకారం ఈ సంవత్సరానికి ఈ విండో ద్వారా లక్ష కోట్లు సేకరించవచ్చు. పరిశ్రమలు సంపాదించిన లాభంలో కొంతభాగం పక్కన పెడతారు. అలాంటి నిధులు గత మూడు సంవత్సరాల్లో రు. 15,465 కోట్ల నుంచి మూడు రెట్లు పెరిగాయి. ఈ నిధులన్నీ చాలక, అప్పు చేయాల్సి వస్తే, విదేశాల్లో నిధులు తక్కువ వడ్డీకి లభిస్తాయి కాబట్టి అక్కడ నుంచి అప్పులు తెచ్చుకొంటున్నారు. అలాంటప్పుడు దేశంలో బ్యాంకుల వద్దకు పోయి రుణం తెచ్చుకోవాల్సిన అవసరమేముంటుంది? ఈ పరిస్థితిలో బ్యాంకులు తమ నిధులను ఎవరికి రుణం ఇవ్వాలి?

వాటి దృష్టి మధ్యతరగతిలో ఉన్నతవర్గం మీద పడింది. ఆ వర్గం ఆదాయాలు, జీతాలు పెరిగాయి. కార్లు, స్కూటర్లు, వినిమయ విలాస వస్తువుల కొనుగోళ్లు విపరీతంగా చేస్తున్నారంటే వారికి డబ్బు కావాలి. బ్యాంకులు, విమాన సర్వీసులు, ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ రంగాల్లో పని చేస్తున్న వారంతా ఈ తరగతిలోకి వస్తారు. నెలకు 60 వేల నుంచి లక్ష

**ఏ సమాజాలలో న్యాయవ్యవస్థ ధ్వంసం అయిపోతుందో, అసమర్థంగా ఉంటుందో ఆ సమాజాలలోనే మాఫియాలు తలెత్తుతాయి, సరిగ్గా ఇవ్వాళ దేశం ఆ స్థితిలో ఉందంటున్నారు కె.జి. కన్నబిరాన్**

# ఆరు దశాబ్దాల అభివృద్ధి

*(గత సంచిక తరువాయి)*

"పరిమిత శాసనాలు దాదాపు అన్నివేళలా ఒక నిర్బంధ పూరితమైన వ్యవస్థాత్మక మార్పులకు సూచికలే తప్ప దానికి కారణం కావు. పౌరుడికి వ్యక్తిగా ఉండే రక్షణ ఎప్పుడూ ప్రధానంగా విధానాలలో మాత్రమే ఉండవచ్చు." అని స్టేన్లీ డైమండ్ అన్నాడు.

ఇప్పుడిక 1947 తరువాత గడచిన ఆరు దశాబ్దాలలో పాలనకు అవతలి కోణాన్ని పరిశీలిద్దాం.

దాదాపు వంద సంవత్సరాల కింద అమృతసర్‌లో జరిగిన కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసంలో మోతీలాల్ నెహ్రూ భారతదేశంలో హిందూ ముస్లిం ఐక్యతను దెబ్బతీయడానికి బ్రిటిష్ పాలకులు చేస్తున్న ప్రయత్నాలను గురించి మాట్లాడాడు. "చట్టబద్ధంగా ఏర్పడిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా హిందువులు, ముస్లింలు సోదరభావం కనబర్చడాన్ని" నేరంగా పరిగణిస్తున్నందుకు బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఆయన తప్పుబట్టాడు. ఆయన ఉపన్యాసం జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ తరువాత జరిగింది. ఆయన ఆ హత్యాకాండను ఖండించడం మాత్రమే కాదు, రౌలట్ సిఫారసు చేసిన చట్టాలన్నిటినీ ఖండించాడు. అంటే అన్ని నిర్బంధ చట్టాలకు వ్యతిరేకంగా పోరాడే సంప్రదాయం మనకు ఉంది. అది కేవలం బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా సాగినది మాత్రమే కాదు. స్వాతంత్ర్యానంతరం ఇరవై ఐదు సంవత్సరాల తరువాత ఎమర్జెన్సీ రూపంలోనూ ఆంతరంగిక భద్రతాచట్టంగా వచ్చిన అతికఠినమైన ముందస్తు నిర్బంధచట్టం రూపంలోనూ మనం పోరాడాం. ఆ తరువాత పది సంవత్సరాలకు తీవ్రవాద, విచ్ఛిన్నకర కార్యకలాపాల నిరోధ చట్టానికి వ్యతిరేకంగానూ మనం పోరాడాం. ఆ సమయంలో పార్లమెంట్ సభ్యులతో సమావేశాలు జరుపుతూ దేశవ్యాప్తంగా ప్రచారంతోనూ, ఆ చట్టం కింద నిర్బంధించబడిన వారికి సహాయం చేస్తూనూ ఆ చట్టపు దుర్వినియోగాన్ని ఎత్తిచూపుతూను మనం పోరాడాం. ఆ సమయంలో మన ప్రమాణం ఏమంటే రాజ్యాంగంలోని 51ఎ అధికరణలో మనకివ్వబడిన ప్రాథమిక బాధ్యత. అది మన స్వాతంత్ర్యోదమానికి ప్రేరణగా నిలిచిన ఆదర్శాలను స్వీకరిస్తామని, విస్తరిస్తామని మనం పెట్టుకున్న బాధ్యత.

ఒక వంద సంవత్సరాలు గడిచేసరికి మనకు భారతీయ జనతా పార్టీ అధికారంలోకి వచ్చింది. అది మైనారిటీ పార్టీ అయినప్పటికీ దానికి కొన్ని ప్రాంతీయ పార్టీలు మద్దతు తెలిపాయి. రామ్‌మనోహర లోహియా అనుచరులుగా తమను తాము చెప్పుకొనే కొందరు స్వచ్ఛంధ సోషలిస్టులు కూడా దాన్ని సమర్థించారు. కాని ఆ రామ్‌మనోహర్ లోహియా కేరళలో తన పార్టీ అధికారంలో ఉన్నప్పుడు ప్రజల మీద కాల్పులు జరిపినందుకు తన ప్రభుత్వాన్ని రాజీనామా చేయమని కోరాడు. ఇటువంటి వారందరూ కలిసి ఇప్పుడు అప్రజాస్వామికమైన చర్యలు తీసుకోవలిసిందేనని పోటో వంటి చట్టాలను తేవాలని ఒత్తిడి తెస్తున్నారు. ఈ ప్రయత్నంలో వారికి 'లా' కమిషన్ కూడా తోడ్పడుతున్నది. లా కమిషన్ ఒక శాశ్వత తీవ్రవాద శాసనాన్ని తయారుచేస్తున్నది. సెప్టెంబర్ 11 తరువాత ప్రపంచ వ్యాప్తంగా తీవ్రవాదం మీద అమెరికా చర్యలు ప్రారంభమైన తరువాత, 2001 అక్టోబర్ 24న ఈ ఆర్డినెన్స్ అమలులోకి వచ్చింది. దురదృష్టవశాత్తు ఇటువంటి తీవ్రవాద చట్టాలను 1985లో, 1987లో, 1993లో తీసుకు వచ్చినప్పుడు కాంగ్రెస్‌కు ఎంత ప్రజాదరణ ఉండిందో పోటో ఆర్డినెన్స్ తీసుకువచ్చినప్పుడు బిజెపికి, దాని సమర్థక పార్టీలకు కూడా అంతే ప్రజాదరణ ఉండింది. టాడాను అమలు చేయడంలో అధికారవర్గం, పోలీసుయంత్రాంగం, అధికారపార్టీ రాజకీయ పరపతిని దెబ్బతీసాయి.

---

రూపాయలు అర్జిస్తున్నారు. కాని ఓ ఇల్లు కట్టుకోవాలంటే, ఖరీదైన విలాసవస్తువులను కొనుగోలు చేయాలంటే, ఓ కారు కొనుక్కోవాలంటే వారి ఆదాయాలు చాలవు. వ్యవసాయానికి రుణాలు అరకొరగా ఇస్తుంటే, పారిశ్రామికవేత్తలు, ఇతరత్రా నిధులు సమకూర్చుకొంటుంటే, బ్యాంకుల్లో మూలుగుతున్న నిధులు ఎవరికి అప్పు ఇవ్వాలి? బ్యాంకుల దృష్టి ఈవర్గం మీద పడింది. ఎడమ చేత్తో కుడిచేత్తో రుణాలివ్వటం ప్రారంభించారు. హైదరాబాద్ లాంటి నగరంలో రహదారి పక్కన టెంట్లు వేసి మరీ ఈ వర్గాన్ని ఆకర్షించారు. ఇలాంటి రుణాలు మార్చి 1990 నుంచి మార్చి 2002 మధ్య కాలంలో మొత్తం రుణాల్లో 9.4 శాతం నుంచి 16.8 శాతానికి, మార్చి 2005 నాటికి 27 శాతానికి పెరిగాయి. అలాగే గృహ నిర్మాణానికిచ్చే రుణాలు అదే కాలంలో 2.4 శాతం నుంచి 11 శాతానికి పెరిగాయి. వారికోసం వడ్డీరేటు తగ్గించారు. అయితే ఈ మధ్య గృహ నిర్మాణానికిచ్చే రుణాల జోరు తగ్గించాలని రిజర్వ్‌బ్యాంక్ బ్యాంకులకు సూచించింది. కారణం? రియల్ ఎస్టేట్ ధరలు పెరిగాయి. వడ్డీ రెటు పెంచారు. ఇళ్లు కడుతుండగానే వడ్డీ పెరగటంతో, ఈ వర్గానికి చెందినవారు ఇబ్బంది పడ్డారు. రుణం చెల్లింపు మందగించింది. ఇలాంటి రుణాలు కొన్ని మొండి బాకీలుగా మారే ప్రమాదం లేకపోలేదు. ఇది రెండు పరిణామాలకు దారితీయవచ్చు. 1) రుణం చెల్లించలేదని బ్యాంకులు ఇళ్లను స్వాధీనం చేసుకొని వేలంలో అమ్మేయవచ్చు; 2) రుణం చెల్లించడం కోసం రుణం తీసుకొన్నవారు డబ్బు సంపాదనకు అడ్డదారులు తొక్కవచ్చు. బ్యాంకింగ్ వ్యవస్థ ఈ పరిస్థితిని ఎలా ఎదుర్కొంటుందో వేచి చూడాలి. ◆

ప్రస్తుతం తెహల్కా టేపులు, ఒరిస్సాలో గ్రాహం స్టేయిన్ హత్యతో సహా క్రైస్తవ మైనారిటీల మీద దాడులు భాజపా ప్రభుత్వాన్ని, దాన్ని అధికార వర్గాన్ని అదేరకంగా బదనాం చేశాయి. దీనితో పాటు రాజ్యాంగం కింద పనిచేస్తున్న ఒక రాజకీయపార్టీగా బిజెపికి రాజ్యాంగంలో విశ్వాసం ఎప్పుడూలేదు. తనకు ప్రజాస్వామ్యం మీద విశ్వాసం ఉందని కూడ ఆ పార్టీ ఎప్పుడూ చూపుకోలేదు. నిజానికి ఈ దేశంలోనూ, అన్ని రాష్ట్రాల లోనూ పాలన అంటే ప్రజల మీద ఎడతెగకుండా నేరాలు చేయడమే అనే అర్థం స్థిరపడిపోయింది. రాజకీయస్థాయిలోనూ, ప్రభుత్వ స్థాయి లోనూ బ్రహ్మాండమైన అవినీతి, విస్తృతమైన మానవ హక్కుల ఉల్లంఘన చూస్తే ఎవరైనా ఈ చట్టాలన్నీ పెద్ద ఎత్తున దుర్వినియోగం కావడానికి ఒక సాకు మాత్రమేనని గుర్తించగలరు. అందువల్ల పోటోను వ్యతిరేకించడం ఈ దేశంలో ప్రతి పౌరుడి ప్రాథమిక బాధ్యత అవుతుందే కాని దేశానికి వ్యతిరేకంగా నేరం కాదు.

ఈ ఆర్డినెన్స్ ద్వారా ఏ ప్రాంతాలను, ఏ కార్యకలాపాలను, నిరోధించదలచుకున్నారో ఆ పని చేయడానికి ఇప్పటికే ఎన్నో శాసనాలు ఉన్నాయి. రాజ్యాంగానికి ముందే వచ్చిన బ్రిటిష్ వలసవాద చట్టాలు, 1980 జాతీయభద్రతా చట్టం, 1958 సాయుధదళాల ప్రత్యేక అధికారాల చట్టం, 1999 కల్లోలితప్రాంతాల చట్టం, 1982 హైజాకింగ్ వ్యతిరేక చట్టం, 1982 పౌరవిమానయాన భద్రతకు వ్యతిరేకమైన అసాంఘిక చర్యల అణచివేత చట్టం, 1976 కల్లోలితప్రాంతాల ప్రత్యేక న్యాయస్థానాల చట్టం, 1885 టెలిగ్రాఫ్ చట్టం, 1999 ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ చట్టం, అత్యవసర సర్వీసుల నిర్వహణ చట్టం, 1980 నల్లబజారు నిరోధం, అత్యవసర సరుకుల నిర్వహణ చట్టం, 1908 ఆయుధాల చట్టం, పేలుడు పదార్థాల చట్టం, 1967 సంఘవ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం వంటి చట్టాలు ప్రస్తుత ఆర్డినెన్స్ పరిధినంతా కలిగి ఉన్నాయి. ఆయుధాల చట్టానికి ఇటీవల చేసిన సవరణ, అందులో మరణశిక్షను కూడా కల్పించింది. ఇక భారత శిక్షాస్మృతి మాత్రమే కాక సంఘటిత నేరాల చట్టం వంటి రాష్ట్ర చట్టాలు కూడా దక్షిణ రాష్ట్రాల్లో ఉన్నాయి. అవి కూడా శాంతిభద్రతలను, సామాజికభద్రతను దృష్టిలో పెట్టుకున్నవే. కనుక ఒక దాని వెనుక మరొకటిగా వస్తున్న తీవ్రవాద చట్టాల అవసరాన్ని అంచనా వేసేముందు ఇప్పటి వరకూ ఉన్న ఈ చట్టాలన్నింటినీ ఎలా వాడుతున్నారు, వాటి సామర్థ్యం ఎంత, వాటి పనితీరు ఎలా ఉంది అనే విషయాలు అధ్యయనం చేయాలి, చర్చించాలి. ఒక కొత్త నేర చట్టం చర్చకు వస్తున్నదంటే అంతకు ముందరి నేర చట్టాలన్నీ కాలం చెల్లిపోయాయని ప్రకటించి వాటిని రద్దు చేసే నిబంధన ఉండాలి. అలాగే కొనసాగుతున్న నేర చట్టాలలో కొత్త చట్టపు పరిధి ఉన్న చట్టాలు ఉంటే వాటిని తాత్కాలికంగా ఉపసంహరించాలి. సమాజంలోని అసమానతలను, ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలోని అసమానతలను, శాంతి భద్రతలు గాని, ప్రత్యేకంగా రూపొందించిన చట్టాలు గాని సరిచేయజాలవు.

ఇటువంటి రకపు చట్టాలతో ప్రధాన సమస్య వాటి వాడకమే. ఇటువంటి చట్టాలు ఎప్పుడూ ఉద్దేశించిన ప్రయోజనాలకోసం నిజంగా నిజాయితీతో వాడడం జరగలేదు. ఈ చట్టాల వాడకం వల్ల కలిగిన ఆందోళన అనుభవిస్తే తప్ప అర్థం కాదు. ఆ ఆందోళన ఒక మనిషిని అనుమానితుడుగా చూడడం మొదలైనప్పుడే మొదలవుతుంది. అనుమానితుడ్ని అదుపులో తీసుకోవడానికి భద్రతాదళాలు అర్ధరాత్రి పూట వస్తాయి. ఈ మొత్తం క్రమంలో సాగే సోదాలు, జప్తులు బీభత్స పూరితంగా ఉంటాయి. ఏ ప్రాంతాన్ని సోదా చేస్తున్నారో దాన్ని తలకిందులు చేసి వదిలిపెడ్తారు. ఆ క్రమంలో జరిగే విధ్వంసాన్ని పౌర హక్కుల కార్యకర్తలు తప్ప మరెవ్వరూ ఇంతవరకు నమోదు చెయ్యలేదు. మీ ఇంట్లో నిలువ ఉన్న ధాన్యాన్ని, మీరు కొనుక్కొచ్చుకొన్న కిరాణా సరుకును విచక్షణా రహితంగా ధ్వంసం చేసిపారేస్తారు. మీ ఇంట్లో చొరబడే వ్యక్తులు యూనిఫారాలు వేసుకొనిరారు. ఏమి చేసినా శిక్షలేని అనుమతిని ఈ టాస్క్‌ఫోర్స్ బలగాలకు రాజ్యం అందజేసింది. వారు నెంబర్ ప్లేట్లు లేని కార్లలో ప్రయాణిస్తారు. వారు మిమ్మల్ని సుదీర్ఘకాలం అక్రమ నిర్బంధంలోనో, మీవాళ్లకు తెలియకుండానో ఉంచుతారు. ఎన్‌కౌంటర్లో చంపకపోతే, మాయం చేయకపోతే చివరికి ఒక ఎగ్జిక్యూటివ్ మెజిస్ట్రేట్ ముందర హాజరు పరుస్తారు. ఆ జడ్జి తన కళ్లకు కనబడేదే నిజమని అనివార్యంగా నమ్ముతాడు. అక్రమ నిర్బంధంలో మీరు అనుభవించిన బాధలు, అవమానాలు మీరు నోరువిప్పి చెప్పరు. మీరు ఎప్పుడు అరెస్ట్ అయ్యారో, మిమ్మల్ని అరెస్ట్ చేసినప్పుడు మీ వారిని ఎంతగా వేధించారో, సోదాఅనేది ఎంత పశుప్రాయంగా జరిగిందో మీ కుటుంబ సభ్యులు కూడా ఫిర్యాదు చేయరు. అలా చెబితే మళ్లీ అర్ధరాత్రి దాడులు జరుగుతాయని, మళ్లీ మరిన్ని అవమానాలు జరుగుతాయని మీ కుటుంబం భయపడుతుంది. మీరప్పటికే సంపూర్ణంగా వాళ్ల అదుపులో ఉన్నారు గనుక, అప్పటికే వాళ్లు మిమ్మల్ని ఒక తీవ్రవాదిగా ముద్రవేసి ప్రచారం చేసారు గనుక మిమ్మల్ని ఎంత హింసించారో చెబితే ఆ ఫిర్యాదులను ఎవరు పట్టించుకోరనే అనుమానంతో మీరూ మాట్లాడరు. ఒకవేళ మీరు పోలీసుల చేతికి చిక్కకపోతే మీరు దొరికేవరకు వాళ్లు మీ ముసలి తండ్రినో, మీ ఎదిగొచ్చిన కొడుకునో తమ నిర్బంధంలో పెట్టుకొని చిత్రహింసలు పెడతారు. ఏ చట్టానికి, ఏ సవరణలు చేస్తే ఈ అత్యాచారాలన్ని రద్దవుతాయి? 1975 ఎమర్జెన్సీ నుంచి ఈ అత్యాచారాలే మన పాలనా విధానంగా మారిపోయాయి. చట్టాన్ని అమలు చేయడమంటే ఇటువంటి అత్యాచారాలు చేయడమే అనే అలవాటు స్థిరపడిపోయింది. అందువల్ల ఒక కొత్త నిర్బంధచట్టం ఉనికిలోకి వచ్చిందంటే ఇప్పటిదాకా యథావిధిగా తక్కువ స్థాయిలో భరించేటట్టుగా ఉన్న దుర్వినియోగం ఇకనుంచి మరింత వేగంగా, మరింత దూకుడుగా, హింసాపూరితంగా అమలులోకి వస్తుంది. టాడా చట్టం దుర్వినియోగానికి గురైందని ప్రతి ఒక్కరు అంగీకరించి దాన్ని శిలువ వేశారు. ఆ అత్యాచారాలను అన్ని పౌరహక్కుల, మానవహక్కుల బృందాల కార్యకర్తలు ఎత్తిచూపారు. ఆ సంస్థలు తీసుకున్న వైఖరిని జాతీయ మానవ హక్కుల సంఘం సమర్థించింది. పరిశోధనా సంస్థకు ఉన్న సోదా, జప్తు అధికారాలు విస్తృతమైనవని అవి దుర్వినియోగం కావడానికే అవకాశం ఉన్నదని అందరూ ఒప్పుకున్నారు. విచారణ జరిపేందుకు, పరిహారం ఇచ్చేందుకు ఉన్న నిబంధనలను ప్రభుత్వం ఉల్లంఘించింది. అత్యాచారాలు చేసిన వారి మీద విచారణ జరపడానికి వారి మీద నమ్మకం, వారికి ఇచ్చిన అనుమతుల నిబంధనలు అడ్డం పడ్డాయి.

చట్టబద్ధ పాలన, రాజ్యాంగబద్ధ ప్రజాస్వామ్యం ఏ చరిత్ర గతిలో పురోగమించాయో ఆ క్రమంలోనే చట్టబద్ధ పాలనను, రాజ్యాంగ ప్రజాస్వామ్యాన్ని తోసివేసే ఒక వ్యవస్థ కూడా అభివృద్ధి అయ్యింది.

మన స్వాతంత్ర్యోద్యమ కాలంలో రాజ్యాంగ బద్ధ పాలన గురించి మనం పొందిన శిక్షణతోపాటు గానే బ్రిటిష్ పాలకులు అధికారం సాధారణ చట్టాల ద్వారా పాలించ జాలదనిస కొత్త నేరాలను నిర్వచించే కొత్త శాసనాలు ప్రత్యేక న్యాయస్థానాలు కావాలని కూడా నేర్పారు. అదే క్రమంలో శిక్షాతీత విచారణాతీత నేరాల పరిధిని కూడ విస్తరించారు. దాన్నంతా రౌలట్ చట్టం అని చెప్పుకుంటే ఆ వలసవాద వారసత్వం మనం కొనసాగిస్తున్నాం. నిజానికి ఆ చట్టాలన్ని భారత స్వాతంత్ర్య పోరాటానికి వ్యతిరేకంగా వచ్చి మన శాసనాల పుస్తకంలో చేరాయి. అవే చట్టాలను స్వాతంత్ర్యం తరువాత మన శాసన నిర్మాణంలో కొనసాగిస్తున్నాం. న్యాయ వ్యవస్థలోని ఈ రెండు రకాల విధానం శిక్షాతీత ప్రవృత్తిని సృష్టిస్తుంది, విస్తరిస్తుంది. ఈ ప్రత్యేక నేర చట్టాల, ప్రత్యేక న్యాయస్థానాల రూపకల్పనలో ప్రకటించకుండానే ఉన్న పునాది ఏమంటే చట్టాన్ని అమలు చేసే సంస్థలను విచారణ నుంచి మినహాయించడం. వారికి ఏ నేరం చేసినా శిక్ష లేని స్థితిని కల్పించడం. పంజాబ్, జమ్మూ కాశ్మీర్‌లలో విచారణను ఎదుర్కొంటున్న పోలీసు అధికారులకు మినహాయింపులు ఇవ్వడానికి ఎల్.కె. అద్వానీ చేసిన ప్రయత్నం ఈ వాస్తవానికి ఒక సూచిక. ఈ నేరస్థులైన పోలీసు అధికారులు పాత టాడా కింద పరిశోధన అధికారులుగా ఉన్నారు.

మనదేశంలో తీవ్రవాదం మీద వచ్చిన చట్టాలన్నీ తీవ్రవాద చర్య అనే దాన్ని నిర్వచిస్తాయి గాని, తీవ్రవాదం అంటే ఏమిటో నిర్వచించవు. అసలు అంతర్జాతీయంగానే తీవ్రవాదం అనే పదానికి ఏమని నిర్వచించాలో ఏకాభిప్రాయం లేదు. అందువల్ల 'చట్టబద్ధంగా ఏర్పడ్డ ప్రభుత్వాన్ని కూలదోయడం' అనేది తీవ్రవాద చర్యకాదు. అసలు ఈ మాట వలసవాదం సృష్టించినది. తనకు వ్యతిరేకంగా స్థానిక ప్రజలు తిరుగుబాటు చేసినప్పుడల్లా అది ఈ మాట వాడింది. ఈ మాట స్థానంలో ఇప్పుడు 'భారతదేశపు ఐక్యతను, సమగ్రతను, భద్రతను, సార్వభౌమత్వాన్ని దెబ్బతీసే ఉద్దేశ్యంతో చేసిన ఏ చర్య' అయినా అని వాడుతున్నారు. దీని అర్థం ఏమంటే భారత్ అనే రియల్ ఎస్టేట్‌ను దెబ్బతీసే వారెవరైనా అని. తీవ్రవాద చర్య నిర్వచంలో మరో సగం ప్రజలలో గాని, ప్రజలలో ఒక భాగంలో కాని భయోత్పాతం కల్పించడం అని నిర్వచిస్తుంది. ఈ మాటలు అల్పసంఖ్యాకులలో సమరశీలతనూ, జాతిస్వయం నిర్ణయాధికార పునాదిపై సాగే వేర్పాటువాద రాజకీయాలను అడ్డుకోవడానికి ఉద్దేశించినవే. ఈ రెంటిని మన ప్రభుత్వం గుర్తించడం లేదు. తీవ్రవాదాన్ని అణచివేసే ఈ క్రమం మొత్తంగా ప్రజాస్వామిక చర్చను, సంభాషణను అడ్డుకుంటుంది. అటువంటి చట్టాన్ని గురించి చర్చించేటప్పుడు ఆ శాసనంలోని పదాలను నిబంధనలను వాఖ్యానించడానికి మాత్రమే మనం పరిమితం కాకూడదు. ఆ నిబంధనల చట్టబద్ధత గురించి మాత్రమే మనం చర్చించగూడదు. ఆ శాసనం వెనుక ఉన్న రాజకీయాలను గురించి చర్చించవలసి ఉంటుంది.

కాని న్యాయస్థానాల చరిత్ర చూస్తే, ప్రజాస్వామ్యం గురించి, హక్కుల గురించి చర్చ వచ్చినప్పుడల్లా అవి సాధారణంగా నిరంకుశ పాలనను, నిర్బంధ పూరిత న్యాయవ్యవస్థను సమర్థించాయి. 1950లోని ఎ.కె. గోపాలన్ కేసు నుంచి 1998లోని నాగా మానవ హక్కుల ప్రజా ఉద్యమం కేసుదాకా చరిత్ర ఇదే. ప్రపంచ తీవ్రవాదానికి వ్యతిరేకంగా అమెరికా ప్రారంభించిన జీహాద్ తరువాత పోటో మీద విచారణ నెలలపాటు సాగి ముగియవచ్చు. చట్టాన్ని జాగ్రత్తగా వాడమని న్యాయ స్థానం ప్రభుత్వానికి సలహా ఇవ్వవచ్చు. అనేక న్యాయస్థానాల తీర్పుల నుంచి జాతీయ మానవహక్కుల సంఘం రూపొందించిన మార్గదర్శక సూత్రాలను పాటించమని సలహా ఇవ్వవచ్చు. ఆ సూత్రాలను ఎన్నడూ పాటించినది లేదు. ఆ సూత్రాలు ఉన్నాయనే భ్రమే నిందితుల హక్కుల రక్షణ అని అభిప్రాయం ఉంది. నాగా మానవ హక్కుల కేసులో ప్రత్యేక అధికార చట్టంలో అధికారాల దుర్వినియోగాన్ని అడ్డుకునే మార్గదర్శక సూత్రాలు లేవు అని వాదిస్తే, న్యాయస్థానం ఏకగ్రీవంగా సైనికాధికారుల కేంద్ర కార్యాలయం ఇచ్చే మార్గదర్శక సూత్రాలే సరిపోతాయని, అవే రాజ్యాంగ అధికరణాలు 14, 21లను ఉల్లంఘించకుండా చూస్తాయని ప్రకటించింది. స్వతంత్రంగా ఉండవలసిన న్యాయ వ్యవస్థ అధికారుల దుర్వినియోగాన్ని ఇలా సమర్థిస్తూ పోవడం వల్లనే ప్రజల జీవితాలతోని, స్వేచ్ఛతోని పాలకులు ఇష్టారాజ్యంగా వ్యవహరించడానికి వీలు కలుగుతోంది. పోలీసుల శిక్షాతీత ప్రవృత్తి గురించి ఎన్నో ఉదాహరణలు ఉన్నప్పటికి ఇంత వరకు దాన్ని వదిలించడానికి ఏ చర్యా జరగలేదు. అంతేకాదు పోలీసు వ్యవస్థకు స్వతంత్ర ప్రతిపత్తి కావాలని రాజకీయ భిన్నాభిప్రాయాలతో వ్యవహరించేటప్పుడు వారు చేసిన నేరాలను సాధారణ నేర విచారణలతో సమానంగా చూడగూడదని పోలీసుల కోర్కెలు కొత్త పోలీసు చట్టంలో ఆమోదించబడ్డాయి కూడ.

భావప్రకటన స్వేచ్ఛ, మాట్లాడే స్వేచ్ఛ, సభలు సమావేశాలు పెట్టుకునే స్వేచ్ఛ ఒకదానితో ఒకటి అనుసంధానంతో ఉంటాయి. వీటిలో ఒక దాన్ని నిషేధించడం అంటే మరొకదాన్ని నిషేధించినట్టే. ఏదైనా ఒక ముందస్తు నిర్బంధ చట్టం కింద ఒక నాయకున్ని అరెస్ట్ చేస్తే అతని మాట్లాడే స్వేచ్ఛను కూడా రద్దు చేసినట్టే. అతని ఉపన్యాసం రాజ్యభద్రతకు ఆటంకం అవుతుంది. అతని ఉపన్యాసాన్ని వినే ప్రజాసమూహం రాజ్యభద్రతకు ఆటకం అవుతుంది. అతను ఖైదీగా ఉన్నాడు గనుక అతని సంఘకార్యకలాపాలలో పాల్గొనడానికి వీలుండదు. ఆ సంఘానికి అతని సేవలను వినియోగించుకునే అవకాశం ఉండదు. ఈ స్వేచ్ఛలను మనం వినియోగించుకునేందుకు ప్రభుత్వమే కొంత స్థలం కల్పిస్తుందని, అక్కడ మాత్రమే మన స్వేచ్ఛను వినియోగించుకోవచ్చని పాలకులు చెబుతున్నారు. అంటే ఆధునిక రాజ్యం కొన్ని స్వేచ్ఛా బజారులను తయారు చేసిపెట్టిందన్నమాట. ప్రజల సమస్యలను స్వేచ్ఛగా చర్చించుకునే హక్కును శాసనసభలకు కల్పించడం కొరకు వాటిని ప్రజల నుంచి వేరుచేసి వారికి రక్షణ కల్పిస్తున్నారు. మీరు ఒక ప్రదర్శన నిర్వహించదలచుకుంటే పోలీసులు ఆమోదించిన నిర్దిష్ట మార్గంలోనే నిర్వహించుకోవాలి. ఇప్పుడు కొత్తగా న్యాయస్థానాలు సమ్మెల విధ్వంసకులుగా చివరికి ఎటువంటి ప్రజా నిరసనైనా అడ్డుకునే సంస్థలుగా మారిపోతున్నాయి. ఆరు దశాబ్దాల స్వాతంత్ర్యం తరువాత మనం ఎక్కడి వచ్చి చేరామంటే రాజ్యాంగం రూపొందించిన సంస్థలలో ప్రతి ఒక్కటీ ఈ దేశపౌరుడికి స్వతంత్ర ప్రతిపత్తిని ఇవ్వలేదు. స్నేహపూరిత ఫాసిజం పని చేసే పద్ధతి ఇదే. ఈ దేశం ఒక ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యం అని చెప్పుకుంటున్నప్పటికీ మార్కెట్ శక్తుల విశృంఖల చర్యలకు అది ఆటంకం కాదు. వారికి అవసరమైన శాంతి భద్రతలను, స్థిరత్వాన్ని కల్పించడానికే రాజ్యం ఉంది. ◆

ఎన్ని రక్షణలు, చట్టాలు ఉన్నా మన సమాజంలో దళితుల స్థితిగతుల్లో మార్పు ఏమీ రాలేదనీ, అంటరానితనం, అత్యాచారాలు, అమానుషాలు కొనసాగుతూనే ఉన్నాయని అంటున్నారు **జి. వెంకటశివారెడ్డి**

# అంటరానితనం నిర్మూలన అనివార్యం

**భా**రత సమాజంలోని కులవ్యవస్థలో ఒక విభిన్నకోణం అంటరానితనం. హిందూ కులవ్యవస్థలోని అట్టడుగుస్థాయి కులాలను పైస్థాయి కులాలు హీనంగా చూడటమే కాకుండా, భౌతికంగా వారిని తాకకుండా దూరంగా ఉంచడం, వివక్షత ప్రదర్శించడమే అంటరానితనం. అంతేకాక వారి నివాసం కూడ గ్రామానికి వెలుపల ఉంచడమైనది. నేడు 'దళితులు', షెడ్యూల్డు కులాలు' తదితర పేర్లతో పిలువబడుతున్న 16.2 శాతం జనాభా ప్రజలు మన సమాజంలో అంటరానివారుగా అణచివేతకు, అసమానతకు గురవుతున్న కులాలు.

అంటరానితనం ప్రాచీన కాలం నుండి మన సమాజంలో వేళ్లూనుకొని ఉంది. దీని పుట్టుకను గూర్చి చరిత్రకారులలో ఏకాభిప్రాయం లేకున్నా, ఆర్యులకాలం నుండీ అమలులో ఉన్నదని ఒక భావన. హిందూ మత భావనల ప్రకారం 'ప్యూరిటీ అండ్ పొల్యూషన్' ఆధారంగా అంటే 'పవిత్రత–కలుషితం' పరిగణనతో దళితులను అంటరానివారుగా గుర్తించడమైంది.

చారిత్రకంగా గమనిస్తే దళితులు మన నిచ్చెన మెట్ల సామాజిక వ్యవస్థలో పడిన బాధలు వర్ణనాతీతం. వారిని చాలా చోట్ల గ్రామాలలోనికి రానిచ్చేవారు కాదు. ఒకవేళ వస్తే గంట మోగిస్తూ రావాలి. ఆ విధంగా పైకులాల వారు వారిని తాకకుండా నిరోధం. అస్పృశ్యులు గ్రామంలో ప్రవేశించినప్పుడు తమ మెడకు మట్టిముంతను తగిలించుకొని, వారి ఉమ్మిని అందులోనే వేసుకోవాలి. అంటరానివారి నీడ పైకులాల వారిలోగిళ్లలో పడుతుందని ఉదయం, సాయంత్రం వేళలలో వారికి గ్రామ వీధులలో ప్రవేశం లేదు. దాదాపు అన్ని ప్రాంతాలలో దళితులకు ఎలాంటి ప్రాథమిక సౌకర్యాలు ఉండేవి కావు. తాగునీరు, గృహవసతులు లేవు. తాగునీటికి పైకులాల వారి దయాదాక్షిణ్యాలపై ఆధారపడే వారు. గ్రామ చెరువులు, నీటి బావులలో వారు నీరు వాడుకోకూడదు. ఒకవేళ అతిక్రమిస్తే దాడులకు, దౌర్జన్యాలకు బలవుతారు. అంతేకాక వారు చెప్పులు, గొడుగు, మంచిదుస్తులు వాడకూడదు. అంటరానివారు కావున వారికి పాఠశాలలో ప్రవేశం ఉండేది కాదు. ఈ విధంగా దళితులు అన్ని రకాలుగా అసమానతకు, అస్పృశ్యతకు గురవుతున్నారు.

అయితే ముఖ్య విషయమేమంటే దళితులు గ్రామాలలో అన్ని అవసర సేవలు అందించే వారు. పారిశుద్ధ్యం, పశుకళేబరాలను తొలగించడం, శ్మశాన నిర్వహణ తదితర గ్రామ సేవలతో పాటు వ్యవసాయ కూలీలుగా, కాపలాదార్లుగా వ్యవసాయోత్పత్తికి అవసరమైన సేవలనందిస్తారు. నిచ్చెనమెట్ల కులవ్యవస్థ సమాజంలో వారి సేవలనుపయోగించుకుంటూ వారిని అంటరానివారుగా అణచివేతకు గురిచేయడం అమానుషం.

దళితుల అస్పృశ్యత విముక్తి కోసం, వారి అభ్యున్నతి కోసం స్వాతంత్ర్యం రాక పూర్వమే ఎన్నో ఉద్యమాలు నిర్వహించారు. జ్యోతి భా పూలే, శ్రీ నారాయణగురు, రవిదాసు, డా. బి.ఆర్. అంబేద్కర్, మహాత్మాగాంధీ తదితరులు కుల వ్యవస్థ అసమానతల తొలగింపు కోసం, అంటరానితనం నిర్మూలనకోసం సమాజంలో దళితులలో చైతన్యం తేవడానికి కృషి చేశారు.

స్వాతంత్ర్యం తర్వాత దళితుల సంక్షేమానికి మన రాజ్యాంగం ఎన్నో సౌకర్యాలు, రక్షణలు, రిజర్వేషన్లు కల్పించింది. భారత రాజ్యాంగం లోని 17వ అధికరణ ద్వారా అంటరానితనంను, దాని ఆచరణను అన్ని రంగాలలో నిర్మూలించడం జరిగింది. అందుకు అనుగుణంగా భారత ప్రభుత్వం 1955లో 'అస్పృశ్యతా నివారణ' చట్టం అమలులోకి తెచ్చింది. ఈ చట్టాన్ని ఇంకనూ సమగ్రంగా 1976 పౌరహక్కుల రక్షణ చట్టంగా అమలు పరచడమైనది. అంటరానితనం నిర్మూలన ధ్యేయంగా ఈ చట్టం దళితులకు ఎన్నో రక్షణలు కల్పించింది. దళితులపై అఘాయిత్యాలను, అస్పృశ్యతను నిరోధించడానికి చట్టరీత్యా ఇంకనూ రక్షణలు కల్పిస్తూ ప్రభుత్వం షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ జాతుల (అత్యాచార నిరోధ) చట్టం 1989లో అమలులోకి తెచ్చింది. దళితులకు ఇష్టం లేని పనులను బలవంతంగా చేయించినా, వారి భూములను, ఆవాసాలను హస్తగతం చేసుకొన్నా, వారి హక్కులకు భంగం కలిగించినా, దళిత మహిళలను అవమానపరిచినా లేదా వారిపై అఘాయిత్యం జరిపినా, దళితులను వారి ఇళ్లనుండీ వెళ్లగొట్టినా తదితర ఎన్నో అంశాలలో షెడ్యూల్డ్ కులాలు / జాతులకు రక్షణలు కల్పిస్తూ భారత శిక్షాస్మృతి ప్రకారం పెద్ద శిక్షలును పొందుపరచింది.

అయితే ఎన్ని రక్షణలు, చట్టాలున్నా మన సమాజంలో దళితుల స్థితిగతులలో అనుకున్నంత మార్పు లేదు. అంటరానితనం పూర్తిగా తొలగిపోలేదు. దళితులపై అత్యాచారాలు, అమానుషాలు కొనసాగుతూనే ఉన్నాయి. ఈ మధ్యనే మహారాష్ట్రలోని ఖైర్లాంజీ గ్రామంలో ఒకే కుటుంబానికి చెందిన నలుగురు దళితులను చంపడం జరిగింది. కారణం ఏమంటే ఆ దళిత కుటుంబంలోని పిల్లలు చదువుకొంటున్నారు. వారికున్న పొలంను ఆక్రమించుకోవడానికి జరుగుతున్న వైరంలో ఆ

దళిత కుటుంబం అగ్రకులాల ఆధిపత్యాన్ని శిరసావహించలేదన్న ఉద్దేశ్యంతో దాడి జరిగింది. ఇలాంటి సంఘటనలు దేశవ్యాప్తంగా నేటికీ కోకొల్లలుగా జరుగుతున్నాయి. 1990-2000 దశాబ్దకాలంలో ప్రభుత్వ అధికార గణాంకాల ప్రకారం 2,85,871 కేసులు దేశవ్యాప్తంగా దళితులపై దాడులు, అంటరానితనానికి సంబంధించి నమోదైనాయి. ఈ లెక్కన సంవత్సరానికి సరాసరి 28,587 కేసులు దళితులపై హింస, దౌర్జన్యాలకు సంబంధించి నమోదవుతున్నాయి. వీటిలో 533 హత్యలు, 2990 ఎక్కువ గాయపరచడం, 919 మహిళల అత్యాచారాలు, 184 కిడ్నాపులు, 47 దాడులు, 127 దొంగతనాలు, 456 గృహదహనాలు, 1403 కులవివక్షత, 8179 దౌర్జన్యానికి సంబంధించిన కేసులు. అంటే ప్రతి గంటకు దళితులపై 3 దౌర్జన్యాలు, ప్రతి రోజు ఒక దళిత మహిళపై అఘాయిత్యం, దళితుల హత్య జరుగుతున్నాయి.

దళితులపై జరుగుతున్న దౌర్జన్యాలు, అఘాయిత్యాలకు కారణం వారిని సమాజంలో అంటరానివారుగా, తక్కువ కులం వారుగా పేర్కొనడం వల్లనేనని చెప్పవచ్చును. భారత రాజ్యాంగం కల్పించిన సౌకర్యాలు రిజర్వేషన్ల వలన షెడ్యూల్డ్ కులాలలో కొందరు విద్య, ఆర్థిక రంగాలలో అభివృద్ధి పథంలో నడుస్తున్నారు. గ్రామీణ ప్రాంతాలలో తమ స్థితిగతులు, హక్కులను గుర్తించుకొని చైతన్యవంతులవు తున్నారు. ఈ విధమైన దళితుల చైతన్యమే వారిపై ఇంకనూ దౌర్జన్యాలు కొనసాగడానికి కారణమని కొన్ని అధ్యయనాలు తెలియజేస్తున్నాయి. ఎందుకనగా అంటరాని కులాలకు చెందిన దళితులు అభివృద్ధి చెందటం అగ్రకులాల వారు సహించలేక, వారిని అణగదొక్కేందుకు ప్రయత్నమని కొందరి వాదన.

**ప్రతి గంటకు దళితులపై 3 దౌర్జన్యాలు, ప్రతిరోజు ఒక దళిత మహిళపై అఘాయిత్యం, దళితుల హత్య జరుగుతున్నాయి**

అంటరానితనం నిర్మూలించినప్పుడే సమాజంలో కుల ఘర్షణలు తొలగిపోవడం జరుగుతుంది. అయితే అంటరానితనం నిర్మూలన కోసం సరియైన చట్టాలున్నా అది సమసిపోలేదు. పబ్లిక్ రంగాలలో, పట్టణప్రాంతాలలో అంటరానితనం తగ్గుముఖం పట్టినా, గ్రామీణ ప్రాంతాలలో చాలా రకాలుగా నేటికీ కొనసాగుతోంది. ముఖ్యంగా దళితులు అంటరానివారనే భావనలు గ్రామీణ సమాజంలో ఇంకా తొలగిపోలేదు. అస్పృశ్యతపై జరిపిన అధ్యయనాలలో మన సమాజంలో దీనిని చట్టరీత్యా నిర్మూలించినా, ఆచరణలో ఏదో ఒక రీతిగా ఈ అస్పృశ్యత మన సమాజాన్ని పట్టిపీడిస్తోందని తెలియచేస్తున్నాయి. జాతీయ షెడ్యూల్డ్ కులాలు / జాతుల కమిషనర్ 1990 లో సమర్పించిన నివేదికలో ఏడు రాష్ట్రాలలో జరిగిన అధ్యయనం ప్రకారం దేవాలయాలలో ప్రవేశం, మంచినీటి సౌకర్యం, టీ దుకాణాలు, క్షౌర, రజకుల సేవలు, సామాజిక ఉత్సవ తదితర సందర్భాలలో అంటరానితనం పాటిస్తున్నారని తెలిపారు. ఇటీవల ప్రొఫెసర్ ఘన్‌శ్యామ్ షా, తొరాత్, హర్షమందిర్‌లు పదకొండు రాష్ట్రాలలో 565 గ్రామాలలో అంటరానితనం పరిస్థితిపై సమగ్ర అధ్యయనం చేసారు. అందులో నేటికీ అంటరానితనం ఏదో ఒక రీతిగా ఎనభై శాతం గ్రామాలలో పాటిస్తున్నారని కనుగొన్నారు. ప్రతి పదింటికి ఒక గ్రామంలో దళితులు కొత్త దుస్తులు, కళ్లద్దాలు లేదా చెప్పులు ధరించడం, గొడుగు వాడటం, సైకిలు తొక్కటం మొదలైనవి అనుమతించడం లేదు. ఇప్పటికీ 48 శాతం గ్రామాలలో దళితులకు తాగునీటి సౌకర్యంలో, 35.8 శాతం గ్రామాలలో చిల్లర దుకాణాలలో, 25.6 శాతం గ్రామాలలో టీ దుకాణం లేదా హోటళ్లలోకి ప్రవేశం లేదు. 40 శాతం స్కూళ్లలో మధ్యాహ్న భోజన పథకం అమలులో దళితకులాల పిల్లలను ప్రత్యేకంగా కూర్చోపెడుతున్నారు. ఇంకా 46.6 శాతం గ్రామాలలో దళితులకు క్షౌర సేవలు, 45.8 శాతం గ్రామాలలో రజకుల సేవలు కుల వివక్షత వలన అందుబాటులో లేవు. 63.9 శాతం గ్రామాలలో దేవాలయాల ప్రవేశం లేదు. అంతేకాక ఆసుపత్రులలో, ఎన్నికల సమయంలో పోలింగ్ స్టేషన్లనందు, స్వయం సహాయక సంఘాల సమావేశాలు తదితరాలలో వారు ఇప్పటికీ అంటరానితనం నుంచి పూర్తిగా విముక్తికి నోచుకోలేదు.

ఆర్థిక సంబంధ విషయాలలో కూడా వారు వివక్షతకు గురవుతున్నారు. 35.5 శాతం గ్రామాలలో వ్యవసాయ కూలీల పనులలో వివక్షత, 37.1 శాతం గ్రామాలలో కూలీ డబ్బులు దళితులకివ్వడంలో అంటరానితనం పాటిస్తున్నారు. మార్కెట్ సంబంధాలు కులవివక్షతపై ప్రభావం చూపవనీ, కుల అసమానతల ప్రాతిపదికన ఆర్థిక దోపిడీ కొనసాగుతోందనీ ఈ అధ్యయనంలో వెల్లడైంది.

దళితులు దేశవ్యాప్తంగా నేటికీ జంతు కళేబరాలను తొలగించడం, మరుగుదొడ్లను శుభ్రపరచడం, మురుగు కాల్వల నిర్వహణ తదితర సేవలనందిస్తున్నారు. వారి వలన గ్రామ పరిసరాలు పరిశుభ్రతకు నోచుకుంటున్నాయి. ఇప్పటికీ దేశవ్యాప్తంగా 'ఆరు బయలు' మరుగుదొడ్లు ఉన్నాయి. అవి అన్నీ దళితులు శుభ్రపరుస్తున్నవే. ప్రజల ఆరోగ్యానికి, పర్యావరణ ఆరోగ్యానికి వందలాది ఏళ్లుగా దళితులు సమజీవికి సేవలందిస్తున్నారు. అయితే వారిని 'కలుషితమైన దృష్టితో పరిగణించడం, అంటరానివారుగా చూడటం నేరం.

సమాజంలో ఉత్పత్తి ప్రక్రియలో, ఇతర సేవలలోనూ దళితులను ఉపయోగించుకుంటూ, వారిని హీనంగా చూడటం, హింసించటం చాలా దురదృష్టకరం. అందువల్ల సమాజంలో అన్ని కులాలు దళితుల హక్కులను గుర్తించాలి. దళితుల హక్కులు మానవ హక్కులలో భాగమని గుర్తించి, అస్పృశ్యతను, దళితులపై దౌర్జన్యాలను విడనాడాలి. లౌకిక భావన ప్రాతిపదికగా రూపొందించిన మన రాజ్యాంగ స్ఫూర్తిని గౌరవిస్తూ, అంటరానితనం నిర్మూలనలో ప్రజలందరూ పాలుపంచుకోవాలి. కేవలం ప్రభుత్వమే కాక పౌరసంఘాలు, రాజకీయ పార్టీలు, మేధావులు, విద్యావంతులతో పాటు సామాన్యప్రజలు 'అంటరానితనం' నిజ స్వరూపాన్ని గుర్తించి, దానిని పూర్తిగా నిర్మూలించినప్పుడు మనం కోరుకునే కులఘర్షణలు లేని ఒక మంచి సామాజిక వ్యవస్థను నిర్మించుకోగలం. ◆

**గిరిజనులకు విద్య, వైద్య సౌకర్యాలు, జీవిక అందించలేని పాలకులు అటవీసంపదను, సహజ వనరులను దోచుకోవడానికి పోలీసు క్యాంపులతో గిరిజనుల ఆరాట, పోరాటాలను అణచివేస్తున్నారని అంటున్నారు గుంటి రవి**

# కావాల్సింది స్వయం నిర్ణయాధికారం

**జా**తీయ అటవీ విధానం (1988) ఆధారంగా ఉమ్మడి అటవీ నిర్వహణను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రపంచబ్యాంక్ సహాయంతో 1992లో ప్రవేశపెట్టింది. దీని ముఖ్య ఉద్దేశ్యం అటవీశాఖవారు ప్రజల భాగస్వామ్యంతో కలిసికట్టుగా అటవీ నిర్వహణ చేయడం. క్షీణించిన అడవులను పెంపొందిస్తూ, అడవులను అభివృద్ధి చేస్తూ రక్షణగా ఉండటం. అదే విధంగా తునికాకు సేకరణలో కూలీల ఆదాయాన్ని పెంపొందించడంతోపాటు అడవుల సంరక్షణ కోసం నిర్దేశించిన పథకాన్ని తునికాకు సీజన్‌లో రాష్ట్రంలో ప్రయోగాత్మకంగా 1994లో వరంగల్ జిల్లాలో ప్రారంభించారు.

ఉమ్మడి అటవీ నిర్వహణ ప్రక్రియ సమర్థవంతంగా అమలు కావాలంటే ప్రజల భాగస్వామ్యం, ఇతర ప్రభుత్వ శాఖల సహకారాలు, స్వచ్ఛంద సంస్థల సహాయం కూడా ఉండాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఆంధ్రప్రదేశ్ అటవీశాఖ అడవిని పునరుద్ధరించే నిర్వహణ విధానాలను మూడు భాగాలుగా విభజించారు. 1) ఉమ్మడి అటవీ నిర్వహణ, 2) ఆదాయాన్నిచ్చే అడవుల పెంపకం, 3) ప్రజా అడవులు లేక ప్రైవేట్ అడవుల పెంపకం.

మొదటి రెండు విధానాలు ప్రభుత్వ అడవులు అంటే రిజర్వ్ అడవులలో చేపడతారు. ఉమ్మడి అటవీ నిర్వహణ ముఖ్య ఉద్దేశ్యం అటవీశాఖ, వనసంరక్షణ సమితి కలిసికట్టుగా అటవీ నిర్వహణ చేయడం. ఈ విధానంలో భాగంగా అడవుల దగ్గర ఉన్న ప్రజలకు వంట చెరుకు, పశుగ్రాసం అవసరాలు 'వీలైనంత' వరకు తీరుస్తారు.

ఆదివాసీల పోడు వ్యవసాయం మూలంగా అడవులు నశించి భూమికోత, నదులలో ఇసుకమేటలు, వరదలు, వర్షంపై తీవ్ర ప్రభావం సంభవించి వాతావరణ సమతుల్యం దెబ్బతింటోందని, తరిగిపోయిన అడవులలో తిరిగి అడవులను పెంచుతూ అడువుల సంరక్షణ చేపడుతున్నట్టూ ప్రభుత్వం ప్రకటించింది. అడవిని కొల్లగొడ్తున్న టాటా, బిర్లా, థాపర్, ధాల్మియా, జిందాల్‌లు ఉండవచ్చు, మైదాన ప్రాంతాల నుంచి వచ్చే భూస్వాములు, వారి అంగరక్షకులైన ఫారెస్ట్, పోలీసు అధికారులుండవచ్చు. అదే విధంగా పరిశ్రమలకు అవసరమయ్యే ముడిసరుకుకై ఆదివాసి ప్రాంతాలలోని కొండలను గనుల కోసం తవ్వుతుండడం వలన ఆదివాసులకు జీవనాధారంగా ఉండే మామిడి, పనస, చింతచెట్టు, తునిక, వివిధ పండ్ల చెట్లను నరికి వేయవచ్చు ఇవేమి ఈ ప్రభుత్వానికి ఏమాత్రం కానరావు. అడవి తల్లి ఒడిలో స్వేచ్ఛగా జీవించే ఆదివాసులు క్రూరమైన అటవీ చట్టాల వల్ల సాగుభూమిని బంజరుభూమిగా మారుస్తున్నారు. నేలతల్లి బిడ్డలైన ఆదివాసులు వేల సంవత్సరాలుగా అడవిని, భూమిని నమ్ముకొని బతుకుతున్నారు. ప్రభుత్వం ఉమ్మడి అటవీ నిర్వహణ పేరుతో అడవినుండి, భూమి నుండి తరిమివేసి సాగుభూములను బీళ్లుగా చేస్తోంది. ఈ విధంగా నెట్టివేస్తున్నందున వారి సామూహిక బంధాలు, అడవిపై ఆధారపడి బతికే జీవనరీతులు విచ్ఛిన్నమవుతున్నాయి.

వ్యవసాయ భూములన్నీ గిరిజనేతరులు ఆక్రమించుకుంటే కొండలలో, కొండల వాలులో ఉన్న సాగుకు అనువుకాని భూములన్ని ఫారెస్ట్ వాళ్లు ఆక్రమిస్తే ఆదివాసులు పోడుకొట్టుకునే కనీస ఆధారం లేకుండా చేస్తోందీ ప్రభుత్వం. ప్రపంచబ్యాంక్‌తో వేసే ప్లాంటేషన్‌లలో యూకలిప్టస్, నీలగిరి, జామాయిల్, వెదురు మొక్కలను నాటుతున్నారు. యూకలిప్టస్ చెట్ల వలన వాగులు ఎండిపోతున్నాయని శాస్త్రీయంగా శాస్త్రవేత్తలు వివరిస్తున్నప్పటికీ ప్రపంచబ్యాంక్ ప్రయోజనాన్ని కాపాడుతూ ఆదివాసీ ప్రాంతాలను మార్కెటీకరించడమే తమ ధ్యేయంగా పెట్టుకుందీ ప్రభుత్వం.

ఉమ్మడి అటవీ నిర్వహణ విధానంలో ప్లాంటేషన్ వేయడానికీ, తుప్పలు పొదలు నరకడానికీ, నేలను చదును చేయడానికీ ఇచ్చే కూలి కనీస వేతన చట్టం సూచించిన దానిలో సగం కూడా ఇవ్వడంలేదు. ప్లాంటేషన్ పెరిగి పెద్దదయిన తర్వాత అందులో భాగస్వాములు మీరనీ – ఆదాయంలో కొంత ప్రతిఫలం మీదనీ చెబుతున్నా దశాబ్దాల తర్వాత వచ్చే ఆదాయం కోసం చూస్తే నేడు ఆకలితో చస్తామంటూ ఉమ్మడి అటవీ నిర్వహణలో భాగస్వామ్యం కావడానికి ముందుకు రావడం లేదు. వనరులు ఉపయోగించకుండా వనరులు బయటికి తీయకుండా ఈ గిరిజన జాతిని బాగుపర్చడమెట్లానని అమాయకంగా అడుగుతుందీ ప్రభుత్వం. కాని ఆదివాసులకు, ఏజెన్సీ వనరులకు మధ్య పెట్టుబడి ఉంది. ఇక్కడి పెట్టుబడి ప్రయోజనం మాత్రమే నెరవేరుతోంది. అంటే అది ప్రపంచ బ్యాంక్, బహుళజాతి సంస్థల ప్రయోజనం మాత్రమే. కాని ఇక్కడి ఆదివాసుల జీవితాలు – ఆరోగ్యాలు ఎవరికి కావాలి?

ఆదివాసి ప్రాంతాల్లోని భూములను గిరిజనేతరులకు లీజుకు ఇవ్వకూడదని, ప్రభుత్వాన్ని కూడా గిరిజనేతరునిగానే భావించాలని

హైకోర్టు, సుప్రీంకోర్టులు తీర్పులిచ్చినా అడవిని, అటవీ సంపదను పరిరక్షించాలని, ఆదివాసులను నిర్వాసితులన్ని చేయరాదని చట్టాలు చెబుతున్నా ఆదివాసులకు ఆ కాస్త ఆధారంగా ఉన్న వన్ ఆఫ్ 70 చట్టాన్ని రద్దుచేయాలని ప్రభుత్వం చూస్తోంది. ఏ అభివృద్ధి కార్యక్రమాలైనా ఆదివాసుల అవసరాన్ని గుర్తించే విధంగా ఉండాలి కాని అభివృద్ధి అంటే ఆదివాసుల్ని నిర్వాసితులన్ని చేసే విధంగా ఉండరాదు. కాంట్రాక్టర్లకు, పారిశ్రామిక వేత్తలకు అడవులను గుత్తకిచ్చి స్మగ్లర్లకు అండగా ఉండబట్టే ఇవ్వాళ అడవి నాశనమవుతోంది. తప్పనిసరి పరిస్థితిలో గిరిజనులు జీవనాధారం కోసం సంప్రదాయ పోడు వ్యవసాయానికి నెట్టబడి, పెట్టుబడి పెట్టలేక చాలినంత ఫలితం అందక చస్తున్నారు. ఆదివాసుల భూమిని ప్రపంచబ్యాంక్ శాసిస్తున్న నేపథ్యంలో శ్రమచేసినా ఫలితం దక్కని కఠోర స్థితిలో రాటుతేలిన బతుకులు ఆదివాసులవి. అడవిలో ఆదివాసులకు పోడువ్యవసాయం తెల్సు - పోడువ్యవసాయం కూడా తెలియని అడవిమీద, అడవి సంపద మీద మౌలికంగా భూమిమీద హక్కు ఆదివాసుల దేనని ఇవ్వాళ ఆదివాసులు తుడుం మోగిస్తున్నారు. ఈ ఉద్యమాలనుచూసి వారి సంఘటిత శక్తిని నీరుకార్చాలని ప్రయత్నిండంలో భాగంగా ఆదివాసులకు విద్యా-వైద్య సౌకర్యాలు, జీవిక అందించలేని పాలకులు, అటవీ సంపదను, సహజ వనరులను దోచుకోవడానికి పోలీస్ క్యాంపులతో వారి ఆరాట, పోరాటాలను అణచివేస్తున్నారు.

> ***అడవిమీద, అడవి సంపద మీద మౌలికంగా భూమిమీద హక్కు ఆదివాసుల దేనని ఇవ్వాళ గిరిజనులు తుడుం మోగిస్తున్నారు.***

## వనసంరక్షణ సమితి

తునికాకు సేకరణ ప్రైవేట్ కాంట్రాక్టర్లతో నిర్వహించడం వల్ల నక్సలైట్ పార్టీలు విరాళాలు సేకరించుకుంటున్నాయని భావించి 1987 నుండి ప్రభుత్వం స్వయంగా తునికాకు సేకరణ బాధ్యతను అటవీశాఖ ద్వారా చేపట్టింది. అయినప్పటికీ కాంట్రాక్టర్ల పాత్ర పరోక్షంగా కొనసాగుతున్నందున తునికాకు ధరపై నక్సలైట్లు ఏటా పోరాటం నిర్వహిస్తున్నారు. ఆకు సేకరణ ద్వారా కోట్లాది రూపాయల ఆదాయాన్ని పొందుతూ కూలీల కడుపుకొడుతోందని నక్సలైట్లు చేసే ప్రచారానికి విరుగుడుగా ప్రభుత్వం వనసంరక్షణ సమితి పథకాన్ని ప్రవేశ పెట్టింది. రెవెన్యూ గ్రామాల ప్రాతిపదికన ఏర్పాటు చేసిన వనసంరక్షణ సమితులలో తునికాకు కూలీలందరూ సభ్యులే. ప్రతి వనసంరక్షణ సమితిలో పది నుండి పదిహేను మంది కార్యనిర్వాహక సభ్యులను నియమించి అందులో ఒకరిని అధ్యక్షునిగా ఏకగ్రీవంగా ఎన్నుకొంటారు. ఫారెస్టర్ ఎక్స్ అఫిసియో మెంబర్ కమ్ సెక్రటరీగా కొనసాగుతారు. సంబంధిత ఫారెస్ట్ రేంజర్ రిటర్నింగ్ అధికారిగా వ్యవహరిస్తారు.

వనసంరక్షణ సమితిలో కొన్ని నిబంధనలు : ప్రజలను స్వయంగా ఒప్పించి కదిలించి ఆకు తెంపించాలి. చిన్న ఆకులు పెట్టరాదు. కట్టలో వందాకులు కచ్చితంగా ఉండాలి. మచ్చలు - పుండ్లు లేని ఆకులను సేకరించాలి. పాత ధరలకే ఆకు సేకరించేలా ప్రోత్సహించాలి. పశువులు మేయకుండా ఆకును పాడుచేయకుండా చూడాలి. తునికాకు కట్టలను దొంగలించకుండా పరిరక్షించాలి. అగ్నిప్రమాదం జరగకుండా, విప్లవ పార్టీలు (పెరుగుదల రేటుపై పోరాటం చేస్తున్నందున) కల్లాలను దగ్ధం చేయకుండా కాపలాదారులుగా పూర్తి బాధ్యత వహించాలి. వివిధ గిరిజన సంఘాలు చేసే పెరుగుదల రేట్లకు వ్యతిరేకంగా ఆదివాసులను సిద్ధం చేయాలి. అంతేకాకుండా తునికాకు సేకరణలో తొలిఘట్టమైన ప్రూనింగ్ నుంచి తుదిఘట్టం బస్తాలు నింపి కాంటా వేసేవరకు బాధ్యత మొత్తం వనసంరక్షణ సమితులదే.

గతంలో ప్రైవేట్ కాంట్రాక్టర్లు ముప్పై నుండి నలభై ఐదు రోజులు ప్రూనింగ్ చేయించేవారు. కాని ఇప్పుడు వనసంరక్షణ సమితులను యూనిట్స్‌గా విడగొట్టి ప్రతియూనిట్ ఎన్ని నిర్దేశిత బ్యాగులు సేకరించాలో నిర్ణయించి, అంతకన్నా ఎక్కువయితే ఆకుసేకరణ జరిగినా కొనుగోలు చేయరాదని నిబంధన విధించి ఫారెస్ట్‌రేంజర్ పర్యవేక్షణ చేయాలని, ఇది కూడా కేవలం వారం రోజులలో జరగాలని నిర్ణయించారు. గతంలో ఆకు సేకరణ ముప్పై నుండి నలభై ఐదు రోజుల వరకు ప్రూనింగ్ జరగడమే కాకుండా, ప్రైవేట్ కాంట్రాక్టర్స్ నిర్ణయించుకున్న టార్గెట్స్ వరకే కాకుండా అదనంగా ఆదాయం వచ్చేది. ప్రస్తుతం వారంరోజుల లోపే పూర్తి చేయాలని నిబంధన ఉండటం వల్ల వారు సంపాదించుకునే అవకాశం లేకుండాపోయింది. సంవత్సరానికి ఒక్కసారి వచ్చే ఆ కాస్త ఆదాయానికి కూడా గండిపడింది. అతివృష్టి - అనావృష్టితో సతమత మవుతున్న ఆదివాసులకు వనసంరక్షణ సమితుల వలన వాళ్ల బతుకుల్లో నిప్పులు పోసినట్లయింది. ఈ వనసంరక్షణ సమితులు అనేక నిబంధనలుండటం వల్ల సీజన్ వెళ్లిపోతే కనీసం ఆ వారంరోజుల కూలీ కూడ దొరకదనే భావంతో ఆదివాసులున్నారు. ఇదే వారి ఐక్యతను గండికొట్టి, సంఘటిత శక్తిని నీరుగారుస్తుందని అటవీ అధికారులతో పాటు పోలీసులు కూడ ప్రయత్నిస్తున్నారు.

వనసంరక్షణ సమితులలో చాలా రకాలైన షరతులుండడం వల్ల, ఈ ప్రభుత్వ విధానాలను తెల్సుకొని ఆదివాసులు వీటికి వ్యతిరేకంగా పోరాడుతూనే అదే సంవత్సరం తునికాకు సీజన్‌లో వంద ఆకుల కట్టకు రూపాయి రేటు పెరిగేవరకు ఆకు తెంపే కార్యక్రమాన్ని సంఘటితంగా మానుకున్నారు. అయినప్పటికీ అటవీ అధికారులు, పోలీసులు వనసంరక్షణ సమితుల వల్ల జరిగే లాభాలను, ఆదివాసులకు ఒరిగే ఫలితాలను వివరించే ప్రయత్నం చేశారు. కాని వారు కల్పించే భ్రమలను నమ్మని గిరిజనులు వి.ఎస్.ఎస్. ద్వారా పనిచేయమని లిఖితపూర్వకంగా రాసిచ్చారు. ఇటు ఆదివాసులే కాకుండా ఫారెస్ట్ అధికారులు కూడా వి.ఎస్.ఎస్. రద్దు అయ్యేవరకు విధులకు హాజరుకాలేమని అన్నారనే వార్తలొచ్చాయి. ఈ విధంగా వి.ఎస్.ఎస్.ల ద్వారా ఆదివాసుల శ్రమదోపిడీని తీవ్రతరం చేయాలనుకున్న ప్రభుత్వ ఎత్తుగడలను చిత్తు చేస్తూ కట్టకు 90 పైసల వరకు రేటును పెంచుకున్నారు. ఆదివాసుల

చైతన్యానికి తలవొగ్గి రేటుపెంచకుండా ఉండలేకపోయిందీ ప్రభుత్వం. తునికాకు సేకరణ సీజన్‌లో ప్రయోగాత్మకంగా వరంగల్‌లో ప్రవేశపెట్టిన వి.ఎస్.ఎస్.కు ఆదిలోనే ఆదివాసుల నుండి చుక్కెదురయింది. రాష్ట్రంలో మిగతా జిల్లాలకు ఆదర్శం కాగలదని భావించిన పథకం ఆరంభంలోనే తీవ్ర ఆటంకాలెదొర్కొంది.

ఆదివాసులు గత అనుభవాన్ని దృష్టిలో పెట్టుకొని 1995లో తునికాకు సేకరణ సీజన్‌లో వివిధ ప్రజా సంఘాల ఐకమత్యంతో 'గోదావరి ఏజెన్సీ తునికాకు కూలీల పోరాట కమిటీ' ని ఏర్పర్చుకొని వంద ఆకుల కట్టకు రు.1.25 ఇవ్వాలని డిమాండ్ చేస్తూ ఆకుసేకరణ చేయలేదు. డిమాండ్ సాధించుకోవడానికి 'ఛలో కలెక్టరేట్' కార్యక్రమంలో భాగంగా ఆదివాసులు కొండలు-కోనలు, వాగులు-వంకలు దాటి తమ న్యాయమైన హక్కుల సాధనకై కలెక్టర్‌కు తమ బాధలను చెబుదామని కదిలివస్తే కదలబారిన అడవిని చూసి దీనివెనుక తీవ్రవాదుల హస్తముందనే సాకుతో వారిని నాగరిక - పట్టణ పొలిమేరలకే అడుగుపెట్టనివ్వని అతిపెద్ద ప్రజాస్వామ్య భారతమిది.

వి.ఎస్.ఎస్.లు ఆదివాసుల ఆదాయాన్ని పెంచుతాయని, ఆకు సేకరణలో వచ్చే లాభాలను పంచి ఇవ్వడం వల్ల ఆదివాసులు కూడా ప్రభుత్వం భాగస్వామి అవుతున్నారనే భ్రమలు కల్పించి వి.ఎస్.ఎస్.లు ఆకు సేకరణకే కాకుండా అటవీ నిర్వహణలో భాగస్వాములను చేస్తామంది. 1995కి వచ్చేసరికి సంఘటితమైన ఆదివాసులను చూసి తునికాకు సీజన్ తర్వాత అదే సంవత్సరంలో వి.ఎస్.ఎస్.ను 'తునికాకు సేకరణసమితి' (టి.ఎ.ఎస్.ఎస్.)గా మార్చి తన దోపిడీ స్వభావాన్ని బయటపెట్టుకొంది. టి.ఎ.ఎస్.ఎస్. ద్వారా కాంట్రాక్టర్లకు అదనపు లాభం చేకూర్చడం కోసం, ఆదివాసుల పొట్టలు కొట్టి కాంట్రాక్టర్లను మరింత వేగంగా కోటీశ్వర్లను చేయడమే ప్రభుత్వ విధానంగా మారింది.

ఉమ్మడి అటవీ యాజమాన్య నిర్వహణను సమగ్రంగా సమీక్షించకుండానే రాష్ట్రంలో 'సాముదాయక అటవీ యజమాన్య పథకాన్ని' (సి.ఎఫ్.ఎం.) ప్రపంచ బ్యాంక్ అమలుచేస్తోంది. ఉమ్మడి అటవీ యజమాన్య పథకం కంటె అన్ని విధాలా మెరుగైనదని, ఈ పథకంలో కిందిస్థాయి కమిటీలలో అటవీశాఖ అధికారులెవ్వరూ ఉండరని, అటవీ వనరులపై యజమాన్యానికి సంబంధించిన నిర్ణయాలు తీసుకునే అధికారం పూర్తిగా సి.ఎఫ్.ఎం.లదేనని ప్రభుత్వం చెబుతోంది. ఈ సాముదాయక అటవీ యజమాన్య పథకాన్ని జాతీయ అటవీ కార్యాచరణ పథకంలో భాగంగా 1999లో ప్రభుత్వం రూపొందించింది. స్థిరమైన అటవీ యాజమాన్యాల్ని సాధించడానికి ఇందులో ప్రైవేట్ యజమాన్యాలను భాగస్వామ్యం చేయాలని, అడవుల్లో ఉన్న సహజ వనరులను ప్రపంచీకరణలో భాగంగా ప్రైవేట్‌పరం చేయాలనీ ఒక పథకం ప్రకారమే కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయాలు తీసుకున్నాయి. ఇందులో భాగమే సాముదాయక అటవీ యాజమాన్య పథకం. ఈ పథకాన్ని కేంద్రపర్యావరణ శాఖ, అటవీశాఖలు రూపకల్పన చేశాయి. దీనికి అనుగుణంగానే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రపంచబ్యాంక్ సహాయాన్ని అర్థించింది. పర్యావరణ పరిరక్షణ, స్థిరమైన అభివృద్ధి, దారిద్ర్య నిర్మూలన పేరుతో ఆదివాసులు సాగు చేసుకుంటున్న అటవీ భూముల నుండి గెంటివేయడానికి పకడ్బందీ ప్రణాళికను రూపొందించింది.

సాముదాయక అటవీ యాజమాన్య పథకం కింద ఆదివాసులను అభివృద్ధి చేయడానికి 'ఆదివాసుల అభివృద్ధి వ్యూహం - కార్యాచరణ ప్రణాళిక' లో వివరిస్తూ ఈ పథకం ద్వారా ఆదివాసులు తమ మనుగడకు అడవులపై ఆధారపడడాన్ని తగ్గించడం, వారి సామాజిక, ఆర్థిక అభివృద్ధిని క్రమంగా పెంచడం ద్వారా ఆదివాసులు - గిరిజనేతరుల మధ్య అభివృద్ధి స్థాయిలో గల వ్యత్యాసాలు తగ్గుతాయని ఇదే ఆదివాసుల అభివృద్ధికి తాత్విక భూమికగా పేర్కొన్నారు. ఇంకా 'సాముదాయక భాగస్వామ్యంతో మెరుగైన' అటవీ యజమాన్యం ద్వారా గ్రామీణ దారిద్ర్యాన్ని తగ్గించడం ఈ పథకం లక్ష్యంగా పేర్కొన్నారు.

సాముదాయక అటవీ యజమాన్య పథకంలో అడవులకు పెట్టుబడి పెట్టే బాధ్యతను కూడా వనసంరక్షణ సమితులపైననే వేయడం జరిగింది. ఈ పథకాన్ని కొనసాగించడానికి ఆర్థిక సామర్థ్యాన్ని, వచ్చిన నిధులతో అటవీ ప్రాంతంలో తిరిగి పెట్టుబడి వనసంరక్షణ సమితులే పెట్టాలి అని స్పష్టంగా పేర్కొన్నారు. అంటే అటవీ యజమాన్య బాధ్యతలు, అడవులను సంరక్షించే బాధ్యతలు, పెట్టుబడి పెట్టి అడవులను పెంచే బాధ్యతల నుండి ప్రభుత్వం తప్పుకొని వనసంరక్షణ సమితులపైననే నెడుతోంది. ఆ తర్వాత వనసంరక్షణ సమితులను పారిశ్రామికవేత్తలకు, బహుళజాతి సంస్థలకు ధారాదత్తం చేయడానికి రంగాన్ని ప్రభుత్వం సిద్ధం చేస్తోంది. ప్రస్తుత పథకం పూర్తయిన తర్వాత అడవిపై పెట్టుబడికి అవసరమైన నిధులు - అడవి నుండి వచ్చే ఆదాయం ద్వారా ఎలాగూ రాదు అప్పుడు అనివార్యంగా పెట్టుబడి ప్రభుత్వం పెట్టదు గనుక ప్రైవేట్ పెట్టుబడుదారులపై ఆధారపడవల్సి వస్తోంది. ఆ విధంగా అడవులను ప్రైవేటీకరించి బహుళజాతిసంస్థలకు, కార్పొరేట్ రంగానికి టోకుగా సమర్పించడమే ప్రభుత్వ లక్ష్యం.

ఆదివాసులు పోడుకొడితే కేసుపెట్టే ప్రభుత్వం పర్యావరణ చట్టాలను, అటవీచట్టాలను అనునిత్యం పారిశ్రామికవేత్తలు, ప్రభుత్వాలు అతిక్రమిస్తున్నా ఏమీ మాట్లాడదు. ఆధునికతపేరిట, అభివృద్ధిపేరిట ప్రభుత్వదన్నుతో షెడ్యూల్డ్ ఏరియాలో జరుగుతున్న విధ్వంసం ఫలితంగా వచ్చిన దుష్పరిణామాలనీ, లాభాపేక్షతో జరుగుతున్న మార్కెట్ల విస్తరణ స్వభావాన్నీ కప్పిపుచ్చడానికి ఆదివాసులే అడవి విధ్వంసకారులన్న అవాస్తవిక వాదనను ప్రజాస్వామిక ప్రగతి కాముకులు బట్టబయలు చేయాలి.

ఆంధ్రాపేపర్ మిల్లు, రేయాన్స్ ఫ్యాక్టరీ, భద్రాచలం పేపర్ మిల్లులు వెదురుగడలను తక్కువ ధరకు కొనుగోలు చేస్తున్నారు. అదే విధంగా గోదావరి ప్లైయివుడ్ ఫ్యాక్టరీకి సంవత్సరానికి 30 వేల క్యూబిక్ మీటర్ల చొప్పున ఇరవై సంవత్సరాలపాటు సప్లయి చేయడానికి ఫారెస్ట్‌శాఖ అంగీకరించింది. ఇంకా ఏజెన్సీ ప్రాంతంలో వందలాది గ్రానైట్ క్వారీలకు, ఇనుప గనులకు, బాక్సైట్ గనులకు ఏజెన్సీ నియమ నిబంధనలకు వ్యతిరేకంగా ప్రభుత్వం అనుమతించింది. గనులను తవ్వడం వలన ఏర్పడే వాతావరణ కాలుష్యంతో అడవిని నింపివేస్తున్నారు. పేపర్‌మిల్లులు, పల్పు ఇండస్ట్రీల నుండి వచ్చే విషపూరిత రసాయనాలు గోదావరి నదిలో కల్సిపోయి అటు పంటలకు ఇటు మనుషులకు

ప్రమాదకరంగా మారాయి. నిజానికి ఆదివాసులకు కాగితంతో పనేలేదు. వెదురుబొంగులే కాదు ఇక్కడి ఆదివాసుల ఎముకలు నుజ్జునుజ్జయి కమ్మటివాసన వేసే కాగితంగా రూపాంతరం చెందితే ఆ కాగితంవేసే విశ్వరూపంలో ఆదివాసులు ఎంత పరాయివారై పోయారో, ఎక్కడ గల్లంతైపోయారో చూసి తీరాల్సిందే.

ఏజెన్సీ ప్రాంతం నుండి ఉత్పత్తి అవుతున్న అటవీ సంపద, వనరుల ద్వారా ప్రభుత్వానికి కొన్ని వందల కోట్లు ఆదాయమొస్తోంది. అదే సందర్భంలో కాంట్రాక్టర్లు, బడా పెట్టుబడిదార్లు, బహుళజాతి సంస్థలు, దళారీ రాజకీయశక్తులు కొన్ని వేల కోట్ల రూపాయలను కొల్లగొడుతున్నారు. ఏజెన్సీ నుండి వస్తున్న ఆదాయాలనుండి ప్రభుత్వం ఏజెన్సీ అభివృద్ధి గురించి పదిశాతం కూడా ఖర్చు పెట్టక రోడ్ల కోసం, పోలీస్‌బలగాలకు, అధికార పర్యటనకు, సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ (ఐ.టి.డి.ఎ.) నిర్వహణకు ఖర్చుపెడుతూ ఐ.టి.డి.ఎ. ఏజెన్సీని గొప్పగా అభివృద్ధి చేస్తోందనే భ్రమలుకల్పిస్తూ, మాటలగారడీలతో కాలం గడుపుతోంది ఈ ప్రభుత్వం. వేలాది ఆదివాసులకు ఒక్క డాక్టర్ కూడా లేని ఏజెన్సీలో వేలాదిపోలీసులతో కవాతులు చేయిస్తోంది. అందువల్లే ప్రభుత్వంపట్ల విశ్వాసం కోల్పోయిన గిరిజనులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆర్గనైజ్ అవుతుంటే వారు ఉద్యమించకుండా ఉండటానికి శతవిధాల ప్రయత్నాలు చేస్తోంది ఈ ప్రభుత్వం. సంస్కరణలు, నిర్బంధం అనేవి రెండువైపూ పదునున్న కత్తిలాంటివి, నాణానికి బొమ్మాబొరుసు లాంటివి. ఆదివాసులకు ఉద్యోగాలు ఇస్తామని పెద్దఎత్తున ప్రచారం చేసుకున్న ప్రభుత్వం చివరికి పోలీస్ కానిస్టేబుల్ ఉద్యోగాలు ఇవ్వడమే కాకుండా ఏకంగా గిరిజన బెటాలియన్‌నే స్థాపించి తమ న్యాయమైన మౌలిక సమస్యల పరిష్కారం కోసం తెగించి పోరాడుతున్న ఆదివాసులను ఒకవైపు పాశవికంగా అణచివేస్తూనే మరోవైపు ఈ సంస్కరణలను తీసుకవస్తున్నారు. ఈ సంస్కరణలు కూడా ప్రభుత్వాలు వాటంతటవే తీసుక రాలేదు. ఆదివాసులు ప్రాణాలొడ్డి చేసిన పోరాటాల ఫలితమే ఈ సంస్కరణలు.

ఆదివాసులు అడవిలోని చింతపండు, నార, తేనె, తబ్బిబంక, తిర్మనుబంక, కుంకుడుకాయలు, ఇప్పపువ్వు సేకరించి తూకంనకు అమ్మినట్లుగానే తునికాకును కూడా తూకంనకు ఆదివాసుల నుండి కొనాలి. ఎక్కువరేటు ఎవరు ఇస్తే వారికే తమకు ఇష్టమున్న చోట అమ్ముకునే హక్కు కల్పించాలి. ప్రభుత్వం ఏ రేటుకు కాంట్రాక్టర్లకు తూనికాకు అమ్ముతున్నదో అదే రేటుకు ఆదివాసులు అమ్ముకునే విధంగా ధరల సూచికను అనుసరించి తూకంరేటు కూడా ప్రతి సంవత్సరం పెంచుతూ ఉండాలి.

అడవిలోని సంపదను కొల్లగొట్టడం కోసం, అడవి నుండి ఆదివాసులని వేరుచేయడం కోసం ఆదివాసులకి లబ్ధిని పొందుపర్చడం కోసమే ఉమ్మడి అటవీ నిర్వహణ (జె.ఎఫ్.ఎం.), సాముదాయక అటవీ నిర్వహణ (సి.ఎఫ్.ఎం.) ను వన సంరక్షణ సమితుల ద్వారా చేస్తున్నామని ప్రభుత్వం ఎన్ని కల్లబొల్లి మాటలు చెప్పినా ఇవ్వాళ ఆదివాసులు నమ్మే పరిస్థితిలో లేరు. నిజంగా ఈ ప్రభుత్వాలకు చిత్తశుద్ధి ఉంటే గిరిజనులకి కావాల్సిన కనీస అవసరాలైన ఇల్లు, ఆహారం-ఆరోగ్యం, విద్య, తాగునీరు కల్పిస్తే ఆపై ఏ పథకాలు ప్రవేశపెట్టినా విశ్వసిస్తారు. అంతేగాని అక్కడున్న వనరులను కొల్లగొట్టడం కోసం వస్తున్నారని అర్థమయ్యాక దగ్గరకు ఎలా వస్తారు. ఉమ్మడి, సాముదాయిక అటవీయజమాన్యంలో కేవలం నిర్వహణపాత్రనే కాకుండా శాశ్వత యజమాన్య హక్కులను కల్పించాలి. అట్లాకాకుండా ఏ రకమైన సామాజిక, రాజకీయ, ఆర్థిక హక్కులను ఇవ్వకుండా ప్రాణమున్న మనుషుల్ని ఉత్పత్తి సాధనాలుగా మార్చి తమ శ్రమను అమ్ముకోవడమే గాదు తామే అమ్మకం వస్తువులుగా, మాట్లాడే పరికరాలుగా, బానిసలుగా, యంత్రాలవలె ఉపయోగించుకోవాలను కుంటే ఆదివాసులు తమ మనుగడ కోసం, స్వయం నిర్ణయాధికారం కోసం ప్రత్యామ్నాయ రాజకీయ విశ్వాసాల కోసం ఉద్యమించక తప్పరని ప్రభుత్వం గుర్తించాలి. గుర్తించడమే కాదు ఆ వైపు ఆలోచించి అభివృద్ధి చేస్తేనే ఏజెన్సీ ఏరియాలో ప్రభుత్వ ప్రవేశముండగలదు. ఎందుకంటే అడవులను వెతుక్కుంటూ దోపిడీకి వెళ్లిన చరిత్ర నిన్నటిదయితే, దోపిడీపై ఎక్కుపెట్టిన ఆదివాసీ తుదుం మోత నేటిది.

ఆదివాసీమహిళ భారతీబాయిపై అదిలాబాద్‌లో జరిగిన పాలకపక్షాల కిరాతకం, కరీంనగర్ జిల్లాలోని కాటారం దగ్గర రాజవ్వపై బిఎస్ఎఫ్ జవానుల అత్యాచారం, పశ్చిమ గోదావరి జిల్లాలోని వందువారి గూడెంలో ఆదివాసులపై జరిగిన పోలీసుదాడులు, మునుగోపులలో కారం పార్వతిపై కాల్పులు జరిపి మరణానికి కారణమైన పోలీసులు, విశాఖలోని జి. మాడుగుల మండలంలోని వాకపల్లి గ్రామంలో పదకొండు మంది ఆదివాసీ మహిళలపై గ్రేహౌండ్స్ పోలీసుల అత్యాచారాలు జరిగిపోతుంటే 'నాగరిక' సమాజంపై వారికి నమ్మకమెలా కలుగుతుంది? ◆

**భారత స్వాతంత్ర్య ఉద్యమంలో గిరిజనులు, ఇతర ప్రాంత ప్రజలతో కలిస్తే రానున్న ముప్పు గురించి బ్రిటిష్ వారికి తెలిసినంతగా మరెవ్వరికి తెలియదని అంటున్నారు కిడారి సర్వేశ్వరరావు**

# ఆదివాసి ప్రాంతాలలో పాలన - సంక్షేమం

### గిరిజన ప్రాంతంలో పాలన – చరిత్ర

ఆదిమ తెగలుగా గుర్తింపు పొందిన వారిపై పరిశోధనలు స్వాతంత్ర్యానికి ముందు కాలంలో ఎక్కువగా జరిగాయి. వీరిగురించి వివిధ పరిశోధకులు రకరకాలుగా అభివర్ణించారు. అందువల్ల సామాన్య ప్రజలలో ఆదిమ జాతుల గురించి విచిత్రమైన, పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు నెలకొన్నాయి. ఒక్కోసారి ఈ అభిప్రాయాలు అయోమయంగా ఉంటాయి. ఈ ఆదిమ జీవితాలు అనాగరికంగా, నిరాడంబరంగా, ఆనందకరంగా ఉంటాయనీ, వారి జీవితాలు నృత్య, సంగీతాలతో నిండి ఉంటాయనీ గోటుల్, రోరుంగ్, ధమ్‌కురియా అనే ఆచార వ్యవహారాలు గిరిజన జీవితాలను సుసంపన్నం చేస్తాయనే భావన, భ్రమలు కొందరిలో ఉన్నాయి. అయితే గిరిజనుల జీవితంలోని పేదరికాన్ని, అమాయకత్వాన్ని, అనారోగ్యాన్ని, దోపిడీని అవగాహన చేసకోగలిగేవారు బహుకొద్ది మంది మాత్రమే. కొంతమంది నిజాయితీపరులైన పరిశోధకులు గిరిజన జీవితాలపై ఉన్న భ్రమలను విశ్వసించకుండా, వారి జీవితాలలోని వాస్తవాలను బయట పెట్టడానికి పూనుకోవడం కొంతవరకు హర్షణీయమైన పరిణామం.

భారతదేశంలోని గిరిజన ప్రాంతాలను పరిపాలించడంలో ఉన్న సమస్యలను పరిష్కరించడానికి మొట్టమొదటిసారిగా గట్టి ప్రయత్నం చేసినవారు బ్రిటిష్ పరిపాలకులే. అయితే వీరు స్వార్థబుద్ధితో గిరిజనులపై ఉన్న భ్రమలను కొనసాగించడానికే ప్రయత్నించారు తప్ప, వాస్తవ పరిస్థితులను వెలికితీసుకు రావడానికి ఏ మాత్రం ప్రయత్నం చేయలేదు. ఆదిమ జాతులను, షెడ్యూల్డ్ తెగలను సాధ్యమయినంత మేరకు మిగిలిన భారత ప్రజలకు దూరంగా ఉంచడానికే వారు ప్రయత్నించారు. భారత స్వాతంత్ర్య ఉద్యమంలో గిరిజనులు, ఇతర ప్రాంత ప్రజలతో కలిస్తే రానున్న ముప్పు గురించి బ్రిటిష్ వారికి తెలిసినంతగా మరెవ్వరికి తెలియదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ స్వార్థ ప్రయోజనాల పరిరక్షణకు ఇటువంటి వ్యూహం ఎంచుకున్నారు. గిరిజనులను ఏకాంతంగా ఉంచేందుకు వారు నివసించే ప్రాంతాలను బ్రిటిష్ అధికారులు నిషేధ ప్రాంతాలుగా ప్రకటించారు. ఆ విధంగా తొలిదశలో క్రైస్తవ మత ప్రచారకులు, బ్రిటిష్ అధికారులు మాత్రమే గిరిజన ప్రాంతాలలో ప్రవేశించగలిగారు.

బ్రిటిష్ పరిపాలకులకు మొట్టమొదట సమస్యను సృష్టించినవారు రాజమహల్ కొండల్లోని పహారియాలు లేక మాలేర్లు అనే గిరిజనులు. సమస్యలు సృష్టించే 'తిరుగుబాటు తెగలను' అదుపు చేసే విధానాన్ని మొదట బ్రిటిష్ పరిపాలకులు అనుసరించారు. ఈ తెగల నాయకులకు 'సనద్'లను మంజూరు చేసి ఎటువంటి తిరుగుబాట్లు జరిగినా తెలియజేసే ఏర్పాట్లను బ్రిటిష్‌వారు చేసుకున్నారు. రవాణా, సమాచార వ్యవస్థలకు చేరువలో నివశించే ఈ తెగల నాయకులు బ్రిటిష్ ప్రభుత్వ తపాల సర్వీసులో పనిచేసేవారికి రక్షణ కల్పించాల్సిన బాధ్యత ఉండేదని, అందుకోసం వారికి కొంత మొత్తం సొమ్ము చెల్లించేవారని గుర్యే 1963లో పేర్కొన్నాడు. ఈ చెల్లింపులు కొంతమంది బ్రిటిష్ అధికారులు 'ముస్లింల కాలంలో చెల్లించిన లంచాల మాదిరి మొత్తం' అని పేర్కొన్నారు. కొండ ప్రాంతాల దిగువన వికాలంగులైన సైనికులను, పదవీ విరమణ చేసిన సైనికులను మిలిటరీ లక్షణాలున్న మరికొందరికి ప్రభుత్వ భూములు కేటాయించేది. విచ్చలవిడిగా తిరుగుతూ దోపిడీలు చేసే పహారియాల చుట్టూ బ్రిటిష్ అధికారులు ఈ విధంగా ఒక 'రక్షణ వలయం' ఏర్పాటు చేసేవారు. ఈ విధంగా ఏర్పాటయిన బలగాల్లో కొందరు అధికారులను ఎంపికచేసి బ్రిటిష్ అధికారులు న్యాయస్థానాన్ని ఏర్పాటు చేసారు. ఈ న్యాయస్థానం ఎంతో ఉపయోగకరంగా ఉండడం వల్ల రాజమహల్, కొండప్రాంతాలలో సాధారణ కోర్టుల పరిధినుంచి తొలిగించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఆ విధంగా 1782లో రాజమహల్ గిరిజన ప్రాంతాన్ని సాధారణ కోర్టుల పరిధినుంచి తొలగించారు. గిరిజనులకు సంప్రదాయంగా నాయకులుగా ఉన్న తెగల నాయకుల సమావేశాలు బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఈ నాయకులతో కొన్ని సెషన్స్ కోర్టులను ఏర్పాటు చేసారు. ఈ కోర్టు సంవత్సరానికి రెండుసార్లు సమావేశమయ్యేది. ఈ మండలిని గిరిజన మండలి 'హిల్ అసెంబ్లీ'గా వ్యవహరించేవారు. ఈ గిరిజన మండలికి మరణశిక్ష విధించే హక్కు, రద్దుచేసే హక్కు సైతం ఉండేది.

ఈ గిరిజన మండలిద్వారా అంతర్గత శాంతిభద్రతలను పునరుద్ధరించి క్వీన్‌ల్యాండ్ అనే తెలివైన బ్రిటిష్ అధికారి 'విదేశీయులు' లేక 'బయటివారి' సమస్యను పరిష్కరించడానికి నడుం కట్టాడు. ఈ

బయటి వారిని పహారియాలు తీవ్రంగా వ్యతిరేకించారు. పహారియాల అధీనంలో ఉన్న భూమితో ప్రభుత్వ ఎస్టేట్లను ఏర్పాటు చేశారు. ఈ ఎస్టేట్లు నేరుగా ప్రభుత్వ ఆధీనంలో ఉండేవి. వీటిపై పహారియాలు ఎటువంటి శిస్తూ చెల్లించనవసరం లేదు. ప్రభుత్వం ఈ చర్యలు తీసుకోవడంతో అప్పటివరకు ప్రభుత్వానికి దూరంగా ఉన్న పహారియా తెగల నాయకులు కూడ ప్రభుత్వానికి సన్నిహితమయ్యారు. బ్రిటిష్ వారి నాయకత్వాన్ని అంగీకరించారు. ఈ ప్రాంతాలలో బ్రిటిష్ పాలన అంటే ఈ తెగల పాలనగా ఉండేది. ఆ విధంగా ఈ ప్రాంతాన్ని అంతా ఒక తాటికిందకు, క్రమబద్ధమైన పాలన కిందకు తెచ్చారు. ఈ ప్రాంతాన్ని దమాన్–ఎ–కోహ్ (గుర్యే 1963) అని వ్యవహరించేవారు. ఈ విధంగా బ్రిటిష్‌వారు తమకు సమస్యలు సృష్టిస్తున్న పహారియాలు లేక మాలేర్లను చల్లబరిచి, 1769 నిబంధన 1ని రూపొందించారు. కాలంగడిచిన కొద్దీ ఈ గిరిజన మండలి ప్రభావం క్షీణించడంతో 1769 నిబంధన 1 స్థానంలో 1827 నిబంధన 1ని ప్రవేశపెట్టారు.

ఈ దశలోనే దోపిడీకి గురవుతున్న అనేక ఇతర గిరిజన తెగలు తిరుగుబాటు చేసాయి. ఈ తిరుగుబాటులో 1831లో సింగ్‌భుమ్‌లో జరిగిన హో తిరుగుబాటు, 1846లో ఖోండ్ తిరుగుబాటు, 1855లో జరిగిన సంతాల్ తిరుగుబాటు ప్రత్యేకంగా పేర్కొనదగినవి. బ్రిటిష్ ప్రభుత్వం అస్సాంలో 1850–90 మధ్య అనేక సైనిక దాడులు నిర్వహించి గిరిజన తిరుగుబాట్లను అణచివేయవలసి వచ్చింది. 19వ శతాబ్దంలో మొదటిదశలోను, 20వ శతాబ్దం మొదటి దశలో మలుసాయి, నాగ కొండలలోకి, అబోరి ప్రాంతంలోకి బ్రిటిష్ ప్రభుత్వం అనేక మార్లు సైన్యాలను పంపవలసి వచ్చింది.

ఈ తిరుగుబాట్లు అలజడులు సాధారణంగా ఎప్పుడూ ఒకే కారణంగా ఉండేవి. సాంకేతికంగానూ, సాంస్కృతికంగాను అభివృద్ధి చెందిన గిరిజనేతర ప్రజలు గిరిజనులను దోపిడీ చేయడం వల్ల దానికి నిరసనగా గిరిజనులు ఎప్పటికప్పుడు తిరుగుబాటు చేసేవారు.

ఈ దశలోను గిరిజనుల రక్షణకు ప్రత్యేకమైన ఏర్పాటు చేయాలన్న అభిప్రాయానికి పూర్తి మద్దతు లభించింది. మానవ విజ్ఞాన శాస్త్రవేత్తల సర్వేలు ఈ అభిప్రాయాలకు బలం చేకూర్చాయి. (షెడ్యూల్డ్ ప్రాంతాలు – షెడ్యూల్డ్ తెగల కమిషన్ నివేదిక సంపుటి 1, 1960–61) గిరిజనులకు ప్రత్యేక ప్రాంతాలు కేటాయించి, వాటి ప్రయోజనాలను పరిరక్షించాలని ఎట్టకేలకు బ్రిటిష్ ప్రభుత్వం నిర్ణయించింది. ఈ నిర్ణయం ద్వారా గిరిజనుల ప్రయోజనాలను పరిరక్షించగలమని బ్రిటిష్ ప్రభుత్వం చెప్పుకుంది. ఈ లక్ష్యంతోనే గిరిజన ప్రాంతాలను షెడ్యూల్డ్ జిల్లాలుగా ప్రకటిస్తూ, 1847లో బ్రిటిష్ ప్రభుత్వం ఒక చట్టాన్ని తెచ్చింది. అయితే 1919 చట్టంలో సెక్షన్ 52ఎ ప్రకారం ఈ ప్రాంతాలను పునర్విభజించారు. షెడ్యూల్డ్ జిల్లాలలోను పరిపాలించడానికి అధికారులను నియమించడానికి ఈ చట్టం ద్వారా అవకాశం లభించింది. సివిల్, క్రిమినల్ చట్టాలను అమలు చేయడానికి, గ్రామ వ్యవహారాలను చూడడానికి, ప్రభుత్వం తరఫు శిస్తు వసూలు చేయడానికి అధికారులకు ఈ చట్టం ద్వారా అధికారాలు సంక్రమించాయి. బ్రిటిష్ చట్టాలను ఈ షెడ్యూల్డ్ జిల్లాలకు విస్తరించడానికి, కొన్నిపరిమితులకు లోబడి అమలు చేయడానికి వీరికి అధికారం లభించింది. ఆ రకంగా కార్యనిర్వహణ అధికారం అధికారులకు చట్టాలు చేయడానికి విస్తృతమైన అధికారాలు లభించాయి. ఒక్క ఆదేశం ద్వారా ఈ చట్టాలు అమలు చేయడం సాధ్యమయింది. భారతదేశంలో స్వాతంత్ర్య ఉద్యమ ప్రభావం గిరిజనులపై పడకుండా బ్రిటిష్ అధికారులు చాలాజాగ్రత్త వహించారు. ఆర్థిక, రాజ్యాంగపరంగానూ గిరిజన ప్రాంతాలను నేరుగా కేంద్ర ప్రభుత్వ ఆధీనంలో ఉండాలని సైమన్ కమిషన్ సిఫారసు చేసింది. ఆ తర్వాత 1947 వరకూ అనేక చట్టాలు, ఆంక్షలు విధించారు. అనేక సంస్కరణలు ప్రవేశపెట్టారు. 1935లో కఠినమైన ఏర్పాట్లు జరిగాయి. 'పూర్తిగానూ, పాక్షికంగానూ ఏర్పాటుగా ఉన్న ప్రాంతాలు' గాను ప్రకటించడమైంది. ఈ చట్టం ద్వారా గిరిజన ప్రాంతాలకు మరింత కచ్చితంగా ప్రత్యేకమైన ప్రాధాన్యత కల్పించారు.

## 1947 తర్వాత పరిస్థితి

స్వాతంత్ర్యానాంతరం గిరిజన ప్రజల సంక్షేమం కోసం ప్రత్యేకమైన ఏర్పాట్లు జరిగాయి. గిరిజనుల్లో చైతన్యం ఎక్కువైంది. 1950, జనవరి 26న అమలులోకి వచ్చిన గణతంత్ర రాజ్యాంగంలో గిరిజన సంక్షేమం కోసం అనేక ప్రత్యేక ఏర్పాట్లు జరిగాయి. ప్రధాన జాతీయ స్రవంతిలో గిరిజనులు క్రమంగా భాగంకావాలని రాజ్యాంగ రచయితలు ఆశించారు. తమ ఇతర భారతీయ సోదరులతో గిరిజనులు కలిసిపోవడానికి రాజ్యాంగ నిర్మాతలు పది సంవత్సరాల పాటు గిరిజనులకు ప్రత్యేక రక్షణలు కల్పించారు. అయితే ఈ రక్షణలు ఎప్పటికప్పుడూ పొడిగిస్తూ వస్తున్నారు. ఆ రక్షణలు ఇప్పటికి అమలులోనే ఉన్నాయి.

## పాలన

1951లో గిరిజన సంక్షేమశాఖను ఏర్పాటు చేసారు. షెడ్యూల్డ్ తెగల అభివృద్ధికి రక్షణ కల్పిస్తూ, రాజ్యాంగంలో గిరిజనుల కోసం పొందుపరిచిన రక్షణలను అమలు చేయడం ఈ శాఖ ప్రధానలక్ష్యం. ఇందుకోసం కొత్తరకం పాలనా వ్యవస్థను రూపొందించారు. రాజ్యాంగంలోని 244 అధికరణం ప్రకారం 'షెడ్యూల్డ్ ప్రాంతాలను' అయిదో షెడ్యూల్డ్ ప్రకారం, అస్సాంలోని గిరిజన ప్రాంతాలను ఆరో షెడ్యూల్డ్ ప్రకారం పరిపాలించాల్సి ఉంటుంది.

ఆ విధంగా నిర్వచించబడిన షెడ్యూల్డ్ ప్రాంతాలు ఆయారాష్ట్రాల పరిధిలో, పాలనకింద ఉంటాయి. అయితే గవర్నర్లకు కొన్ని ప్రత్యేకమైన హక్కులు ఇచ్చారు.

ఎ) ఈ షెడ్యూల్డ్ ప్రాంతాల పాలనకు అనుగుణంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ చట్టాలను సవరించవచ్చు.

బి) గిరిజనుల శాంతియుత జీవనానికి, చక్కని ప్రభుత్వానికి అనుకూల మైన నిబంధనలు రూపొందించాలి.

ముఖ్యంగా గిరిజనుల భూములను రక్షించేందుకు, బంజరు భూములను గిరిజనులకు కేటాయించేందుకు, వడ్డీ వ్యాపారుల నుంచి గిరిజనులను రక్షించేందుకు అవసరమైన ఏర్పాట్లను గవర్నరు చేయవచ్చు. ఈ నిబంధనలు ఏర్పాటు చేసేముందు గవర్నరు ఆయా రాష్ట్రాలలో ఉన్న గిరిజన సలహా మండలిని సంప్రదించవలసి ఉంటుంది.

గవర్నర్ రాష్ట్రపతికి వార్షిక నివేదికను సమర్పించవలసి

ఉంటుంది. అలాగే కేంద్ర ప్రభుత్వం కోరినప్పుడు ఆయా నివేదికలను పంపవలసి ఉంటుంది. ఆ విధంగా రాజ్యాంగంలోని గిరిజనుల భూముల రక్షణకు, వడ్డీవ్యాపారుల కబంధ హస్తాలనుంచి రక్షణకు, వారి సాంస్కృతిక జీవనరీతుల రక్షణకు తగిన ఏర్పాట్లు ఉన్నాయి.

షెడ్యూల్డ్ ప్రాంతాల ఏర్పాట్లు రెండు ప్రధాన లక్ష్యాలతో జరిగింది. గిరిజనులు ప్రస్తుతం అనుభవిస్తున్న హక్కులను రక్షించడం మొదటి లక్ష్యం. షెడ్యూల్డ్ ప్రాంతాలను ఆర్థిక, విద్యా, సామాజిక రంగాల్లో అభివృద్ధి చేసి గిరిజనుల అభివృద్ధికి కృషి చేయడం రెండోలక్ష్యం.

## అయిదో షెడ్యూల్ ప్రకారం పరిపాలన

షెడ్యూల్డ్ ప్రాంతాల పరిపాలనలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల బాధ్యతలను విభజించే అయిదో షెడ్యూల్ కనిపిస్తుంది. గిరిజన ప్రాంతాలలో అమలు చేయడానికి అనుగుణంగా లేని చట్టాలను రాష్ట్ర ప్రభుత్వం మదింపుచేసి, షెడ్యూల్డ్ ప్రాంతంలో సక్రమ ప్రభుత్వ ఏర్పాటుకు అనుగుణమైన చట్టాలను రూపొందించాలి.

షెడ్యూల్డ్ ప్రాంతాలలో నివసిస్తున్న గిరిజనుల సంక్షేమానికి సార్వత్రిక అభివృద్ధికి ప్రత్యేక పథకాలు అమలుచేసే బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలదే. కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి ఈ రంగంలో తగిన మార్గదర్శక సూత్రాలను నిర్దేశిస్తుంది. షెడ్యూల్డ్ ప్రాంతంలో పాలనా వ్యవస్థ పటిష్టపరచడానికి, పాలనా సామర్థ్యం పెంచడానికి కేంద్ర ప్రభుత్వం అదనపు నిధులు కేటాయిస్తుంది. ఆయా పథకాల అమలులో ప్రాధాన్యతలు నిర్ణయించే అధికారం కూడ కేంద్ర ప్రభుత్వానికి ఉంది.

షెడ్యూల్డ్ ప్రాంతాలకు అదనపు నిధులు కేటాయించడం, పాలనా వ్యవస్థను మెరుగుపరచడానికి సూచనలు ఇవ్వడంతో కేంద్ర ప్రభుత్వం బాధ్యత తీరిపోలేదు. కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు ఎప్పటికప్పుడు అనేక ఆదేశాలు జారీచేస్తూ ఉంటుంది.

రాజ్యాంగంలోని ఐదో షెడ్యూల్ మూడవ పేరాలో రాజ్యాంగంలోని 399(2) అధికరణం ద్వారానూ కేంద్ర ప్రభుత్వానికి కీలకమైన అధికారాలు సంక్రమించాయి. కేంద్ర ప్రభుత్వం సాధారణంగా ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు నచ్చజెప్పడం ద్వారా షెడ్యూల్డ్ ప్రాంతాలన్నింటిలోనూ ఒకేరకమైన పాలన వ్యవస్థ ఏర్పాటుకు ప్రయత్నిస్తోంది. కేంద్ర ప్రభుత్వం ఆదేశాలు జారీచేయవలసిన పరిస్థితి రాకపోవడం గిరిజన తెగల అదృష్టం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఏజెన్సీలు తమ అధికార పరిధులపేరిట కుస్తీలుపడితే నష్టపోయేది గిరిజనులే. గిరిజనుల కోసం ఉద్దేశించిన ఆయా పథకాల అమలు, కష్టనష్టాలు మదింపు చేయడానికి ప్రణాళికా సంఘం, కేంద్ర ప్రభుత్వ హోంశాఖ అప్పుడప్పుడూ సమావేశాలు ఏర్పాటు చేస్తూనే ఉంటాయి.

## షెడ్యూల్డ్ ప్రాంతాలలో చట్టాలు

షెడ్యూల్డ్ ప్రాంతాలలో అమలు చేసే చట్టాలకు సంబంధించి గవర్నర్లకు ప్రత్యేక అధికారాలు ఇవ్వడం జరిగింది. గిరిజన ప్రాంతాలలో శాంతి, మంచి ప్రభుత్వం ఏర్పాటుకు గవర్నర్లకు అధికారాలు ఇవ్వబడ్డాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు చట్టాలను షెడ్యూల్డ్ ప్రాంతాలలో అమలు చేయనీకుండా నిషేధించడానికి లేదా కొద్ది మార్పులతో అమలు చేయడానికి గవర్నర్లకు అధికారాలు ఇవ్వబడ్డాయి.

## గిరిజన మండలుల పాత్ర – పంచాయతీరాజ్ ఆవిర్భావం

గిరిజన సమాజం ఆవిర్భవించినప్పటి నుండీ గిరిజన మండలులు ఉన్నాయి. సంప్రదాయికంగా వస్తున్న ఆచార వ్యవహారాలు, పద్ధతుల ఆధారంగా మతానికీ, సంఘ కట్టుబాట్లకు సంబంధించిన విషయాలపై గిరిజన మండలి నిర్ణయాలు చేస్తుంది. ప్రజల అంగీకారం మేరకు కొన్ని ప్రాంతాలలో న్యాయపరంగానూ వివాదాలను కూడా గిరిజన మండలులు పరిష్కరిస్తాయి. అంటే ఈ మండలులు ఆర్థిక వ్యవహారాల జోలికి పోవని కాదు. ఈ ఆర్థిక వ్యవహారాలు గిరిజనుల సామాజిక జీవితంలో అంతర్భాగంగా ఉంటాయి. ఈ గిరిజన మండలులు ఎన్నికైనవికావు. కొంతమందికి వంశపారంపర్యంగా మండలిలో స్థానం లభిస్తుంది. మరి కొందరికి వ్యక్తిగత జీవితంలో అనుసరిస్తున్న నియమాల ఆధారంగా ఈ మండలిలో సభ్యత్వం లభిస్తుంది. ఇటువంటి కొన్ని పరిమితులు ఉన్న గిరిజన సమాజంలోని ప్రతివ్యక్తి తన వాదనను గిరిజన మండలిలో వినిపించవచ్చు. అందువల్ల చివరికి ఎక్కువమందికి ఆమోదయోగ్యమైన నిర్ణయాలే అమలు జరిగేవి. ఈ గిరిజన మండలుల నిర్ణయాలు గిరిజన సంప్రదాయాలు, ఆచారాల మీద ఆధారపడి ఉన్నందున గిరిజనులందరికి ఈ నిర్ణయాలు శిరోధార్యం.

దేశమంతటా పంచాయతీరాజ్ వ్యవస్థ అమలు చేయడం వల్ల సాంప్రదాయ గిరిజన మండలులు కొన్ని ప్రాంతాలలో బలహీనపడ్డాయి. అయితే చాలా సందర్భాలలో పంచాయతీరాజ్ సంస్థలు గిరిజన మండలుల బాధ్యత నిర్వహిస్తూ అభివృద్ధి కార్యక్రమాలను కూడ అమలు చేస్తున్నాయి. చట్టబద్ధంగా ఏర్పడినా ఈ పంచాయతీ సంస్థలు ఆర్థిక, సామాజిక పాలనా వ్యవహారాలను నిర్వహిస్తున్నాయి. ప్రభుత్వ ఆస్తుల రక్షణ, సంతల నియంత్రణ, ఉమ్మడి పచ్చిక బయళ్ల నిర్వహణ, పారిశుధ్య బాధ్యతలు పంచాయతీరాజ్ సంస్థలు నిర్వహిస్తున్నాయి. వ్యవసాయం, సాగునీరు గ్రామీణ పరిశ్రమలు, పశుసంవర్ధన, పరిసరాల పరిరక్షణ మొదలైన బాధ్యతలతోపాటు విద్య, క్రీడలు, ప్రసూతి, శిశుసంక్షేమం కూడా పంచాయతీరాజ్ సంస్థల వ్యాప్తి గురించి 1961లో షెడ్యూల్డ్ ప్రాంతాలు – తెగల కమిషన్ వివరించింది. గిరిజన ప్రాంతాల జీవన పునాదులను నాశనం చేయరాదని, గిరిజన మండలులు అదృశ్యం కాకూడదని ఈ కమిషన్ అభిప్రాయపడింది. ఈ మండలులు పునర్వ్యవస్థీకరిస్తూ పటిష్ఠపరచాలనీ, వాటిని ప్రోత్సహించాలని కమిషన్ సూచించింది. గిరిజన మండలులు పట్ల గిరిజనులు సహజంగా ఆకర్షితులవుతారనీ, ఇది వారికి సంప్రదాయబద్ధంగా వచ్చిన అలవాటనీ, అందువల్ల వీటిని ప్రోత్సహించాలనీ కమిషన్ సూచించింది.

## గిరిజన సంక్షేమానికి దోహదపడే అంశాలు

భారత రాజ్యాంగంలో ఎక్కడా గిరిజన తెగను స్పష్టంగా నిర్వచించలేదు. నిజానికి గిరిజన తెగకు స్పష్టమైన నిర్వచనమంటూ లేదు. కొండల్లోనూ, అడవుల్లోనూ చిత్రవిచిత్ర ఆచార వ్యవహారాలు కలిగి ఉన్న వారే గిరిజనులని సామాన్య ప్రజల అభిప్రాయం. ఇంకొంచెం తెలిసిన వారి దృష్టిలో విచిత్రమైన జీవన పద్ధతులు అనుసరించి నృత్యగానాదులతో కాలక్షేపం చేస్తూ, ప్రత్యేక నాటు వైద్య పద్ధతులను పాటించే వారే గిరిజనులు. 'పాలనాయంత్రాంగంలో పనిచేసేవారి

దృష్టిలో, సామాజిక ఆవిర్భావ క్రమంలో ప్రత్యేక లక్షణాలు ప్రదర్శించే వారు గిరిజనులు. ఆయా స్థాయిలలో ప్రజల అభిప్రాయాలు చాలా వరకూ యుదార్థమే'.

'షెడ్యూల్డ్ తెగలు లేక తెగల సమూహాలు, లేక తెగల సమూహాల్లో కొన్ని వర్గాలు' అని మాత్రం రాజ్యాంగం పేర్కొంటున్నది. ఇది ఈ షెడ్యూల్డ్ తెగల జాబితాను 342 అధికరణం ద్వారా రాష్ట్రపతి ప్రకటిస్తారు. రాజ్యాంగం తెగల గురించి ప్రత్యేకంగా ప్రస్తావించకపోవడం వల్ల, కొన్ని తెగలను షెడ్యూల్డ్ తెగలుగా ప్రకటించడం వల్ల కొన్ని అయోమయ పరిస్థితులు ఏర్పడినాయి. అయితే గిరిజన సంక్షేమ కార్యక్రమాలు చేపట్టడానికి ఇది అవాంతరం కానక్కరలేదు.

రాజ్యాంగం అమలులోకి వచ్చిన తరువాత గిరిజనుల సంక్షేమ బాధ్యతలను ప్రజాస్వామికంగా ఎన్నికైన ప్రభుత్వాలు రాష్ట్రపతి, గవర్నర్ల ద్వారా నిర్వహిస్తున్నాయి. రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాల స్ఫూర్తికి అనుగుణంగా షెడ్యూల్డ్ కులాలు, తెగల సంక్షేమానికి ప్రత్యేక అధికరణలు పొందుపరచడం జరిగింది. రాజ్యాంగ అధికరణలు ఈకింది అంశాల ఆధారంగా రెండుగా విభజించారు. 1) రక్షణ, 2) అభివృద్ధి

### రక్షణకు దోహదం చేసే అంశాలు

**అధికరణ 15(4) సామాజిక, ఆర్థిక విద్యా ప్రయోజనాలు :**

రాజ్యాంగంలోని 15వ అధికరణం ప్రకారం మతం, జాతి, కులం, లింగ, జన్మస్థలం ఆధారంగా వివక్ష చూపరాదని నిర్దేశిస్తున్నది. అయితే ఈ అధికరణ నాలుగో క్లాజులో కొన్ని మినహాయింపులు ఇచ్చారు. సామాజికంగానూ, ఆర్థికపరంగానూ, విద్యాపరంగానూ వెనకబడిన తరగతులు లేక షెడ్యూల్డ్ కులాలు, తెగలు ప్రజల అభివృద్ధికి ప్రత్యేక చర్యలు తీసుకోవాలని ఈ క్లాజు నిర్దేశిస్తున్నది. సమాజంలోని బలహీనవర్గాలు సామాజికంగా అన్యాయానికి గురికాకుండా ప్రభుత్వం వారికి విద్య, ఆర్థిక అవసరాలను నెరవేర్చాలని పేర్కొన్న 46వ అధికరణకు ఈ నాలుగో క్లాజు అనుగుణంగా ఉంది. బలహీన వర్గాల వారికి కల్పించిన ప్రత్యేక సదుపాయాలు వివక్షతతో కూడుకున్నవని కోర్టులో సవాల్ చేయడానికి వీలులేకుండా ఈ క్లాజును రాజ్యాంగంలో చేర్చారు.

**అధికరణ 16(4) ఉద్యోగాల్లోను, సర్వీసుల్లోను రిజర్వేషన్లు**
**అధికరణ 19(5) ఆస్తుల్లో గిరిజన ప్రయోజనాల పరిరక్షణ**

భారతపౌరులు భారతదేశంలో ఎక్కడైనా స్థిరపడవచ్చు. ఎక్కడైనా సంచరించవచ్చు, ఎక్కడైనా ఆస్తులు కొనవచ్చు, విక్రయించవచ్చు అని రాజ్యాంగం పేర్కొంటోంది. అయితే 19(5) అధికరణం ప్రకారం షెడ్యూల్డ్ తరగతుల ప్రయోజనాల పరిరక్షణకోసం ప్రభుత్వం కొన్ని ప్రత్యేక పరిమితులు విధించవచ్చు. గిరిజనులు అనేక మోసాలకు, దోపిడీకి గురయ్యే అవకాశాలు హెచ్చుగా ఉన్నందున ప్రత్యేక పరిస్థితులలో వారు తమ స్వంత ఆస్తులను సహితం ఇతరులకు విక్రయించకుండా, లేదా ధారాదత్తం చేయకుండా కొన్ని ప్రత్యేక ఏర్పాట్లు చేసారు. గిరిజనుల ప్రయోజనాల పరిరక్షణను దృష్టిలో పెట్టుకొని సామాన్య పౌరులు కొన్ని ప్రదేశాలలో స్వేచ్ఛగా తిరుగకుండానూ, స్థిర నివాసం ఏర్పర్చుకుండానూ, ఆస్తులు సేకరించకుండానూ, ఆంక్షలు విధించడం జరిగింది.

**అధికరణం 23 : మానవుల క్రయవిక్రయాలు, వెట్టిచాకిరీ నిషేధం**

ఈ అధికరణం మానవుల క్రయవిక్రయాలను నిషేధిస్తుంది. బేగార్ లేక వెట్టి చాకిరీ పరిస్థితిని, అటువంటి ఇతర పద్ధతులను పూర్తిగా నిషేధిస్తుంది. గిరిజన తెగలను ఆర్థిక దోపిడీకి గురిచేయడం చాలా సులువు. అందువల్ల వారిని వెట్టి బానిసత్వంలోకి నెట్టివేసే అవకాశాలు కూడ ఎక్కువే. అటువంటి పద్ధతులను నిషేధించడం గిరిజనులకు ప్రయోజనకరంగా ఉంటుంది. నిజానికి దేశంలోని పలు ప్రాంతాల్లో నివసిస్తున్న గిరిజన తెగలు దుర్భర జీవితాన్ని గుడుపున్నాయి.

**అధికరణ 29 : సాంస్కృతిక, విద్యా హక్కులు**
**అధికరణ 29(2) అధికరణం 15లోని క్లాజు 4కు లోబడివుంది.**

ప్రభుత్వ విద్యా సంస్థల్లో రాష్ట్ర ప్రభుత్వాలు వెనుకబడిన తరగతులకు సీట్లను రిజర్వు చేయడం ఈ చర్యతో రాజ్యాంగ బద్ధం అయ్యింది. 29వ అధికరణం ప్రకారం దేశంలో సాంస్కృతికంగానూ, భాషాపరంగానూ మైనార్టీలుగా ఉన్నవారు తమ సంస్కృతిని, భాషను పరిరక్షించుకునే హక్కు ఉంది. దీనివల్ల షెడ్యూల్డ్ తెగల వారు తమ భాషలను, మాండలికాలను, సంస్కృతులను పరిరక్షించుకునే అవకాశం ఏర్పడింది. వారిపై ప్రభుత్వం చట్టాన్ని ఉపయోగించి ఇతర సంస్కృతులను, భాషలను రుద్దబోదు.

**అధికరణ 46 : షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, ఇతర బలహీన వర్గాల విద్య, ఆర్థిక ప్రయోజనాల పరిరక్షణ**
**అధికరణ 164 :**

బీహారు, ఒరిస్సా, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో గిరిజన సంక్షేమ శాఖలకు మంత్రులను నియమించాలని నిర్దేశిస్తున్నది. ఈ రాష్ట్రాలలో గిరిజనులు చెప్పుకోదగ్గ సంఖ్యలో ఉన్నారు. ఈ రాష్ట్రాలలో గిరిజన సంక్షేమశాఖలకు మంత్రులను నియమించాలని నిర్దేశించడం ద్వారా రాజ్యాంగ రచయితలు గిరిజనుల సంక్షేమం పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించారని గమనించవచ్చు.

**అధికరణ 330, 333, 334 : లోక్‌సభ, శాసన సభల్లో రిజర్వేషన్లు**
**అధికరణ 335 : రిజర్వేషన్లకు పరిమితులు**
**అధికరణ 338 : ప్రత్యేక అధికారి**

షెడ్యూల్డ్ కులాలు, తెగల కోసం రాష్ట్రపతి ప్రత్యేక అధికారిని నియమించాలని రాజ్యాంగం షెడ్యూల్డ్ కులాలు, తెగలకు ప్రసాదించిన రక్షణకు సంబంధించిన అన్ని అంశాలనూ ఈ ప్రత్యేకాధికారి దర్యాప్తు చేయాలి. రాష్ట్రపతి కోరిన కాలవ్యవధిలో ఈ అధికారి రాజ్యాంగం ప్రసాదించిన రక్షణలు ఎలా అమలవుతున్నాయో నివేదించాలి. ఈ నివేదికను రాష్ట్రపతి పార్లమెంట్‌కు సమర్పించాలి. ఈ ప్రత్యేకాధికారిని షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగల కమిషనర్‌గా పేర్కొంటారు.

1990లో చేసిన 64వ రాజ్యాంగ సవరణ ద్వారా 'ప్రత్యేక అధికారి' పదవిని 'షెడ్యూల్డ్ కులాల–తెగల జాతీయ కమిషనర్'గా వ్యవహరించడం ప్రారంభించారు. ఈ కమిషన్‌లో అధ్యక్షురాలు, ఉపాధ్యక్షురాలు, అయిదుగురు సభ్యులు ఉంటారు. వీరందరినీ రాష్ట్రపతి నియమిస్తారు. ఈ కమిషన్ తన పనితీరును తానే స్వయంగా నియంత్రించుకుంటుంది.

## రవికుమార్



శివనంపల్లి ప్రాథమిక పాఠశాల హెడ్మాస్టరుగా పనిచేస్తున్న రవికుమార్ (36) విధి నిర్వహణలో భాగంగా ఆగస్ట్ 29న పాఠశాలకు వెళుతూ జింకలపల్లి స్టేజీ దగ్గర (7వ నెంబర్ జాతీయ రహదారి) తాను ఎక్కాల్సిన బస్సు వెళ్లిపోతుందనే తొందరలో రోడ్డు దాటుతూ ప్రమాదవశాత్తు మరణించారు. ఆయన 'వీక్షణం'లో అసహజమరణాల శీర్షికకై మహబూబ్‌నగర్ జిల్లా నుంచి క్రమం తప్పకుండా ప్రతి నెల బాధ్యతతో అసహజ మరణాల వివరాలను తెలిపేవారు. అసహజంగా ఆత్మహత్యల పాలవుతున్న రైతులకోసం, వైద్యం అందక చనిపోతున్న వారికోసం, రోడ్డు ప్రమాదాల్లో, ఇంకా రకరకాలుగా అర్థరహితంగా చనిపోతున్న వారికోసం చాలా వేదన పడేవారు. ఆయన మహబూబ్‌నగర్ జిల్లా వడ్డేపల్లి మండలం రామాపురం గ్రామంలో నిరుపేద మాదిగ కులంలో పుట్టి డిగ్రీ వరకు గద్వాల్‌లోనూ, బి.ఈడి. వరంగల్ జిల్లా జనగాంలోనూ చదువుకున్నారు. 1997 నుంచి ఉపాధ్యాయ వృత్తిలో ఉన్నారు. ఎన్ని పెద్ద చదువులు చదివినా, ఉద్యోగం వచ్చినా అంటరానితనం, అవమానాలు ఆయన్ని వెంటాడుతూనే ఉన్నాయి. ఆత్మగౌరవ చైతన్యంతో ఆయన కులనిర్మూలనకై కులనిర్మూలన పోరాటసమితిలో తుదిశ్వాస వరకు పనిచేశారు. 'కులనిర్మూలన' పత్రిక జిల్లాఇన్‌చార్జిగా వ్యవహరించారు. ఉపాధ్యాయ సంఘంలోనూ చురుకుగా పనిచేశారు. ఉద్యోగిగానూ, ఉద్యమాల్లోనూ, కుటుంబంలోనూ, తాను నమ్మిన ఆశయాల కోసం చాలా వినమ్రంగానూ, బాధ్యతతోనూ పనిచేశారు. మహబూబ్‌నగర్ జిల్లాలోని వలసలపై, కృత్రిమ కరువుపై అధ్యయనం చేయడానికి వీక్షణం – సి.డి.ఆర్.సి. ప్రకటించిన ప్రాజెక్ట్ కోసం చర్చిస్తూ అర్థాంతరంగా మననుంచి వెళ్లిపోయిన రవికుమార్‌కు 'వీక్షణం' వినమ్రంగా నివాళులు అర్పిస్తోంది. ◆

**అధికరణ 339 (1)**

కమిషన్ నియామకం రాజ్యాంగం అమలులోకి వచ్చి పదేళ్లు దాటిన తరువాత ఎప్పుడైనా రాష్ట్రపతి రాష్ట్రంలోని షెడ్యూల్డ్ ప్రాంతాలలో జరిగే పరిపాలన తీరుపైనా, షెడ్యూల్డ్ తెగల సంక్షేమ పథకాల అమలు తీరుపైన నివేదిక సమర్పించడం కోసం కమిషన్‌ను ఏర్పాటు చేయవచ్చు. ఇప్పటి వరకు అటువంటి కమిషన్ ఒక్కటి మాత్రమే ఏర్పాటైంది. షెడ్యూల్డ్ ప్రాంతాలు – షెడ్యూల్డ్ తెగల కమిషన్ పేరుతో కమిషన్ 1960 ఏప్రిల్ 28న ఏర్పాటైంది. 1961 అక్టోబర్‌లో ఈ కమిషన్ తన నివేదిక సమర్పించింది. యు.ఎన్. దేబర్ ఈ కమిషన్‌కు నాయకత్వం వహించడం వల్ల ఈ కమిషన్ దేబర్ కమిషన్‌గా ప్రసిద్ధి చెందింది.

### షెడ్యూళ్లు 5-6

రాజ్యాంగంలో X భాగంలోని 244, 244(ఎ) అధికరణలు షెడ్యూల్డ్ ప్రాంతాలు, గిరిజన ప్రాంతాల పరిపాలనకు సంబంధించినవి. రాజ్యాంగంలో ఉపయోగించిన షెడ్యూల్డ్ ప్రాంతాలు, గిరిజన ప్రాంతాలకు ప్రత్యేకమైన, స్పష్టమైన అర్థాలున్నాయి. షెడ్యూల్డ్ ప్రాంతాలు రాజ్యాంగంలోని అయిదో షెడ్యూల్డ్ కిందకు వస్తాయి. 'అందువల్ల వీటిని అయిదో షెడ్యూల్డ్ ప్రాంతాలు' అని కూడ వ్యవహరిస్తారు. గిరిజన ప్రాంతాలు రాజ్యాంగంలోని ఆరో షెడ్యూల్డ్ కిందకు వస్తాయి.

### అయిదో షెడ్యూల్

ఈ షెడ్యూల్ సవరించడానికి పార్లమెంట్‌కు పూర్తి అధికారాలు ఉన్నాయి. 368 అధికరణం కోసం ఈ షెడ్యూలులో చేసిన మార్పులు రాజ్యాంగ సవరణలు కావు.

షెడ్యూల్డ్ ప్రాంతాలకు సుదీర్ఘ చరిత్ర ఉంది. 'షెడ్యూల్డ్ జిల్లాల చట్టం 1874' లో ఈ షెడ్యూల్డ్ ప్రాంతాలకు బీజం పడింది. కొన్ని షెడ్యూల్డ్ జిల్లాలో నేర, న్యాయ వ్యవహారాలు స్థావరాలు ఏర్పాటు, ప్రభుత్వ శిస్తుల వసూలు, పరిపాలనా వ్యవహారాలు నిర్వహించడం కోసం ప్రత్యేక అధికారుల నియమకానికి ఈ చట్టాన్ని ఏర్పాటు చేసారు. తర్వాత కాలంలో వచ్చిన 'భారత ప్రభుత్వ చట్టం 1919', 'భారత ప్రభుత్వ చట్టం 1935'లలో కూడ షెడ్యూల్డ్ ప్రాంతాల ప్రస్తావన ఉంది. ప్రస్తుత రాజ్యాంగంలో అయిదో షెడ్యూల్డ్ ప్రాంతాలను చేర్చారు. ఈ కింది లక్ష్యాల సాధనకోసం, షెడ్యూల్డ్ ప్రాంతాలను ఏర్పాటు చేశారు.

ఎ) బయటి వారి ప్రమేయం, ఆటంకం లేకుండా గిరిజనులు తమ ప్రస్తుత హక్కులను తాము అనుభవించేలా చూడడం.

బి) షెడ్యూల్డ్ ప్రాంతాల అభివృద్ధి, గిరిజనతెగల ప్రయోజనాల పరిరక్షణ. రాష్ట్రపతి గిరిజన ప్రాంతాలను షెడ్యూల్డ్ ప్రాంతాలుగా ప్రకటించారు.

ఆంధ్రప్రదేశ్, బీహార్, గుజరాత్, మధ్యప్రదేశ్, మహారాష్ట్ర, ఒరిస్సా, రాజస్థాన్, హిమాచల్‌ప్రదేశ్‌లలో ఈ షెడ్యూల్డ్ ప్రాంతాలున్నాయి. అయిదో షెడ్యూల్డ్ లోని ప్రధానాంశాలు

ఎ) గవర్నర్‌కు ప్రత్యేక అధికారాలు, బి) రాష్ట్రపతికి గవర్నర్ నివేదిక సమర్పణ, సి) గిరిజన మండలి ఏర్పాటు.

### ఆరో షెడ్యూల్

ఆరో షెడ్యూల్ అస్సాం, మేఘాలయ, మిజోరాం, త్రిపుర రాష్ట్రాలలోని గిరిజన ప్రాంతాలకు అన్వయిస్తుంది. ఈ గిరిజన ప్రాంతాల లక్షణాలు ఈ విధంగా ఉంటాయి.

ఎ) గిరిజన ప్రాంతాల పరిధిలోకి వచ్చే అన్ని అంశాలలో వాటికి స్వయం ప్రతిపత్తి ఉంటింది. అందువల్ల వీటిని 'రాష్ట్రంలో రాష్ట్రాలు' (స్టేట్స్ విథిన్ ది స్టేట్స్) గా వ్యవహరిస్తారు.

బి) స్వయం పాలిత జిల్లాలు, స్వయం పాలిత ప్రాంతాల ఏర్పాటు ద్వారా స్వతంత్ర పాలనాధికారాన్ని ఏర్పాటు చేస్తారు.

సి) గవర్నర్ ప్రత్యేక నోటిఫికేషన్ ద్వారా ఆదేశాలు జారీచేస్తే పార్లమెంట్‌గానీ, రాష్ట్ర శాసనసభలుగాని చేసిన చట్టాలు గిరిజన ప్రాంతాలకు అన్వయిస్తారు. గిరిజనప్రాంతాలకు అంతటి స్వయం ప్రతిపత్తి ఉంది. ◆

## ఆంధ్రప్రదేశ్‌లో ఆదివాసి తెగలు, నివసించే ప్రాంతాలు, వారి భాషలు

ఆదివాసులు దేశవ్యాప్తంగా అనేక ప్రాంతాలలో జీవిస్తున్నారు. వారు మాట్లాడే భాషలు అనేక రకాలు. ఒకే తెగకు చెందిన వారైనప్పటికీ వేరు వేరు రాష్ట్రాలలో వేరు వేరు భాషల్లో మాట్లాడుతున్నారు. ఈ విధంగా దేశంలో 812 భాషల్లో మాట్లాడుతున్నారనే అంచనా ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో నివసించే గిరిజన జాతుల భాషలను ముఖ్యంగా మూడు భాషా కుటుంబాల కింద విభజించవచ్చు.

1) ద్రవిడియన్ భాషా కుటుంబం - గోండి, కోయ, కొలామి, ఎరుకల
2) ముండారి భాషా కుటుంబం - సవర, గదబ
3) ఇండో ఆర్యన్ కుటుంబం - లంబాడీ లేదా బంజార్

| క్ర.సం. | గిరిజన తెగ | నివసించే ప్రదేశాలు | మాట్లాడే భాష |
|---|---|---|---|
| 1 | ఆంధ్ | ఆదిలాబాద్ జిల్లాలోని కొండ ప్రాంతాలు | మరాఠీ, తెలుగు |
| 2 | ఎరుకల | ఆంధ్రప్రదేశ్ అంతట నివసిస్తున్నారు | తెలుగు, ఎరుకల |
| 3 | కొండ కొమ్మర | శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి | తెలుగు |
| 4 | కొండదొర | శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి | కొండ, కువి, తెలుగు |
| 5 | కొండరెడ్డి | పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, ఖమ్మం | తెలుగు |
| 6 | కోలాము | ఆదిలాబాద్ | కోలామి, తెలుగు |
| 7 | కోయ | తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, ఖమ్మం, వరంగల్ | కోయ, తెలుగు |
| 8 | కోందు | విశాఖపట్టణం, శ్రీకాకుళం | కువి, తెలుగు |
| 9 | కొటియా | విశాఖ, శ్రీకాకుళం జిల్లా ప్రాంతాలు | ఒరియా, తెలుగు |
| 10 | ములియా లేదా కులియా | విశాఖపట్టణం జిల్లా | ఒరియా, తెలుగు |
| 11 | గదబ | విశాఖపట్టణం, శ్రీకాకుళం, విజయనగరం | తెలుగు, గదబ |
| 12 | గోండు | ఆదిలాబాద్, కరీంనగర్ | గోండి, తెలుగు |
| 13 | గౌదు | విశాఖపట్టణం, శ్రీకాకుళం | తెలుగు |
| 14 | చెంచు | కర్నూలు, మహబూబ్‌నగర్, ప్రకాశం, గుంటూరు | తెలుగు |
| 15 | తోటీలు | ఆదిలాబాద్ | తెలుగు, మరాఠీ |
| 16 | నాయకపోడు లేదా నాయక్ | తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, ఖమ్మం, కరీంనగర్, వరంగల్, ఆదిలాబాద్ | తెలుగు |
| 17 | ప్రదానులు, పరధాన్ | ఆదిలాబాద్ | గోండి, మరాఠీ, తెలుగు |
| 18 | పోరజలు | విశాఖ, శ్రీకాకుళం, తూర్పు గోదావరి | ఏర్జా, తెలుగు, ఒరియా |
| 19 | బగతలు | విశాఖపట్టణం, శ్రీకాకుళం | తెలుగు |
| 20 | బిల్లులు | ఆదిలాబాద్, మహబూబ్‌నగర్, హైదరాబాద్ | తెలుగు |
| 21 | మన్నెదొరలు | విశాఖ, శ్రీకాకుళం | తెలుగు |
| 22 | మాలీలు | విశాఖపట్టణం | ఒరియా, తెలుగు |
| 23 | మూకదొరలు లేదా నూకదొరలు | శ్రీకాకుళం, విశాఖపట్టణం | తెలుగు |
| 24 | యానాదులు | ఆంధ్రప్రదేశ్ అంతటా | తెలుగు |
| 25 | రెడ్డిదొర | విశాఖపట్టణం | తెలుగు |
| 26 | వాల్మీకులు | తూర్పు గోదావరి, విశాఖపట్టణం, శ్రీకాకుళం | తెలుగు |
| 27 | సవరలు | శ్రీకాకుళం, విజయనగరం | ఒరియా, తెలుగు, సవర |
| 28 | సుగాలీలు | శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి జిల్లాలు తప్ప తక్కిన ఆంధ్రప్రదేశ్ అంతటా ఉన్నారు | లంబాని, తెలుగు |
| 29 | కోదులు, జాతపు, సామంత | విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం | కువి, తెలుగు |
| 30 | బెంథో, ఒరియా | శ్రీకాకుళం, విశాఖపట్టణం | ఒరియా, తెలుగు |
| 31 | రోన | విశాఖపట్టణం, విజయనగరం | తెలుగు, ఒరియా |
| 32 | కట్టునాయకన్ | ముఖ్యంగా పట్టణ ప్రాంతాలు | తెలుగు, ఒరియా |
| 33 | కొండకాపు | శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి | తెలుగు |

మూలం : అభివృద్ధికి దూరంగా ఆంధ్రప్రదేశ్ గిరిజనులు – కెచ్చెల రంగారెడ్డి

| ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూల్డ్ తెగల జనాభా వివరాలు (2001) | | | | | |
|---|---|---|---|---|---|
| క్ర.సం. | జిల్లా | వైశాల్యం '000 చ.కి.మీ. | మొత్తం జనాభా (సంఖ్య) | షెడ్యూల్డ్ తెగల జనాభా (సంఖ్య) | శాతం |
| | **కోస్తాంధ్ర ప్రాంతం** | | | | |
| 1. | శ్రీకాకుళం | 5.8 | 25,37,593 | 1,51,249 | 5.96 |
| 2. | విజయనగరం | 6.5 | 22,49,254 | 2,14,839 | 9.55 |
| 3. | విశాఖపట్నం | 11.2 | 38,32,336 | 5,57,572 | 14.55 |
| 4. | తూర్పు గోదావరి | 10.8 | 49,01,420 | 1,91,561 | 3.91 |
| 5. | పశ్చిమ గోదావరి | 7.7 | 38,03,517 | 96,659 | 2.54 |
| 6. | కృష్ణా | 8.7 | 41,87,841 | 1,07,611 | 2.57 |
| 7. | గుంటూరు | 11.4 | 44,65,144 | 2,08,157 | 4.66 |
| 8. | ప్రకాశం | 17.6 | 30,59,423 | 1,18,241 | 3.86 |
| 9. | నెల్లూరు | 13.1 | 26,68,564 | 2,42,257 | 9.08 |
| | **మొత్తం (ఎ)** | **92.8** | **3,17,05,092** | **18,88,146** | **5.96** |
| | **రాయలసీమ ప్రాంతం** | | | | |
| 10. | చిత్తూరు | 15.2 | 37,45,875 | 1,28,085 | 3.42 |
| 11. | కడప | 15.4 | 26,01,797 | 61,371 | 2.36 |
| 12. | అనంతపురం | 19.1 | 36,40,478 | 1,27,161 | 3.49 |
| 13. | కర్నూలు | 17.7 | 35,29,494 | 69,635 | 1.97 |
| | **మొత్తం (బి)** | **67.4** | **1,35,17,644** | **3,86,252** | **2.86** |
| | **తెలంగాణ ప్రాంతం** | | | | |
| 14. | మహబూబ్‌నగర్ | 18.4 | 35,13,934 | 2,78,702 | 7.93 |
| 15. | రంగారెడ్డి | 7.5 | 35,75,064 | 1,46,057 | 4.09 |
| 16. | హైదరాబాద్ | 0.2 | 38,29,753 | 34,560 | 0.90 |
| 17. | మెదక్ | 9.7 | 26,70,097 | 1,34,533 | 5.04 |
| 18. | నిజామాబాద్ | 8.0 | 23,45,685 | 1,65,735 | 7.07 |
| 19. | ఆదిలాబాద్ | 16.1 | 24,88,003 | 4,16,511 | 16.74 |
| 20. | కరీంనగర్ | 11.8 | 34,91,822 | 90,636 | 2.60 |
| 21. | వరంగల్ | 12.9 | 32,46,004 | 4,57,679 | 14.10 |
| 22. | ఖమ్మం | 16.0 | 25,78,927 | 6,82,617 | 26.47 |
| 23. | నల్గొండ | 14.2 | 32,47,982 | 3,42,676 | 10.55 |
| | **మొత్తం (సి)** | **114.8** | **3,09,87,271** | **27,49,706** | **8.87** |
| | **ఆం.ప్ర. మొత్తం (ఎ+బి+సి)** | **275.0** | **7,62,10,007** | **50,21,104** | **6.60** |

మూలం : స్టాటిస్టికల్ అబ్‌స్ట్రాక్ట్ ఆంధ్రప్రదేశ్ – 2006

**భారతదేశంలో ప్రాంతాల వారీగా షెడ్యూల్డ్ తెగల జనాభా (శాతం)**

ఆంధ్రప్రదేశ్ – 6.3 శాతం; అస్సాం – 12.8 శాతం; బీహార్* – 7.7 శాతం, గుజరాత్ – 14.9 శాతం, హిమాచల్‌ప్రదేశ్ – 4.2 శాతం; కర్ణాటక – 4.3 శాతం; మధ్యప్రదేశ్* – 23.3 శాతం; మహారాష్ట్ర – 9.3 శాతం, మణిపూర్ – 34.4 శాతం; మేఘాలయ – 85.5 శాతం; మిజోరాం – 94.7 శాతం; ఒరిస్సా – 22.2 శాతం; అరుణాచల్‌ప్రదేశ్ – 63.7 శాతం; తమిళనాడు – 1.0 శాతం; పశ్చిమ బెంగాల్ – 5.6 శాతం; రాజస్థాన్ – 12.4 శాతం; త్రిపుర 30.9 శాతం, కేరళ – 1.1 శాతం. ఇంకా అండమాన్ & నికోబార్, దాద్రా నగర్ హవేలి, డామన్ & దయ్యూ, గోవా, జమ్మూ & కాశ్మీర్, లక్షద్వీప్, ఉత్తరప్రదేశ్* ప్రాంతాలలోను గిరిజనులు ఉన్నారు. (*విభజనకు ముందు)

## గిరిజనుల తిరుగుబాట్లు (1778 - 1971)

| సంవత్సరం | తిరుగుబాటు |
|---|---|
| 1778 | బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పహారియా సిర్దార్‌ల తిరుగుబాటు |
| 1784-85 | జవహర్ రాణికి వ్యతిరేకంగా కోలీల (మహారాష్ట్ర) తిరుగుబాటు |
| 1789 | ఛోటా నాగ్‌పూర్ వద్ద తమర్‌లో తిరుగుబాటు |
| 1794-95 | ఛోటా నాగ్‌పూర్ వద్ద తమర్‌లో తిరుగుబాటు |
| 1795-80 | బీహార్‌లో ఛౌరీ ఉద్యమ తిరుగుబాటు |
| 1798 | పాన్‌ఛేట్ ఎస్టేట్ అమ్మకానికి వ్యతిరేకంగా తిరుగుబాటు |
| 1801 | బీహార్‌లో తమర్ తిరుగుబాటు |
| 1803 | ఆంధ్రప్రాంతంలో తూర్పు గోదావరి ఏజెన్సీ ప్రాంతంలో కోయిల తిరుగుబాటు |
| 1807 | ఛోటా నాగ్‌పూర్ ఆదివాసుల తిరుగుబాటు |
| 1808 | ఛోటా నాగ్‌పూర్ ఆదివాసుల తిరుగుబాటు |
| 1809-28 | గుజరాత్‌లో భిల్‌ల తిరుగుబాటు |
| 1811,17,20 | బీహార్‌లో వ్యవసాయం చేసుకునే ఆదివాసీల తిరుగాబాటు |
| 1818 | ఒక కుట్ర అనంతరం మహారాష్ట్రలో కోలీల తిరుగాబాటు |
| 1816-24 | బర్మావాసుల అస్సాం దురాక్రమణ. ఆ కాలంలో బీభత్సపాలన |
| 1824-26 | బర్మావాసుల అస్సాం దురాక్రమణకు వ్యతిరేకంగా మొదటి యుద్ధంలో బ్రిటిష్‌వారు అస్సామీల కారణాన్ని బలపరిచి బర్మావాసులను ఓడించారు. వారు ఆ తరువాత అస్సాంను స్వాధీనం చేసుకున్నారు. |
| 1825 | 'సింగ్పోలు' పాడియా వద్ద బ్రిటిష్ పత్రిక పై దాడిచేసి తగులబెట్టారు |
| 1827 | యాత్రికుడు విల్‌కాక్స్‌ను మిష్మీలు చంపేశారు |
| 1828 | గోమ్‌ధర్ కొన్వార్ ఆధ్వర్యంలో బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా అస్సాంలో మొట్టమొదటి తిరుగుబాటు జరిగింది. తరువాత లెఫ్టినెంట్ రూథర్‌ఫోర్డ్ అతన్నీ ఓడించాడు |
| 1828 | సింగ్పోల ముఖ్యుడు మూడువేల మంది ఆదివాసీ యోధుల సహకారంతో సాదియా పై దాడిచేశారు |
| 1829 | అస్సాం ఖాసీల తిరుగుబాటు |
| 4.4.1829 | బ్రిటిష్ జనరల్స్‌నూ, వారి భారతీయ సిపాయిలను తీరుత్‌సింగ్ (అస్సాం) నరికి చంపేశారు |
| 13.1.1833 | తీరుత్‌సింగ్ లొంగుబాటు |
| మార్చ్, 1834 | తీరుత్‌సింగ్ చనిపోయారు |

| సంవత్సరం | తిరుగుబాటు |
|---|---|
| 1831-32 | రాజ్యాధికారం కైవసం చేసుకోవడానికి కోతల్ తిరుగుబాటు |
| 1820, 32, 67 | బీహార్‌లో ముండా ఆదివాసీల తిరుగుబాటు |
| 1823-32 | బీహార్‌లో భగీరథ్ నాయకత్వంలో ఖేర్వర్‌ల తిరుగుబాటు<br>బీహార్ హజారీబాగ్ ప్రాంతంలో దుబియా గొసైన్ నాయకత్వంలో ఖేర్వర్‌ల తిరుగుబాటు తరువాత పలాము ప్రాంతంలో ఫటేల్‌సింగ్ తిరుగుబాట్లకు నాయకత్వం వహించారు |
| 1834-41 | బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా అస్సాంలో లుషియాల తిరుగుబాటు |
| 1835 | అస్సాం నేఫా దఫ్లాలు బ్రిటిష్ వారిపై దాడులకు పాల్పడ్డారు. బదులుగా బ్రిటిష్‌వారు తీవ్రంగా అణచివేతకు పాల్పడ్డారు |
| 1836 | బ్రిటిష్ వ్యతిరేకమైన కార్యకలాపాలు చేపట్టినందుకు అస్సాంలోని జైంతియా కొండల రాజును బ్రిటిష్ వారు పదవీచ్యుడిని గావించారు. కొంతమొత్తాన్ని పింఛనుగా ఇచ్చారు |
| 1836 | అస్సాంలోని మిష్మీలు వృక్షశాస్త్రవేత్త గ్రిఫిత్‌ను అనుమానంతో చంపేశారు |
| 1838 | గుజరాత్‌లో నాయకుల తిరుగుబాటు |
| 1839-43 | అస్సాంలో ఖంప్టీల తిరుగుబాటు |
| 1839 | బ్రిటిష్ ఏజెంట్ ఆడమ్ వైట్‌తో సహ 80 మంది అధికార్లనూ, సైనికులనూ ఖంప్టీలు దాడిచేసి చంపేశారు |
| 1842 | బ్రిటిష్ వాళ్లు అస్సాంలో సదియా, ముట్టాక్‌ని ప్రాంతాలను ఆక్రమించుకున్నారు |
| 1842 | అస్సాం లుషియాలు అరకాన్, సిల్హెట్ రాజ్యాలపై దాడులు చేసి బ్రిటిష్ సేనలను ఓడించారు |
| 1843 | సింగ్పోల నాయకుడు నైరంగఫిడూ బ్రిటిష్ రక్షకదళాల పై దాడిచేసి చాలామంది సైనికులు చంపేశారు |
| 1844 | మణిపూర్‌లో ఒక గ్రామంపై లుషియాలు దాడిచేసి ఊచకోత కోసారు. 20 మంది తలలను జ్ఞాపికలుగా తెచ్చారు<br>తదనంతరం బ్రిటిష్‌వారి అణచివేత కొనసాగింది. లుషియాల నాయకుడు లాల్‌శుక్లాను అరెస్ట్ చేసి జీవితఖైదు చేశారు |
| 1846 | గుజరాత్‌లో కువర్ జివో వసావో నాయకత్వంలో భిల్‌ల తిరుగుబాటు |
| 1849 | కద్మాసింగ్‌ఫో అస్సాంలోని బ్రిటిష్ గ్రామాలపై దాడిచేసి స్వాధీనం చేసుకున్నారు |

| సంవత్సరం | తిరుగుబాటు |
|---|---|
| 1850 | ఒరిస్సాలో కోంధ్ ట్రైబల్ నాయకుడు చక్రాబిసోయి తిరుగుబాటు |
| 1854 | అస్సాం కఛరీ కొండల్లో కఛరీల ముఖ్యుడు బ్రిటిష్ వారికి లొంగిపోయి తన రాజ్యాన్ని అప్పగించాడు |
| 1855 | బీహార్‌లో సంతాల్‌ల తిరుగుబాటు |
| 1855 | ఇద్దరు క్రైస్తవ మతబోధకులను చంపిన కారణంగా మిష్మీలను శిక్షించేందుకై ఈడెన్ పర్యటన |
| 1858 | గుజరాత్‌లో బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా నాయిక్దాల తిరుగుబాటు |
| 1857-58 | భాగోజినాయక్, కజర్‌సింగ్ నాయకత్వంలో గుజరాత్‌లో భిల్‌ల తిరుగుబాటు |
| 7.9.1857 | అస్సాంలో మణిరామ్ దేవన్, సరింగ్‌రాజాల తిరుగుబాటు. తదనంతరం బ్రిటిష్ ప్రభుత్వం వారిని అరెస్ట్ చేసింది |
| 1860 | త్రిపురలో లషైల ముఖ్యుడు బ్రిటిష్‌వారిపై దాడిచేసి 186 మంది బ్రిటిష్ అనుచరులు చంపేశాడు. |
| 1860-62 | జైంతియా కొండల్లో సింతెంగ్‌ల తిరుగుబాటు |
| 1861 | ఆదివాసీ రైతాంగం ఫులాగురి తిరుగుబాటు |
| 1861 | ఒరిస్సాలో జువాంగ్ తిరుగుబాటు |
| 1862 | ఆదివాసీ చిన జమిందారుల (ముత్తదార్లు) వారి అనుయాయులైన బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా ఆంధ్ర ఏజెన్సీ ప్రాంతంలో కోయల తిరుగుబాటు |
| 1867, మార్చ్ | సెంటినల్ ఐలాండర్స్ (అండమాన్‌లో ఒక ఆదివాసీ బృందం) హంఫ్రీపై దాడి చేసారు |
| 1868 | గుజరాత్‌లో జోరియాల నాయకత్వంలో నాయకుల తిరుగుబాటు |
| 1868-69 | కామ్రూప్-దర్రాంగ్‌ల రైగ్-మెల్స్ తిరుగుబాటు |
| 1869 | సింగ్‌ఫోలు, బ్రిటిష్‌వారి మధ్య శాంతి |
| 1869-70 | బీహార్‌లో ధన్‌బాద్ సంతాల్‌లు తుండిరాజుకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసారు. బ్రిటిష్ కల్నల్ డాల్టన్ సర్దుబాటు చేశాడు |
| 1871-72 | లుషియాలు, బ్రిటిష్ వారు ఒక ఒప్పందంపై సంతకాలు చేసారు |
| 1872-73 | బ్రిటిష్ సైన్యాల ధప్లాలను అణచివేసారు |
| 1879 | నాగాల తిరుగుబాటు |
| 1879 | ముత్తదారులు, బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా ఆంధ్ర ఏజెన్సీ కోయల తిరుగుబాటు |
| 1880 | ఒరిస్సాలో మల్కాన్‌గిరిలో తమ్మన్నదొరల నాయకత్వంలో కోయల తిరుగుబాటు |
| 7.8.1883 | హంఫ్రీ (అండమాన్) వాసులపై సెంటినెల్ ద్వీప ఆదివాసుల తిరుగుబాటు |
| 1889 | బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సర్దారీల (ముండా నాయకుల) ఆందోళన |
| 1891 | బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా మణిపూర్‌లో తికేంద్రజీత్ సింగ్ నాయకత్వంలో తిరుగుబాటు |
| 1892 | బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా తూర్పులుషియాల తిరుగుబాటు |
| 27.8.1895 | బిర్సా ముండా అరెస్ట్ |
| 1811 | బస్తర్ ఆదివాసుల తిరుగుబాటు |
| 1913,14, 20,21 | బీహార్‌లో తానాభగత్ తిరుగుబాటు |
| 1922 | బ్రిటిష్ వాళ్లకు వ్యతిరేకంగా అల్లూరి శ్రీరామరాజు నాయకత్వంలో కోయల తిరుగుబాటు |
| 1932 | అస్సాంలో రాణిగ్విడల్లోల నాగాల (క్రిస్టియన్‌కాని) తిరుగుబాటు |
| 1941 | భీము నాయకత్వంలో ఆదిలాబాద్‌లో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా గోండులు, కోలాముల తిరుగుబాటు |
| 1942 | ఒరిస్సాలోని కొరాపుట్‌లో లక్ష్మణనాయక్‌ల తిరుగుబాటు |
| 1942-45 | అండమాన్ ద్వీపాల్లో జపాను దురాక్రమణ సైన్యాలకు వ్యతిరేకంగా అక్కడి ఆదివాసుల పోరాటాలు |
| 1963-71 | నాగాల తిరుగుబాటు |
| 1966-71 | మిజోల తిరుగుబాటు |
| 1956-58 | వర్లీ తిరుగుబాటు (మహారాష్ట్ర) |
| 1967-71 | నక్సలైట్ల తిరుగుబాటు |

మూలం : ట్రైబల్ రివోల్ట్స్ - వి. రాఘవయ్య

## ప్రాజెక్ట్‌ల వలన పరాయీకరణకు గురవుతున్న గిరిజనులు

**అ**భివృద్ధికోసం వచ్చిన ప్రాజెక్ట్‌ల వల్ల భారత జనాభాలో రెండు శాతం మంది ఇప్పటి వరకు నిర్వాసితులు అయ్యారు. వారిలో దాదాపు యాభై శాతం మంది ఆదివాసులు. దేశం మొత్తం జనాభాలో ఆదివాసులు దాదాపు ఎనిమిది శాతంగా ఉన్నారు. గత యాభై ఏళ్లలో భారతదేశంలో 3,300 పెద్దడ్యాంలు నిర్మించారు. ఇవికాక మరొక వెయ్యి డ్యాంలు నిర్మాణంలో ఉన్నాయి. వీటన్నింటి వలన బలహీన వర్గాల ప్రజలు పెద్ద ఎత్తున ఆ ప్రాంతాల నుంచి బలవంతంగా ఖాళీ చేయాల్సివస్తోంది. తప్పుడు విధానాలతో గిరిజనులను ఖాళీ చేయించడం, సమాచారం ఇవ్వకపోవడం, సరైన పునరావాసం కల్పించకపోవడం, చాలా పరిమిత నష్టపరిహారం చెల్లించడం జరుగుతోంది. ఆస్తులు, బతుకు తెరువుకోల్పోయి, పునరావాస ప్రణాళికల వైఫల్యం ఆదివాసుల సంబంధ బాంధవ్యాలు విచ్ఛిన్నం చేస్తోంది. వివక్ష, పేదరికానికి గురికావడం జరుగుతోంది. నిర్మించిన డ్యాంల సంఖ్య ఆధారంగా నిర్వాసితులైన ప్రజలు 21 నుండి 33 మిలియన్లు ఉంటారని అంచనా. అయితే ఈసంఖ్య కాలువలు, కాలనీలు ఇతర నిర్మాణాలతో నిర్వాసితులైన వారు కాకుండా మాత్రమే. ◆

**ప్రజలను రక్షించాల్సిన బాధ్యత ఉన్నవారు, తమ బాధ్యతలను నిర్వర్తించక పోవడమేకాక, ఆదివాసి మహిళలపై అత్యాచారాలు జరిపితే ఇంకెవరికి చెప్పుకోవాలి అని ప్రశ్నిస్తున్నారు బి. జ్యోతి**

# ఆదివాసి మహిళలకు అందుతున్న 'న్యాయం'

మహాత్మా గాంధీ ఆడవాళ్లు అర్థరాత్రి ఒంటరిగా తిరిగినప్పుడే మనకు నిజంగా స్వాతంత్ర్యం వచ్చినట్లు చెప్పాడు. కాని నేడు జరుగుతున్న దేమిటి? బయటికి వెళ్లడం అటుంచి ఎవరింట్లో వారు ఉండినా కూడా, ఇండ్లలోకి ప్రవేశించి మహిళపై అత్యాచారాలు చేశారు. అలా చేసింది మామూలు వ్యక్తులు కాదు. రాష్ట్ర ప్రభుత్వ యంత్రాంగంలో భాగమైన పోలీసులు ప్రజలను రక్షించాల్సిన బాధ్యత ఉన్నవారు, తమ బాధ్యతలను నిర్వర్తించక పోవడమేకాక, రక్షణపేరుతో ఉన్నవీరే మహిళల మాన ప్రాణాలను కబళిస్తే, వారు ఇంకెవరికి చెప్పుకోవాలి.

తమది సంక్షేమ రాష్ట్రమని గిరిజనులకు, దళితులకు ఎన్నో చేస్తామని చెపుతున్న ప్రభుత్వాలు నేడు వీరికి చేసిందేమిటి. విశాఖ ఎజెన్సీ పాడేరు దగ్గర ఉన్న వాకపల్లి గ్రామానికి చెందిన కోందుజాతి మహిళలు ఒక్కరు కాదు, ఇద్దరు కాదు పదకొండు మందిని తమను ఒకరు పట్టుకొంటే ఒకరు మీదపడి చెరిచారని, ఒకరు బయట కావలి ఉంటే ఇంకొకరు ఇంటిలోపల తనపై అత్యాచారం చేశాడని, పిల్లకి పాలిస్తుంటే, పిల్లను బయటికి తోసి అత్యాచారం చేశాడని, ఒకడు బూటు కాళ్లతో తమ కాళ్లపై తొక్కితే, ఇంకొకడు మీద పడ్డారని, హైదరాబాద్ వచ్చి మానవహక్కుల కమిషన్ ఎదుట తమ గోడు వెల్లబోసుకున్నారు. 'సారు మాకు న్యాయం జరుగుతుందని ఈ పట్నం వచ్చినం. మమ్మల్ని ఇట్లా చేసిన పోలీసులను అరెస్ట్ చేయకపోతే మేము మల్లా మీ ఆఫీస్ ముందుకు వచ్చి ప్రాణం తీసుకుంటాం' అన్నారు.

ఆగస్ట్ 20, ఉదయమే పురుషులు పనుల కోసం పొలాలకు వెళ్లిన తరువాత పోలీసులు ఇండ్లలో ఉన్న మహిళలపై దాడిచేసి, మావోయిస్టులకు సహకరిస్తారా? అంటూ తుపాకీ మడమలతో చితకబాదారు. లాఠీలతో చితక్కొట్టారు. 45 సంవత్సరాల నుండి 22 సంవత్సరాల వయస్సు కలిగిన వివాహిత స్త్రీలను అత్యాచారం చేశారు. వీరిలో మూడురోజుల పచ్చి బాలింతను కూడా వదలలేదు ఖాకీమూకలు. దీనితో భయ భ్రాంతులైన కొందరు మహిళలు వాకపల్లి విడిచి సమీపంలోని నుర్మతి గ్రామానికి చేరుకున్నారు. మరికొందరు అడవులలోకి పారిపోయారు.

అత్యాచారాల బారిన పడిన మహిళలు తమ భర్తలు పొలాల నుండి తిరిగి వచ్చిన వెంటనే తమకు జరిగిన అన్యాయాన్ని చెప్పుకొని గుండెలవిసేలా ఏడ్చారు. తమకు న్యాయం ఎక్కడ జరుగుతుందంటే, అక్కడికి వెళ్లారు. ఎంతోమంది పత్రికా విలేకరులకు, మహిళా సంఘాల వారికి, ప్రజాసంఘాల వారికి, అధికారులకు చెప్పుకొని రోదించారు. అయినా వారికి న్యాయం జరగడం లేదు. ఇంతవరకు ఎఫ్.ఐ.ఆర్. నమోదు కాలేదు.

అత్యాచార చట్టంలో మార్పులు జరగకముందు, అత్యాచారానికి గురయిన స్త్రీ తనపై అత్యాచారం జరిగినట్లు తానే రుజువు చేసుకోవాల్సిన పరిస్థితి చట్టంలో ఉండేది. కానీ ఎంతోమంది మహిళా మేధావులు, మహిళా సంఘాలు జరిపిన ఆందోళన వల్ల స్త్రీ తనపై జరిగిన అత్యాచారాన్ని తానే రుజువు చేసుకొనే పరిస్థితి పోవడమే కాక, రేప్ 'లా' లో ఎన్నో మార్పులు వచ్చాయి. ఒక హత్య జరిగితే 'నేరస్తుడు' హంతకుడవుతాడు. ఒక దొంగతనం జరిగితే 'నేరస్తుడు' దొంగ అవుతాడు. ఒక దాడి జరిగితే 'నేరస్తులు' దాడి చేసిన వాళ్లు అవుతారు. వీళ్లందరినీ శిక్షించాలి. ఇది సమాజంలో అంతటా ఆమోదం పొందిన సూత్రం. చెల్లుబాటు అవుతున్న న్యాయం. మరి అదే ఒక స్త్రీపై లైంగిక అత్యాచారం జరిగితే, అప్పుడు ఈ సూత్రాలన్నీ తలకిందులైపోతాయ్. అర్థంతరంగా అ స్త్రీ నేరస్తురాలై పోతుంది.

నేటిసమాజంలో స్త్రీ, పురుషుడి సొంతాస్తి. అతడిని కొల్లగొట్టాలంటే అతని ఆస్తిని కొల్లగొట్టాలి. అతడు నివసించే ప్రాంతం నుండి అతనిని వెళ్లగొట్టాలంటే, అతన్ని ఏమీ చేయనక్కరలేదు. అతని తల్లినో, చెల్లినో, భార్యనో రేప్ చేస్తే చాలన్న భయంకరమైన ఆలోచన నేటి సమాజంలో ఉంది. ఇందులో భాగంగా విశాఖ జిల్లాలోని జి. మాడుగుల మండల పరిధిలోని వాకపల్లి గ్రామానికి చెందిన కోందుజాతివారు, పోడు వ్యవసాయం చేస్తూ జీవిస్తున్న యాభై తొమ్మిది కుటుంబాలను అక్కడినుండి వెళ్లగొట్టడానికి, ప్రభుత్వం పన్నిన కుట్రలో భాగంగా, పోలీసులు ఆదివాసులపై అత్యాచారాలకు పూనుకున్నారు. సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తుతున్న ప్రభుత్వం జిందాల్ కంపెనీకి బాక్సైట్ తవ్వడానికి అక్కడ ఉన్న కొండలను తమ స్వాధీనంలోకి తెచ్చుకొనే ప్రయత్నంలో భాగంగా, అక్కడి ప్రజలు తమకుతాము భయంతో, అవమానంతో తమప్రాంతాలను ఖాళీ చేసేటట్లు చేస్తుంది. అందువల్లనే ఎస్.పి. సభర్వాల్ గ్రేహౌండ్స్ పోలీసులు మహిళలపై అత్యాచారాలు చేయడం బూటకమని వెల్లడించాడు. ఒకపక్క బాధితులు తమను కిరాతకంగా అత్యాచారం చేసారని చెపుతున్నా 'ఐస్ ఆఫ్ అఫెన్స్' తీసుకోవడం కానీ, 'ఐడెంటిఫికేషన్ పరేడ్' జరపడంకానీ చేయలేదు.

# తప్పనిసరిగా చదవాల్సిన కన్నీటి లేఖ

**ము**క్కుపచ్చలారని పసిపిల్లల దగ్గర్నించి మధ్య వయస్కులైన స్త్రీల దాకా ఆంధ్రప్రదేశ్ నుంచి మహిళల అమ్మకం, దేశవ్యాప్తంగా రెడ్ లైట్ ఏరియాలలో తెలుగు అమ్మాయిల కడగండ్లు, భారత దేశపు ఎయిడ్స్ రాజధానిగా హైదరాబాద్ ప్రఖ్యాతి.... ఒక్క మాటలో తెలుగు జాతి సిగ్గుతో, అవమానంతో తలదించుకోవలసిన పరిణామాలు ఇటీవలి కాలంలో పెరిగిపోతున్నాయి. అనంతపురం, కడప, చిత్తూరు జిల్లాల నుంచి బొంబాయి, పూణే నగరాల వ్యభిచార గృహాలకు అమ్మాయిల రవాణా ఇప్పటికి ఎన్నో సార్లు పత్రికల్లో బయటపడ్డప్పటికీ ప్రభుత్వం నుంచి ఎటువంటి చర్యలు అమలు కాలేదు. అక్కడ ఒళ్లు అమ్ముకొని బతకవలసిన దుర్భర స్థితిలో ఉన్న కుటుంబాలను ఆదుకోవడం గాని, వ్యభిచార గృహాలనుంచి నిస్సహాయ స్త్రీలను రక్షించి పునరావాసం కల్పించడం గాని జరగడం లేదు. ఆ నేపథ్యంలో సమాజానికి కనువిప్పు కలిగించేలా పాత్రికేయుడు వేంపల్లి గంగాధర్ 'పూణే ప్రయాణం' పేరుతో ఒక హృదయ విదారకమయిన పుస్తకం వెలువరించారు. ప్రతి ఒక్కరు చదివి తీరవలసిన ఈ పుస్తకంలో నుంచి ఒక చిన్న భాగం :




వెల **రు. 10**
ప్రతులకు : 4/432/ఎ,
వివేకానందనగర్,
కడప – 516 001,
ఫోన్ : 94400 74893

*(వ్యభిచార ఊబిలో చిక్కుకొని చిత్రహింసలు పడుతున్న ఎందరో మహిళలు పూణే, బొంబాయి, ఢిల్లీ ప్రాంతాల నుండి తమని కాపాడమని వేడుకుంటూ రహస్యంగా లేఖలు రాస్తున్నారు. ఆ విధంగా పూణే నుంచి కొందరు మహిళల కన్నీళ్లు అక్షరాలుగా మార్చుకొని రాసిన లేఖ ఇది..)*

అయ్యా!

ఈ లెటర్ మేమంతా ఆడవాళ్లం కలిసి పూణే నుంచి రాస్తున్నాం. మేము చాలా కష్టాల్లో ఉన్నాం. ఇక్కడ మమ్మల్నందర్నీ ఒక ఇంట్లో బంధించారు. వేధిస్తూ వ్యభిచారం చేయిస్తున్నారు. వీళ్లకు వ్యభిచారం చేయించే ఇల్లు కనిసం 12 వరకు పూణేలో ఉంటాయి. వ్యభిచారం చేసే ఆడవాళ్లు 150 మంది దాకా ఉన్నారు. మేమంతా డిస్కో బిల్డింగ్‌లో ఉంటున్నాం. దొంగతనంగా ఇంటి ఓనరుకు తెలీయకుండా ఈ లెటర్ రాస్తున్నాం. ముగ్గురు వ్యక్తులున్నారు. వాళ్లు చాలా డబ్బున్నవాళ్లు. వీళ్లు మన ఆంధ్రప్రదేశ్‌కు చెందినవాళ్లు. అమ్మాయిలను తీసుకొచ్చి అమ్మి వెళ్తుంటారు. ముప్పై, నలభై వేలదాకా డబ్బు తీసుకొని వెళ్లిపోతారు.

లంచాలిస్తారు కాబట్టి వాళ్లకి ఏమీ భయంలేదు. జిల్లెళ్లమంద, చిన్న బిడికిలకు చెందిన ఇద్దరు వ్యక్తులు మమ్మల్నందర్నీ పూణేకు నమ్మించి తీసుకొచ్చారు. మాకు వ్యభిచారం చేయడం ఇష్టంలేదు. కానీ బెదిరించి మాతో ఈ పని చేయిస్తున్నారు. మాకు ఇక్కడ్నుంచి ఎక్కడికి పంపినా తోడుగా ఒక మనిషిని పంపుతారు. ఎందుకంటే వారి నుంచి ఎక్కడ పారిపోతామోనని. చాలామంది అమాయకులైన ఆడవాళ్ల జీవితాలు బలి అవుతున్నాయి.

మాఫియా గ్యాంగులున్నాయి. అమ్మాయిలను ఒక తావు నుంచి మరో తావుకు తరచూ మార్చుతుంటారు. చంపుతామని బెదిరిస్తారు. వీళ్ల రోజు సంపాదన కనీసం ఇరవై, నలభై వేలు. ఈ లెటర్ మా దగ్గరికి సుఖం కోసం వచ్చిన మనిషితో రాయించుకున్నాం. అతను మా ప్రాంతం మనిషి. మా దగ్గరికి వచ్చేటప్పుడు తెలుగుపాట పాడుకుంటూ వచ్చాడు. అప్పుడు తెలిసింది అతడు తెలుగువాడని. అతన్ని పిలిపించుకొని కాళ్లు, చేతులు పట్టుకొని మాకు సాయం చేయమని బతిమాలితే అతను 'సరే' అని ఈ లెటర్ రాశాడు.

మమ్మల్ని త్వరగా వచ్చి విడిపించాలని కోరుతున్నాం ఏదో ఒకటి చేసి మమ్మల్ని ఇక్కడ నుంచి తీసుకెళ్లండి. లేకపోతే మేం చిత్రహింసలు భరించలేక ఆత్మహత్య చేసుకుంటాం. ◆

---

రాష్ట్రమంతా ఈ సంఘటనను ఖండిస్తుంటే, కనీసం జిల్లా కలెక్టర్‌గానీ, ఆర్.డి.ఒ.గానీ, ఏ ఇతర అధికారిగానీ వాకపల్లిని తొంగిచూడలేదు. ఇంతటి నిర్లక్ష్యమా ప్రభుత్వానికి అని ఎప్పటిలానే వాపోవడం జనం వంతయ్యింది.

మహిళలకు సంబంధించిన ఫోరెన్సిక్ రిపోర్టు కూడా వారు అత్యాచారాలకు గురికాలేదని రిపోర్టు రావడం సహజం. ఎందుకంటే ఇవి పోలీసులు చేసిన అత్యాచారాలు కాబట్టి అలాగే వస్తాయి. ఒకవైపు సమాచారహక్కు ఉపయోగించుకోమని ప్రజలకు ప్రభుత్వం పిలుపుని స్తూనే, ఇంకొకవైపు గ్రేహౌండ్స్ పోలీసుల వివరాలివ్వాలని సమాచారహక్కు ప్రకారం పిటిషన్ వేసినా ఇంతవరకు వారి వివరాలు వెల్లడించలేదు.

ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టంలో కులం పేరుతో దూషించిన వారిపై, బాధితుల నుండి ఫిర్యాదు అందితే కేసు పెడతారు. ఇక్కడ ఎస్.ఐ. ఆ కేసులు (సెక్షన్ 376, ఎస్.సి. & ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం) నమోదై ఉన్నాకూడా ఇంతవరకు దోషులను గుర్తించి అరెస్ట్ చేయలేదు. అలాంటప్పుడు ఈ చట్టాలు ఉండి ప్రయోజనమేమి?

అత్యాచారాలకు గురైన స్త్రీలకు వాళ్ల కొందు భాష తప్ప, తెలుగు అంతగా రాదు. వాళ్లు మనలాంటి వాళ్లను చూసి భయపడతారు. అబద్ధాలు అసలే చెప్పలేరు. వీరిని నిజాయితీగా నమ్మి, ఆగస్ట్ 20న ఉదయమే కూబింగ్‌కు వెళ్లిన పోలీసులు ఎవరన్నది ఎస్.పి. సభర్వాల్ దగ్గర వివరాలు ఉంటాయి. లేకపోయినా ఆయన తెలుసుకోవడం పెద్ద పనికాదు. కాని ఆయన తమ వాళ్లను రక్షించుకోవాలన్న ఉద్దేశ్యంతో, నిందితులను రక్షించుకోవాలనే ఉద్దేశ్యంతో అరెస్ట్ చేయడం లేదు. గతాన్ని పరిశీలిస్తే పోలీసులచే అత్యాచారాలకు గురైన మధుర, రమిజాబీ కేసులలో కూడా తమవారిని రక్షించుకోవాలనే చూసింది ప్రభుత్వం. ఇది కొత్తకాదు. చరిత్రలో జరుగుతున్నదే.

ఎస్.సి., ఎస్.టి. అత్యాచార నిరోధక చట్టం సభ్యులు సంఘటనా స్థలాన్ని సందర్శించినా ఇంతవరకు జరిగిన లబ్ధి ఏమీలేదు. ఏ కమిషన్లు అయినా ఎమో చేస్తాయన్న భ్రమలే కాని చేసింది ఏమీలేదు. కమిషన్ సంఘటనా స్థలానికి వెళ్లాల్సింది పోయి వారే నగరానికి వచ్చి మానవహక్కుల ఛైర్మన్‌కు చెప్పుకున్నా ఏమీ జరగలేదు. ఇది ప్రభుత్వానికీ, ఆదివాసుల నమ్మకానికీ సంబంధించిన సమస్య. చాలా సున్నితమైనది. వెంటనే పరిష్కరిస్తే మేలు. ◆

సామాజిక పరిణామాన్ని, అభివృద్ధి దశలను మార్క్సిజం ఎలా అర్థం చేసుకుంటుందో వివరిస్తున్నారు

**ఆర్.ఎస్. రావు**

# అభివృద్ధి - మార్క్సిస్ట్ దృక్పథం

*(గత రెండున్నర దశాబ్దాలలో 'అభివృద్ధి వెలుగు నీడలు' వ్యాసం ద్వారా, రాజకీయార్థిక పరిణామాలను చూసే ప్రత్యామ్నాయ దృష్టికోణాన్ని ప్రతిపాదించడం ద్వారా ఆర్.ఎస్.రావు లోతయిన, ఆలోచనాస్ఫోరకమైన విశ్లేషణలు ఎన్నో చేశారు. దాదాపు ఈ విశ్లేషణా క్రమం తొలిరోజుల్లోనే, 1981 చివరిలో కాకతీయ విశ్వవిద్యాలయం సామాజిక శాస్త్ర విభాగంలో 'సామాజిక అభివృద్ధి – ప్రత్యామ్నాయ దృక్పథాలు' అనే అంశంపై ఆయన చేసిన ప్రసంగానికి, అప్పుడు బి.ఎ. చదువుతుండిన ఒక విద్యార్థి తీసుకున్న నోట్స్ ఆధారంగా తయారయిన వ్యాసం ఇటీవల పాతకాగితాలలో దొరికింది. ఈ అభిప్రాయాలలో కొన్ని ఆ తర్వాత కాలంలో మరింతి పదునెక్కి, మరింత విస్తృతంగా వెలువడినప్పటికీ, చారిత్రక ప్రాధాన్యత దృష్ట్యా ఈ వ్యాసాన్ని అచ్చువేస్తున్నాం.*

*– సం.)*

"ప్రతి సమాజమూ కొన్ని దశలుగా అభివృద్ధి చెందుతుంది. ఒక ప్రత్యేకస్థానం నుంచి ఇంకో ప్రత్యేక స్థానానికి ప్రయాణం చేస్తుంది. ఈ పరిణామాన్ని మార్క్సిజం ఎట్లా వివరిస్తుందో చెప్పే ప్రయత్నం చేస్తాను" అంటూ సంబల్‌పూర్ యూనివర్సిటీ ఎకనమిక్స్ ప్రొఫెసర్ ఆర్.ఎస్.రావు 'అభివృద్ధి – మార్క్సిస్టు దృక్పథం' అనే అంశం మీద ఇచ్చిన ఉపన్యాసంలోని ముఖ్యాంశాలు

సమాజాభివృద్ధిలో ఉన్న వేరువేరు స్థానాల నుంచి భూస్వామ్య విధానం, పెట్టుబడిదారీ విధానం అనే రెండు స్థానాలను తీసుకుందాం. ప్రపంచ చరిత్రలో ప్రతిదేశమూ ఈ రెండు స్థానాలలో మొదటి స్థానం నుంచి రెండో స్థానానికి ప్రయాణం సాగించింది. భారతదేశం మాత్రం మొదటి స్థానం నుంచి తన ప్రయాణాన్ని ప్రారంభించి ఇంకా రెండో స్థానానికి చేరుకోలేకపోతోంది.

ఈ విషయం వివరంగా తెలుసుకోవడానికి భూస్వామ్య విధానం, పెట్టుబడిదారీ విధానం అనే ప్రాథమిక భావనలను అర్థం చేసుకోవాలి.

ప్రతి సమాజమూ మూడు అంశాల కలయిక. అవి 1) భూమి, 2) ప్రజలు, 3) సాధనాలు లేదా పనిముట్లు. అంటే ఏ సమాజంలోనైనా ప్రజలు భూమినీ, పనిముట్లనూ ఉపయోగించి ఉత్పత్తి సాగిస్తారు. తద్వారా జీవిస్తారు. అయితే ఈ ప్రజాజీవనానికవసరమైన ఉత్పత్తిని సాధించే భూమీ, పనిముట్లూ వివిధ రకాలుగా పంచబడి ఉండవచ్చు. ప్రజలు భూమినీ, పనిముట్లనూ పంచుకొనే అవకాశాలు మూడురకాలుగా ఉన్నాయి. అవి :

1. మొత్తం ప్రజలందరూ భూమినీ సాధనాలనూ ఉపయోగించి ఉత్పత్తి సాగిస్తారు. భూమిపైనా, సాధనాలపైనా సమష్టి యాజమాన్యం ఉంటుంది. ఉత్పత్తి మీద సమష్టి అజమాయిషీ ఉంటుంది.
2. ప్రజలు రెండు బృందాలుగా విడిపోతారు. భూమి ఒక బృందం అధీనంలో ఉంటుంది. సాధనాలు మరో బృందం అధీనంలో ఉంటాయి. అయితే ఉట్టి భూమిగానీ, సాధనాలు గానీ ఉత్పత్తి చేయలేవు గనుక ఈ రెండుబృందాలూ పరస్పరం సహకరించు కోవలసి వస్తుంది. సాధనాలపై యాజమాన్యం ఉన్న బృందం భూమిని స్వంత దార్లనుంచి కౌలుకు తీసుకొని ఉత్పత్తి కార్యక్రమం కొనసాగిస్తుంది. ప్రతిఫలంగా భూమి స్వంతదార్లకు కౌలు చెల్లిస్తుంది. ఈ విధానంలో
   ఉత్పత్తి = (ఒక బృందం అధీనంలో ఉన్న) భూమి + సాధనాలు + మరొక బృందం శ్రమశక్తి.
   ఇక్కడ ఉత్పత్తిని సాధించింది రెండో బృందం శ్రమశక్తి గనుక ఉత్పత్తి ఆ బృందానికే చెందుతుంది. ఆ బృందం మొత్తం ఉత్పత్తినీ తీసుకొని భూమి స్వంతదార్లకో, రాజులకో కౌలుగా కొంతభాగాన్ని చెల్లిస్తుంది. దీన్ని ఆర్థికేతర నిర్బంధం (ఎక్స్‌ట్రా – ఎకనమిక్ – కోయర్షన్) అంటారు. ఈ విధానంలో ఉత్పత్తిని కౌలు, స్వంతవాడకం అని రెండు రకాలుగా విభజించవచ్చు.
   ఈ విధానాన్నే భూస్వామ్య విధానం (ఫ్యూడలిజం) అంటారు.
3. మూడో విధానంలోనూ ప్రజలు రెండు బృందాలుగా విడివడి ఉంటారు. ఒక బృందం అధీనంలోనే భూమీ, సాధనాలూ ఉంటాయి. మరో బృందం ఏమీలేని నిరుపేదలుగా ఉంటారు. ఈ బృందం తప్పనిసరిగా తమ శ్రమశక్తిని అమ్ముకొని బతకవలసి వస్తుంది. ఈ బృందం తప్పనిసరిగా ఇతరుల భూమి మీద ఇతరుల సాధనాలుపయోగించి ఉత్పత్తి కార్యక్రమంలో పాల్గొనవలసిన స్థితికి నెట్టబడుతుంది. ప్రతిఫలంగా ఈ బృందానికి జీతం లేదా కూలి లభిస్తుంది.

ఈ విధానంలో మొత్తం ఉత్పత్తిని జీతాలు, లాభం అనే రెండు భాగాల కింద విభజించవచ్చు. జీతాలు పొందే బృందాన్ని శ్రామికులు అనీ, లాభం పొందే బృందాన్ని పెట్టుబడిదారులనీ పిలుస్తారు. ఈ విధానాన్ని పెట్టుబడిదారీ విధానం (క్యాపిటలిజం) అంటారు.

ఈ రెండు విధానాల్లోనూ సమాజం సమసమాజంగా ఉండదు. ఆస్తి మీద సొంత యాజమాన్యం అమలవుతూ ఉంటుంది. అందుకే ఈ అసమసమాజ యథాస్థితిని సమర్థించడానికి ఇంకో నిర్మాణం, ఇంకో వ్యవస్థ అవసరమవుతుంది. దాన్ని మార్క్సిస్ట్ పరిభాషలో ఉపరితలం

(సూపర్ స్ట్రక్చర్) అని పిలుస్తారు. ఈ ఉపరితలం అనబడే దానిలో రాజకీయ వ్యవస్థ, న్యాయ, తత్వశాస్త్రాలు, మతం, సాహిత్యం, కళాసాహిత్య విమర్శలు మొదలయినవి ఉంటాయి. పునాదిగా ఉండే భూస్వామ్య సంబంధాలనో, పెట్టుబడిదారీ సంబంధాలనో అంటే అసమ సమాజాన్ని ఈ ఉపరితలం కాపాడుతూ ఉంటుంది. ఆయా వ్యవస్థలకు అనుకూలమైన రాజకీయాలు, మతం, న్యాయ శాస్త్రం, సాహిత్యం, కళలు ప్రబలంగా ఉంటాయి.

అయితే మనం మొదటే చూసినట్టు ఈ వ్యవస్థలు రెండు వర్గాలుగా విడిపోయిన వ్యవస్థలు, అసమ సమాజాలు. అందుకే ఈ వ్యవస్థను సమర్థించే ఉపరితలంతో పాటే దానికి సమాంతరంగా మరో ఉపరితలం అభివృద్ధయ్యే అవకాశాలు ఈ వ్యవస్థలో సహజంగా ఉంటాయి. శ్రమించనివాడు లాభం పొందుతున్న వ్యవస్థ కొనసాగినంతకాలం ఆ సంస్కృతికి సమాంతరంగా శ్రామిక సంస్కృతి అభివృద్ధి చెందుతుంది. అంటే వ్యవస్థలో ఉన్న వైరుధ్యాల మూలంగా పాలక సంస్కృతికి సమాంతరంగా శ్రామిక సంస్కృతి అభివృద్ధి చెందుతుంది. ఈ వైరుధ్యాల తీవ్రత మీదనే సామాజిక పరిణామం ఆధారపడి ఉంటుంది. భూస్వామ్య వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థగా పరిణామం చెందాలంటే దానిలోని వైరుధ్యాలు తీవ్రతరం కావలసి ఉంటుంది.

ఈ పరిణామం భారతదేశంలో జరిగిందా లేదా చూడడానికి భూస్వామ్య విధానపు సాంఘిక స్వరూపాన్నీ, పెట్టుబడిదారీ విధానపు సాంఘిక స్వరూపాన్నీ పరిశీలించాలి.

భూస్వామ్య విధానంలో భూస్వామి, మధ్యతరగతి రైతు, చిన్నరైతు ఉంటారు. ఈ విధానంలో అమలయ్యే ఆర్థికవ్యవస్థను మధ్యతరగతి రైతాంగ ఆర్థికవ్యవస్థ (మిడిల్ – పీజెంట్ ఎకానమీ) అని పిలవవచ్చు. ఈ ఆర్థికవ్యవస్థ లక్షణాలు రెండు. 1) స్వంత వాడకం కోసం ఉత్పత్తి, 2) స్వయంగా శ్రమించడం. ఈ రెండు లక్షణాల సమ్మేళనం ఉత్పత్తి ప్రమాణం (యూనిట్ ఆఫ్ ప్రొడక్షన్) గా ఉంటుంది. భారతీయ సంస్కృతి ప్రధానంగా ఈ ఉత్పత్తి ప్రమాణం పై ఆధారపడిందే. కనుకనే భారతదేశం లో ఉన్న ఆర్థికవ్యవస్థను మధ్యతరగతి రైతాంగ ఆర్థికవ్యవస్థ అనిఅనవచ్చు.

పెట్టుబడిదారీ విధానంలో పెట్టుబడిదారు, శ్రామికుడు ఉంటారు. ఈ పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలో ఉత్పత్తి మారకం కోసం జరుగుతుంది. కూలికి శ్రమశక్తిని కొనుక్కోవడం అమలవుతుంది.

భూస్వామ్య వ్యవస్థనుంచి పెట్టుబడిదారీ వ్యవస్థ ఏర్పడుతుంది. అయితే సరాసరిగా భూస్వామి పెట్టుబడిదారుగానూ, మధ్యతరగతి రైతు శ్రామికుడుగానూ మారడం జరగదు. చరిత్రలో భూస్వాములు నశించిపోయారు. మధ్యతరగతి రైతాంగం విభజనకు గురైంది. ఒక భాగం ధనిక రైతాంగం గానూ, మరో భాగం పేద రైతాంగం గానూ మారిపోయింది. ఈ చర్య పెట్టుబడిదారీ పరిణామానికి దారితీసింది.

సమాజంలో ఉన్న వైరుధ్యాల మూలంగా సామాజిక వర్గాలమధ్య విభజన జరుగుతుంది. ఈ విభజన జరిగిన తీరు మీద సామాజిక పరిణామం ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు మన గ్రామీణ వ్యవస్థను ఐదు వర్గాలుగా విభజించవచ్చు : భూస్వామి, ధనికరైతు, మధ్యతరగతి రైతు, పేదరైతు, వ్యవసాయకూలీ.

ఈ ఐదు సామాజిక వర్గాల మధ్య రెండు రకాలుగా విభజన జరిగే అవకాశం ఉంది. మొదటిది, భూస్వామి బలీయంగా ఉంటే ధనిక రైతాంగం బలహీనంగా ఉంటుంది. మధ్యతరగతి రైతాంగం హెచ్చు సంఖ్యలో ఉంటుంది. పేదరైతాంగం తక్కువ సంఖ్యలో ఉంటుంది. వ్యవసాయ కూలీలు తక్కువగా ఉంటారు. ఈ పరిస్థితిలో భూస్వామి, మధ్యతరగతి రైతు ఒకవైపు, ధనికరైతు, చిన్నరైతు, వ్యవసాయ కూలీ మరోవైపు ఉండే విధంగా విభజన జరుగుతుంది.

రెండో పద్ధతిలో భూస్వామి ఉండడు, ధనిక రైతాంగం బలంగా ఉంటుంది. మధ్యతరగతి రైతాంగం తక్కువ సంఖ్యలో ఉంటుంది. పేద రైతాంగం, వ్యవసాయ కూలీలు హెచ్చుసంఖ్యలో ఉంటారు.

మనదేశంలో విభజన ఈ రెండు రకాలుగా జరుగుతున్నది. దేశం తూర్పుభాగంలో (బెంగాల్, ఒరిస్సా) పేద రైతులకు భూములు కౌలుకు తీసుకొని సాగుచేయడం లాభసాటిగా ఉన్నది. కాని పశ్చిమ భాగంలో (గుజరాత్, మహారాష్ట్ర) కౌలుకు సాగుచేయడం కంటే కూలికి పోవడమే లాభసాటిగా ఉన్నది. ఉదాహరణకు గుజరాత్‌లో పేదరైతు సంవత్సరాదాయం తొమ్మిది వందల రూపాయలుండగా, వ్యవసాయ కూలీ సంవత్సరాదాయం పన్నెండు వందల రూపాయలుంది. ఈ కారణం వల్లనే దేశం తూర్పు ప్రాంతంలో పేద రైతులు ధనిక రైతుల వద్దనుంచి భూమికౌలుకు తీసుకొని సాగుచేస్తూ ఉండగా, పశ్చిమ ప్రాంతంలో పేదరైతులు తమ భూమిని ధనికరైతులకు కౌలుకిచ్చి వ్యవసాయకూలీలుగా మారుతున్నారు. అంటే పశ్చిమప్రాంతంలో సామాజికవర్గాల మధ్య విభజన స్పష్టంగా జరుగుతున్నదన్నమాట. ఈ విభజన తూర్పు పశ్చిమా ల్లో వేరువేరు స్థాయిల్లో ఉన్నది. ఈ విభజనఎంత స్పష్టంగా, ఎంత వేగంగా జరిగితే సమాజం అంతగా ఒకదశ నుంచి, ఇంకో దశకు అభివృద్ధి చెందుతున్నట్టు భావించవచ్చు. కనుకనే పశ్చిమ ప్రాంతంలో జరుగుతున్న విభజనను ప్రగతిశీల విభజన అనీ, తూర్పు ప్రాంతంలో జరుగుతున్న విభజనను మందకొడి విభజన అనీ అనవచ్చు.

పారిశ్రామికీకరణ విభజనను త్వరితం చేస్తుంది. పారిశ్రామిక రంగం ఆవిర్భావంతో వ్యవసాయరంగం తన నుంచి కొందరు శ్రామికుల్ని వదిలి పెట్టుకోవలసి వస్తుంది. పారిశ్రామిక రంగంలో పనిచేస్తున్న వారి వినియోగం కోసం కూడా ఉత్పత్తి చేయవలసి వస్తుంది. అంటే సొంత వాడకం కోసం కాక మారకం కోసం ఉత్పత్తి చేయవలసి వస్తుంది. పారిశ్రామికీకరణ ఫలితాలు మూడు :

1) వ్యవసాయ రంగంలో శ్రామికుల ఉపసంహరణ

2) పారిశ్రామిక రంగంలో శ్రామికులకు గిరాకీ

3) డబ్బు ప్రవేశం

ఈ విధంగా సమాజంలో డబ్బు ప్రవేశించడం, పెట్టుబడి ప్రవేశించడం, పారిశ్రామికీకరణ జరగడం ప్రజల సాంస్కృతిక స్థాయి పెరగడానికి తోడ్పడుతుంది. అంటే విభజన హెచ్చుస్థాయిలో జరుగుతుంది.

భూస్వామి, మధ్యతరగతి రైతు ఒక కూటమిలో చేరుతారు. అయితే ఈ మిలాఖత్తు అభివృద్ధికి సంబంధించి మందకొడి అయినదే.

ధనికరైతు, చిన్నరైతు, వ్యవసాయకూలీ మరోవైపు సంఘటిత మవుతారు. ఈ ఐక్యత అభివృద్ధికి సంబంధించి ప్రగతిశీలమైనది.

బ్రిటిష్ పెట్టుబడి ప్రవేశంతోనే మనదేశంలో విభజన ప్రారంభ మైందనవచ్చు. ఐతే బ్రిటిష్ పెట్టుబడి ముడిసరుకులున్న సంస్థానాలలోనే ప్రవేశించింది, వాణిజ్య పంటలు పండడానికనువైన ప్రాంతాల్లోనే ప్రవేశించింది. ముడి సరుకులు లేని సంస్థానాలలో ప్రవేశించడం గురించి బ్రిటిష్ వాళ్లు ఆలోచించనే లేదు. ముడిసరుకులూ, వాణిజ్య పంటలూ

**వీక్షణం - సి.డి.ఆర్.సి. స్వల్పకాలిక ఉపకార వేతనాల సామాజిక పరిశోధనా ఫలితాల ప్రచురణ ప్రారంభిస్తూ సి.డి.ఆర్.సి. రాసిన ఉపోద్ఘాతం**

# ప్రత్యామ్నాయ సామాజిక పరిశోధన

వీక్షణం రాజకీయార్థిక మాసపత్రిక, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ (సి.డి.ఆర్.సి.) సంయుక్తంగా సామాజిక పరిశోధన కొరకు స్వల్పకాలిక ఉపకార వేతనాలను ప్రకటించిన విషయం మీకు తెలుసు. అసలు మేము ఈ ప్రయత్నం ఎందుకు చేయవలసి వచ్చింది? ప్రభుత్వం వైపునుంచీ, విశ్వవిద్యాలయాల వైపునుంచీ, స్వచ్ఛందసంస్థల వైపునుంచీ, ప్రచార సాధనాల వైపునుంచీ ఎంతో పరిశోధన జరుగుతుండగా మళ్లీ కొత్తగా మా ప్రయత్నం ఎందుకు? దీనిలో ప్రత్యేకత ఏమన్నా ఉన్నదా? మావంటి కృషి చేస్తున్నవారు మరికొందరు కూడ ఉండవచ్చు గాని మా కృషి ప్రత్యేకత ఏమిటో వివరించడం మా బాధ్యత.

ప్రత్యామ్నాయ సమాచార సేకరణ, ప్రత్యామ్నాయ విశ్లేషణ, ప్రత్యామ్నాయ పరిష్కార మార్గాల అన్వేషణ మా ప్రత్యేకత.

సమాచార సేకరణలో ఇప్పటివరకూ ప్రభుత్వ సంస్థలు లేదా జాతీయ, అంతర్జాతీయ ప్రభుత్వేతర సంస్థలు కృషి చేస్తున్నాయి. ప్రజాపక్షం వహించే ప్రగతిశీల మేధావులు, విశ్లేషకులు కూడ ప్రభుత్వ సంస్థలు ఇచ్చే సమాచారం పైననే ఆధారపడవలసి వస్తోంది. ప్రభుత్వం అనేదిఒక మహాయంత్రం గనుక ఒక్కొక్కసారి ఆ యంత్రంలోని వేర్వేరు మరలు పరస్పరం వ్యతిరేకించే, భిన్నంగా ఉండే సమాచారం ఇచ్చే అవకాశం ఉంటుంది గనుక, ప్రభుత్వ సమాచారంలోని భిన్నత్వాన్ని, ఖాళీలను వాడుకుని విశ్లేషించడం ఇంతవరకూ సాగుతోంది.

కాని ప్రభుత్వానికీ, ప్రజలకూ ఎడం అంతకంతకూ పెరిగిపోతున్న స్థితిలో ప్రభుత్వం ఇచ్చే సమాచారాన్ని యథాతథంగా నమ్మడం కష్టం.

---

విభజనను తీవ్రతరం చేశాయి. వ్యవసాయంలో కొత్తగా ప్రవేశించిన ఈ ప్రగతిశీల చర్యలను 'మధ్యతరగతి రైతాంగ ఆర్థికవ్యవస్థ' ప్రతిఘటించింది. ఈ ఆర్థికవ్యవస్థ సొంతవాడకం కోసం ఉత్పత్తి అనే ఉత్పత్తి ప్రమాణంమీద ఆధారపడి ఉంటుందని మనం ఇదివరకే చూశాం. అంటే ఈ ఆర్థికవ్యవస్థ సొంతవాడకం కన్న ఏ మాత్రపు అదనపు ఉత్పత్తినైనా చేయడానికి సిద్ధంగా ఉండదు. అందుకే హెచ్చు ఉత్పత్తిని సాధించే నూతన ప్రగతిశీల చర్యల పట్ల మధ్యతరగతి రైతాంగ ఆర్థిక వ్యవస్థ విముఖతను ప్రదర్శిస్తుంది. అదనపు నీటి పారుదల సౌకర్యాలు కల్పించడాన్ని వ్యతిరేకిస్తుంది. నీటిని తగినంతగా, సరిగ్గా ఉపయోగించు కోకపోవడం ఈ వ్యవస్థ సాధారణ లక్షణం. ప్రగతిశీల చర్యల పట్ల ఈ వ్యవస్థ చూపే ప్రతిఘటనకు మంచి ఉదాహరణ ఒరిస్సాలో జరిగింది. ఒక నదిపై ఆనకట్ట నిర్మించబోతున్నానని ప్రభుత్వం ప్రకటించగానే ఆనకట్ట నిర్మాణానికి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ఆందోళన జరిగింది. ఈ ఆందోళనకు భూస్వాములు నాయకత్వం వహించారు.

ఐతే వ్యవసాయంలో ఏ ప్రగతిశీల చర్య అయినా ధనిక రైతాంగానికి లాభదాయకంగా ఉంటుంది. అంటే చిన్న రైతుకు, వ్యవసాయ కూలీకి ప్రయోజనకరంగానే ఉంటుంది. ఈ విధంగా ప్రయోజనాల మధ్య వైరుధ్యం స్పష్టమవుతుంది. భూస్వాములు, మధ్య తరగతి రైతాంగం వ్యవసాయంలో అభివృద్ధిని అడ్డుకుంటూ ఉండగా ధనిక రైతాంగం, చిన్న రైతులు, వ్యవసాయ కూలీలు వ్యవసాయంలో అభివృద్ధిని కోరుకుంటూ ఉంటారు. ఐతే ఈ పరిణామం పెట్టుబడిదారీ విధానానికి దారితీసి చిన్న రైతునూ, వ్యవసాయ కూలీనీ వ్యవసాయం నుంచి బయటకు తోసివేస్తుంది.

ఐనా భూస్వామ్య విధానం కంటె పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి కరమైనది గనుక గ్రామీణప్రాంతాల్లో విభజన అనివార్యమూ, అవసరమూ అవుతుంది. విభజనవల్ల చిన్న రైతులూ, కూలీలూ వ్యవసాయరంగంలో పని పోగొట్టుకుంటారు. ఇటు చూస్తే పారిశ్రామిక రంగమేమో అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానం మీద ఆధారపడి ఉంటుంది గనుక నిపుణులుకాని ఈ శ్రామికులకు అదీ స్థానం ఇవ్వలేదు. ఆ విధంగా వాళ్లు సంఘటితంకాని పారిశ్రామికరంగానికి పోవలసివస్తుంది. వాళ్లు అసంఘటిత శ్రామిక శక్తిగా మారిపోతారు. ఈ చిన్న రైతుల, వ్యవసాయ కూలీల అభివృద్ధి మీదనే వ్యవసాయప్రగతి ఆధారపడి ఉంటోంది. వాళ్లకు అర్థంకాని, వాళ్లకు తెలియని ఆధునిక పారిశ్రామికరంగానికి వాళ్ల వలస నిరుపయోగమైనదే అవుతుంది. ఇటు వ్యవసాయరంగానికీ, అటు పారిశ్రామికరంగానికీ దూరమైన వాళ్లు రిక్షాలాగడం, హోటల్ పనులు, ఇతర చిల్లర వృత్తులు మొదలైన అసంఘటిత రంగంలో శ్రామికులుగా మారిపోతారు. వీళ్లను ఉపయోగించుకొని అభివృద్ధి సాధించడం ఎట్లా అన్నదే ఇవాళ ఆర్థికవ్యవస్థ ముందున్న సమస్య. వాళ్లకు తెలిసిన సాంకేతిక పరిజ్ఞానాన్ని, ప్రజల సాంకేతిక విజ్ఞానాన్ని (పీపుల్స్ టెక్నాలజీ) ఉపయోగించుకొని గ్రామీణాభివృద్ధినీ, దేశాభివృద్ధినీ సాధించడమే పరిష్కారం. అంటే ప్రజాసాంకేతిక విజ్ఞానానికి ప్రథమ, ప్రధానస్థానం ఇవ్వాలి. వాళ్ల విజ్ఞానం నుంచి ప్రారంభించి ప్రజలకు ఆధునిక సాంకేతిక విజ్ఞానం అందజెయ్యాలి. ఈ కృషిద్వారానే మనం ప్రజానీకంలో ఆధునిక సాంకేతికవిజ్ఞాన ప్రచారాన్నీ, తద్వారా అభివృద్ధినీ సాధించగలం. ప్రస్తుత ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలు ప్రజానీకపు అభివృద్ధికి ఉద్దేశించినవి కావు. మనదేశంలో ఏయే కార్యక్రమాలకు ప్రాముఖ్యాన్నివాలనేది మనం కాక బయటి శక్తులు నిర్ణయిస్తున్నాయి. నిపుణులు కాని కోట్లాది జనానికి పని దొరికే గంగా – కావేరీ నదుల సంగమ ప్రణాళిక ప్రపంచబ్యాంక్ దగ్గర ఒక దశాబ్దం నుండి పడి ఉన్నది. అదే ప్రపంచబ్యాంక్ ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించే మరెన్నో కర్మాగారాలకు రుణాలిచ్చింది. నదులసంగమ ప్రణాళిక అమలయితే కోట్లాది మందికి పని దొరకడమే కాక వాళ్లు కొన్ని సంవత్సరాల్లోనే సంఘటితమైన, చైతన్యవంతమైన శ్రామికవర్గంగా మారే అవకాశం కలుగుతుంది.

◆

రైతాంగం అనేక ఆపదలపాలై, నిరాశాపూరితమైన కష్ట పరిస్థితులలో ఉన్నారని, వీరికి తక్షణం సహాయం చేయవలసి ఉందని నివేదించారు **బద్దంయెల్లారెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామి**

# గద్వాల సంస్థానంలో అక్రమమైన పన్నులు

## ఆంధ్ర మహాసభ కార్యకారిణి సభ్యుల విచారణ రిపోర్ట్

26 మెహరు సన్ 1350 ఫసిలి (1941 ?)

గద్వాల సంస్థానపు రైతులు కొన్ని ఇబ్బందులను అక్రమపు పన్నుల గురించి దరఖాస్తు ఇచ్చి మా సహాయము కోరియుండిరి. వాటి నిజా నిజములను స్థానికముగా విచారించుటకై ఆంధ్రమహాసభాధ్యక్షుల ఆజ్ఞానుసారము కార్యనిర్వాహక వర్గపు సభ్యులిద్దరు పంపించబడిరి. స్థానిక విచారణాంతరము ఆ సభ్యులు ఒక వివరమైన రిపోర్టు చేసిరి. అందుపైన కార్యనిర్వాహక సభయందు ఆలోచించిన పిమ్మట సంస్థానాధీశురాలగు రాణీగారికిని సంస్థానపు అధికారులకును మా రిపోర్టు నకలుపంపి, ఈ ఇబ్బందులను దొలగించుటకై శ్రద్ధ కలిగింపవలయునని నిర్ణయింపబడియుండెను. కాని సంస్థానపు అధికారుల పక్షమున ఏ విధమైన పరిష్కారముగాని చేయబడినట్లు ఈ కార్యాలయమునకు తెలియనందున చ25 మెహరు సన్ 1350 ఫసలీ (1941 ?) నాటి కార్యనిర్వాహక సభయందు తిరిగి ఆలోచింపబడెను. ఎట్టకేలకు మ॥రా॥ రాణీ గారి సన్నిధికి ఈ సంగతి తెలిపి, కార్యనిర్వాహక సంస్థ సభ్యుల విచారణ రిపోర్టును ప్రచురింపవలెనని నిర్ణయింపబడెను. ఆ నిర్ణయాను సారము రిపోర్టు ప్రచురింపబడుచున్నది. కాని అయిజగ్రామపు స్థితి గతులు పౌజ్దారీ మొకద్దమాలు, గిరఫ్తారీలు మొదలగువాటిని గురించిన భాగము ఈ నివేదికనుండి ప్రస్తుతం తీసివేయబడుచున్నది. ఏమన ఇంత వరకు ఆ ఫౌజ్దారీ న్యాయస్థానములలో విచారణయందున్నది. ఈ సందర్భమున ఆ సంగతుల ప్రచురించుట భద్రకరముగా భావింపబడలేదు.

---

ప్రభుత్వం ఉద్దేశ్యపూర్వకంగానే అబద్ధపు సమాచారాన్ని ఇస్తుండవచ్చు, అర్ధసత్యాలను ఇస్తుండవచ్చు. అప్పుడు ప్రజల వైపునుంచి సమాచారాన్ని సేకరించడం ఒక ప్రత్యామ్నాయ కర్తవ్యమవుతుంది.

అందువల్లనే గత మూడు నాలుగు దశాబ్దాలలో ప్రజల వైపునుంచి నిజనిర్ధారణ సంఘాలు ఏర్పడడం, ప్రత్యామ్నాయ సమాచారాన్ని సేకరించి ప్రజల ముందు పెట్టడం అనే సంప్రదాయం పెరుగుతోంది. నిజనిర్ధారణ సంఘాలు బాధిత ప్రదేశాలకువెళ్లి, బాధిత వ్యక్తులను కలిసి మాట్లాడి వారి దగ్గరనుంచి సమాచారాన్ని రాబట్టి దాన్ని ప్రజలముందు ఉంచుతున్నాయి. ఆసమాచారం ఆధారంగా కొత్త విశ్లేషణలు చేస్తున్నాయి.

ఇటువంటి నిజనిర్ధారణ సంఘాల ఏర్పాటు బ్రిటిష్ వలసవాద పాలకులకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమక్రమంలోనే మొదలయింది. బ్రిటిష్ పాలకులు ఇచ్చే సమాచారం పూర్తిగా విశ్వసనీయం కాదన్న అభిప్రాయంతో ప్రజల వైపు నుంచి, ఉద్యమకారుల వైపు నుంచి సమాచారాన్ని సేకరించడం, ప్రచారంలోకి తేవడం మొదలయింది. ఆ సంప్రదాయమే 1960ల చివరినుంచీ మళ్లీ ఉనికిలోకి వచ్చి బలపడింది. ఏ సమస్యకయినా ప్రభుత్వం, అధికారవర్గాలు ప్రకటించే సమాచారం కన్న భిన్నమైన సమాచారం ఉంటుందనే ఆలోచన పెరిగింది.

ఆ సంప్రదాయాన్ని కొనసాగించడానికి, బలోపేతం చేసి, నిర్మాణయుతం చేయడానికి వీక్షణం – సి.డి.ఆర్.సి. స్వల్పకాలిక ఉపకారవేతనాల ద్వారా సామాజిక పరిశోధన కార్యక్రమాన్ని ప్రారంభించాయి. అనేక ప్రజా సమస్యలపై ప్రభుత్వం, పాలకులు, తీసుకుంటున్న వైఖరులకు భిన్నంగా, ప్రభుత్వం అందజేస్తున్న సమాచారానికి భిన్నంగా, ప్రజలలో, వాస్తవక్షేత్రంలో ఇతర సమాచారం ఉండవచ్చుననే ఉద్దేశ్యంతో, మనకు తెలిసినదానికన్న తెలియనిది ఎక్కువనే ఉద్దేశ్యంతో ఈ కృషిని ప్రారంభించాం.

గతంలో చెప్పినట్టు ఇటువంటి సమాచార సేకరణ కృషికి గురజాడ అప్పారావు 1880లలో కన్యాశుల్క ఆచారంమీద చేసిన పరిశోధన, బద్దం ఎల్లారెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామిలు 1941లో గద్వాల సంస్థానంలో పన్నులమీద జరిపిన పరిశోధన నమూనాలు. గురజాడ పరిశోధనలో స్వయంగా సంస్థానాధీశులే, అంటే రాజ్యమే, ఆపరిశోధనకు ఆదేశించింది గాని, బద్దం ఎల్లారెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామిల పరిశోధన రాజ్యం సహకారంతో జరిగినప్పటికీ, ప్రజలకోరికమీద, ప్రజల్లోకి వెళ్లి సమాచారం సేకరించి, రాజ్యానికి వ్యతిరేకమైన నిర్ధారణలువస్తే వాటిని కూడ ప్రకటించింది.

వీక్షణం – సి.డి.ఆర్.సి. సారథ్యంలో జరిగిన సామాజిక పరిశోధనా విశ్లేషణలు ప్రారంభించబోయేముందు, బద్దంఎల్లారెడ్డి, వట్టికోట ఆళ్వారుస్వామిలు సమర్పించిన నివేదికను పునర్ముద్రిస్తున్నాం. ఈ నివేదిక ఆంధ్రకేసరి మాసపత్రిక, వృష సంవత్సర భాద్రపదం (1941 అక్టోబర్ ?) సంచికలో మొదటిసారి అచ్చయింది.

– సం. ◆

- చిక్కేపల్లి రామచంద్రరావు

**మ.రా.రా. ఆంధ్రమహాసభాధ్యక్షుల వారి సన్నిధికి :** గద్వాల సంస్థానమువారు విరాళమను పేర అక్రమమైన పన్ను వసూలు చేయుచున్నారనియు రైతులు ఇట్టి పన్ను నిచ్చుటకు నిరాకరించి నందున వారిపైన ఫౌజ్దారి మొకద్దమాలు ఆరోపించి వివిధములగు ఒత్తిళ్లు వేసి దౌర్జన్యము చేయబడుచున్నదనియు ఆ సంస్థానమునకు చెందిన 'అయిజా' గ్రామపు రైతులు తమకష్టములను ఆంధ్రమహాసభ స్థాయిసంఘ కార్యాలయమునకు తంతిమాలమున తెల్పుకొనియుండిరి. అందుపైన గద్వాల 'అయిజా' గ్రామముల రైతుల ఇబ్బందుల నిజానిజములను విచారించుటకై తమరు చ 6 అర్దిబెహష్తు సన్ 1350 ఫసిలి (1941 ?) తేదిన మమ్ముల నియోగించియుంటిరి. తమ యాజ్ఞాను సారము మేము చ 7 అర్దిబెహష్తు నాడు హైదరాబాదు నుండి గద్వాలకు చేరి చ 7 అర్దిబెహష్తు నుండి 9 అర్ది బెహష్తు వరకు గద్వాల 'అయిజా' గ్రామములందు విడిది చేసి విచారణజర్పితిమి. మా విచారణ యందు వెల్లడియైన విషయములు ఈ కింది వివరింపబడుచున్నవి.

**విరాళము :** గద్వాల సంస్థానము 120 గ్రామాదుల 97 శివారు పల్లెలు ఈ విధముగా మొత్తము 217 గ్రామాలపైన వ్యాపించియున్నది. సంస్థాన ప్రభ్విణి శ్రీ ఆదిలక్ష్మమ్మగారు, ఈ సంస్థానమందు విరాళపుపన్నును ఖాల్సా ఇలాఖాలో లేనట్టి మరికొన్ని పన్నులను అక్రమముగా వసూలు చేయబడుచున్నవి. విరాళపుపన్ను కార్తీక మాసమందలి పూజపేరను, మాఘమాసమందలి దానములపేరను వ్యవసాయదారల వద్ద మాల్గుజారి పైకముపైనను ఆబ్కారిముస్తాజరులవద్ద ఆబ్కారి మహసూలు పైనను రు.1కి రు. 0-1-3 లెక్కచొప్పున వసూలు చేయబడుచున్నది. ఈ విరాళము మొట్టమొదటి రు.1కి రు. 0-0-6 చోప్పునను మరి కొంతకాలమునకు రు.0-0-9 తదుపరి రు. 0-1-0 ప్రస్తుతం రు.1కి 0-1-3 వరకు క్రమముగా పెంచి వసూలు చేయబడుచున్నది.

మాల్గుజారి పైకముపైన ఏటేట సుమారు 46,000 రూపాయలను, ఆబ్కారి వసూలు పైన ఏటేట సుమారు 36,000 రూపాయలను ఈ విధముగా మొత్తము 82,000 రూపాయలు విరాళపు ఆదాయము వచ్చుచున్నది.

మాల్గుజారి పైకముపైన ఏటేట వసూలు చేయపడుచున్న 46,000 రూపాయల ఆదాయము మాత్రమే లెక్కలలో లెక్కించబడుచున్నది. ఇక దాని ఖర్చు సంగతి రు. 46,000 నుండి కార్తీకమాసమందు సుమారు రు. 20,000 లును మాఘమాసమందు సుమారు రు. 25,000లును ఖర్చు చేయబడుచున్నట్లు సంస్థానపు లెక్కలలో రాయబడుచుండునని తెలిసినది. కాని వాస్తవములో ఆ సమయములందు రు. 15,000 నుండి 20,000 ల వరకు మాత్రమే ఖర్చుపెట్టబడును. ఈ సంవత్సరము కార్తీక మాఘములంధును, 15,000 వెయిలే వెచ్చింపబడిన పనియును తెల్సినది. ఏటేట యిరువదివేలు ఈ విషయమున ఖర్చుచేయ బడుచున్నవనియు వొప్పుకొన్నను ఇంకను రు. 26,000 విరాళపు ఆదాయము ప్రతిసంవత్సరము మిగులుచున్నది. గద్వాల సంస్థానపు రైతులు నేటికి 15 సంవత్సరముల కిందట విరాళము మున్నగు అక్రమపు పన్నుల విషయమై సర్కారెఆలీ మాలు అధికారుల వద్ద మొరపెట్టుకొని యుండిరి. బందోబస్తు జర్గుపర్యంతము ఈ పన్నులు వసూలు చేయవచ్చుననియు బందోబస్తు అనంతరము అక్రమపు పన్నులు ఆపివేయ బడవలసినవనియు సర్కారెఆలీ ప్రభుత్వము తీర్మానించినట్లు సన్ 1337 ఫసలి (1928 ?) కోర్టు ఆఫ్ వార్డ్సు బజటు నోటువలన తెలియుచున్నది.

బందోబస్తు జరిగి సన్ 1348 ఫసిలి (1939 ?) లో ప్రకటింపబడి సన్ 1349 ఫసిలి (1940 ?) నుండి ఆచరణకు వచ్చినది. దానిని బట్టి మాల్గుజారి పైకమును రు.1కి 0-1-0 చొప్పున లోకల్ఫండు పన్నును ఈ రెండు మాత్రమే వసూలు చేయబడవలసి యుండెను. పూర్వపు అక్రమపుపన్నులు ఆపివేయబడవలసి యుండెను. లోకల్ఫండు పన్ను చట్టముననుసరించి వసూలు చేయదగినదిగదాయని వసూలు చేబడుచునేయున్నది. కాని ఆ పూర్వపు అక్రమ పన్నులు మాత్రము ఆపివేయబడలేదు. పూజాదానముల పేర ఒక ప్రత్యేకపుపన్ను ఆరోపించి వసూలు చేయుట అక్రమమును అన్యాయమూలకమునై యున్నది.

**నుజూల్ :** నుజూల్ ఇండ్లపన్ను వంటిది. ఇది సంస్థానమందంతట అన్ని గ్రామములందును ప్రతి ఇంటిపైన వసూలు చేయబడుచున్నది. ఇంటి స్థలములపైన గజము 1కి రు. 0-1-0 చొప్పున దీనిరేటు కాని కొన్ని గ్రామాలందు స్థలములను బట్టికాక పూర్వమునుండి, యేర్పాటు అయిన పైకము వసూలు చేయబడుచున్నది. దాని రేటు ఇల్లు ఒక్కంటికి రు. 1-0-0 మొదలుకొని రు.3-0-0 వరకు వున్నది. కూలినాలి చేసి జీవించు బీదలగు నిమ్నజాతులగు వారివద్దగూడ ఈ పన్ను వసూలు చేయబడుచున్నది. గ్రామకంతములో పెరటు భూములందున్న గడ్డి కొట్టములపైన, పశ్వుల కొట్టముపైన గూడా ఈ విధముగానే వసూలు చేయబడుచున్నది. సర్కారెఆలీ యొక్క బందోబస్తు శాఖ బందోబస్తు పిమ్మట కొన్ని గ్రామాలందు ఇట్టి కొట్టముల ప్రదేశములను 'మాఫీ పెరడు'గా నిర్ణయించి వాటిపైన 0-2-0, 0-3-0, 0-4-0 పన్ను విధించినది కాని సంస్థానపువారు ఆ నిర్ణయంనుపేక్షించి యదేష్టముగా అదనపుపన్ను విధించి వసూలు చేయుచున్నారు. దాని పరిమాణము కొట్టము ఒక్కంటికి రు.5-0-0 వరకు పెర్గిపోయినది. నుజూల్ పన్ను సర్కారెఆలీ ఇలాకాయందు వాడుకలోలేదు. కాబట్టి ఈ పన్నుగూడ చట్టమునకు విరుద్ధమైనది.

**సీనుబంచరాయి :** ఈ పన్ను సన్ 1340 ఫసిలీ (1931 ?)కి పూర్వము రాజ్యమందంతటను వ్యవసాయదారుల వద్ద వసూలు చేయబడుచుండెను. కాని వ్యవసాయ దారుల ఆర్థిక దుస్థితిని గమనించి సర్కారెఆలీ ప్రభుత్వమువారు సన్ 1340 ఫసిలి (1931 ?)లో ఈ పన్నును తొలగించి ఖాల్సా గైరుఖాల్సా ఇలాకాలలో దీనిని వసూలు చేయకుండుటకై సర్వసాధారణమైన ఆజ్ఞల నిచ్చియుండిరి. కాని గద్వాల సంస్థానమందు ఆవు, యెద్దు, పడ్డలకు శాల్తి వక్కంటికి రు. 0-1-0 బర్లకు శాల్తి 1కి రు. 0-7-0 గొర్లకు 100కి రు. 5-0-0, మేకలకు 200కి రు 75-0-0 వసూలు చేయబడుచున్నవి. గ్రామపు శివారులో బంచరాయి భూమివున్నను లేకున్నను ఈ విధముగనే వసూలు చేయుచున్నారు. ఖాల్సా ఇలాకాలలో గాయరాన్ భూమివున్న గ్రామములందు మాత్రమే బంచరాయిపన్ను శాల్తి 1కి రు. 0-0-4 చొప్పున వసూలు చేయబడును కాని ఈ సంస్థానమందు గొర్లపైన

100కి రు. 2-14-8 మేకలకు రు. 22-14-8 ఖాల్లాకంటే అధికముగా వసూలు చేయబడుచున్నది.

**ఆయా గల్లా :** ఈ సంస్థానమందు ఇంటి ఒక్కంటికి శే॥1 మొదలుకొని శే॥3 వరకు వడ్లుగాని, జొన్నలుగాని ఏర్పాటు ననుసరించి వసూలు చేయబడుచున్నవి. బందోబస్తు సున్‌రాయి అనంతరము కొన్ని గ్రామములందు ఇది ఆగిపోయింది. అయనను పెక్కు గ్రామములందు ఇంకను వసూలు చేయబడుచునేయున్నది.

**ఏనుగు చొప్ప :** ఈ పన్ను ఏనుగుచొప్ప అను పేర బిలువబడుటకు కారణమిట్లు చెప్పుదురు. పూర్వము సంస్థానాధిపతివద్ద ఏనుగులుంటు వుండెనట. ఆ కాలమున వాటి మేతిపేర అన్ని గ్రామాములందు వ్యవసాయదారుల వద్ద చొప్ప వసూలుచేయుట మొదలయ్యెను. తర్వాత ఏనుగులు లేకుండా పోయినను చొప్ప మాత్రము వసూలు చేయుబడుచున్నది. అది సంస్థానాధిపతి యొక్క యెడ్ల ఆవులమేతకక్కర వచ్చుచున్నది. బందోబస్తు సున్‌వాయి అనంతరము కొన్ని గ్రామములందు ఇది ఆగిపోయినట్లు తెలిసినది. కాని ఇంకను పెక్కు గ్రామములందు వసూలు చేయబడుచున్నది.

ఇట్టి అక్రమపు పన్నులు మిక్కిలి కఠినముగా వసూలు చేయబడుచున్నవి. ఈ అక్రమపు పన్నుల విషయము బహుకాలము నుండి ప్రజలకు సంస్థానము మధ్య ఘర్షణ సాగుచున్నట్లు తెలిసినది. ఒకటి రెండుసార్లు ఇట్టి అక్రమపు పన్నును గురించి సంస్థానపు రైతులు సర్కారైఆలీ ప్రభుత్వమునకు మొరపెట్టుకొనియుండిరి. ఇట్లు మొరపెట్టు కొనుటయందు ఎక్కువగా పాటుపడినవారిపైన పౌజ్దారి వ్యాజ్యెములు వేసి వారికి బేడీలు పెట్టి వీథులవెంట తిప్పించబడెను. శిక్షలివ్వబడెను. ఇంకను ఇతర మార్గముల ఒత్తిడివేసి వారిని పరిపరివిధములగు కష్టములపాలు చేయబడెను. ఇంతటితో పోలేదు, ఎవడైన సంస్థానపువారి కోరికలను (సంస్థానపు భృత్యులకోరికలుగాని) పూర్త చేయనియెడల వాడు ఆపదలకు గురియగుచున్నాడు. ఎట్లన గౌరవనీయులును ముఖ్యులునైన కొందరు జనులను తిట్లతో గౌరవించుటయే కాక దెబ్బలు కూడా కొట్టబడెను. ఇక సామాన్య ప్రజల విషయము చెప్పనేల.

ఈ సంస్థానమందు సుమారు నూరుగురు వ్యక్తులతో కూడిన వక సైన్యముకూడా కలదు. వాస్తవములో వీరందరు సంస్థానపు సేవకులు (శావకపువాండ్లు) స్వేచ్ఛతో సంచరించు రైతులను గౌరవస్తులను అణచుటకొరకే ఈ సైన్యము యేర్పడియున్నది. ఎప్పుడైనను రైతులు అక్రమపు పన్నుల నిచ్చుటకు నిరాకరించినయెడల సంస్థానపు అధికారులు ఈ దండును పోలీసును వెంటబెట్టుకొని గ్రామములందు వివిధములగు దౌర్జన్యములు చేయుచు పన్నులు వసూలు చేసుకొందురు. శ్రీ సర్వారెడ్డిగారు ఈ సైన్యమునకు నాయకుడని పేరు గావించియున్నారు. ఈ మధ్యనే వీరికి మాల్ మదదుగారు అధికారము గూడా ఇవ్వబడింది. వీరు విరాళము మొదలగు అక్రమపు పన్నులను 28 సంవత్సరముల నుండి వచ్చుచున్న సుమారు రు. 20,00,000 బకాయయున్ను మిక్కిలి కఠినముగా నిర్దాక్షిణ్యముగను వసూలు చేయు సామర్థ్యము కలిగియున్నారనియు అందువలన వారికి మాల్ అధికారములు ఇవ్వబడినవనియు తలంపబడుచున్నది. అదిగాక వీరు సంస్థానపురాణి గారికి మరది. వీరి నిరంకుశత్వమునకు మేరయేలేదు. వీరిదే ప్రభుత్వము, వీరిపైన నెట్టి ప్రతిబంధకంలేదు. సంస్థానాధిపతి చుట్టములనేకులిచట గలరు. వారు రాజబాంధవులనబడుదురు. ప్రజలపైన వీరందరి నిరంకుశత్వము నిరభ్యంతరంగా సాగుచుండును. ఇట్టి పరిస్థితులందు లంచగొండితనమూ మేర మీరిపోవుట ఆశ్చర్యముగాదు.

ఈ సంస్థానమందు పోలీసు మొహతమీముగూడగలడు. సంస్థానమునకు జిల్లా నిజామతువరకు అదాలతు అధికారములున్నవి. గద్వాలలో వొక మున్సిపు ఒక అదాలతుజిల్లా నాజిం వున్నారు. ఈ పదవులపైన సంస్థానమువారు తామే ఎవరినైన నియమించి హైకోర్టు అంగీకారము పొందుదురు. ఈ యేర్పాటు మొట్టమొదట ఒకటి రెండు సంవత్సరముల కొరకు చేయుదురు. అందువలన న్యాయాధికారులు స్వేచ్ఛగా పనిచేయుటకవకాశముండదు. సంస్థానమువారి అభిప్రాయాను సారము జరిగించని యెడల నిర్ణీతకాలము పూర్తి అయిన వెంటనే వారు తొలగింపబడి వారి స్థానమున కొత్తవారు నియమింపబడుదురు. ఇందు వలన సంస్థానమువారి అభిప్రాయానుసారము పనిజర్పుటకు వారు నిర్బంధితులు కావలసివచ్చుచున్నది. అట్టి రూపమునందే వారి ఉద్యోగకాలము పొడిగింపబడును.

**దవాఖానా :** రెండువందల గ్రామాదులుగల గొప్ప సంస్థానములో ఒక ఔషధాల యము మాత్రమే గద్వాల కేంద్రమునందున్నది. ఈ ఔషధాలయమునందు సామాన్యమైన టించరు, తలనొప్పి, కడుపునొప్పి మందులు తప్ప ఇతరౌషధములు లేవియు యుండవని రైతులు యుపక్రాశం, సంస్థాన గ్రామములందు బొగ్గరోగములు (ప్లేగు) విస్తారముగా వ్యాపించినప్పటికి యెవరో కొందరికి టీకాలు వేయుటతప్ప ఇంకే ఏర్పాట్లు గాని చికిత్సాను కూల్యములు గాని లభింపవు. కొన్ని గ్రామములందు అట్టి టీకాల యేర్పాటు కూడా లేకుండెనని తెలిసినది. ఔషధములు సమకూర్చ బడకుండుటయే దీనికి కారణము కావచ్చును. అట్టి స్థితియందు డాక్టరు మాత్రం మేమి చేయును.

**రోడ్లు :** గద్వాల స్టేషన్ నుండి గద్వాల గ్రామంవరకు ఒక మైలు పొడవునను గ్రామం నుండి సంస్థానపు బంగ్లా (క్రిష్ణా నదీతీరము) వరకు మూడు మైళ్ల పొడవునను రోడ్డుగలదు, ఈ రెండు రోడ్లు తప్ప ఇంత పెద్ద విశాలమగు సంస్థానములో వేరే రోడ్డు ఏదియులేదు. గద్వాలనుండి రాయచూరు వరకు పక్కా పడకు వేయుటకు సర్కారైఆలీ ప్రభుత్వము ఆలోచించుచున్నదనియు అందు సంస్థానపు ఇలాకా యెంతగలదో దాని ఖర్చును భరించుటకై సంస్థానము నడుగబడుచున్నదనియు సంస్థానము దానికిష్టపడలేదనియు తెల్సినది.

**టోల్ టెక్సు :** గద్వాలలో టోల్‌టెక్సుగూడా నున్నది. అది బండి యొక్కంటికి 0-4-0 చొప్పున వసూలు చేయబడుచున్నది. దానివలన వ్యవసాయ దారులకు చాలా ఇబ్బందిగానున్నది. ఖాళీబండ్లపైన పన్ను తీసుకొనగూడ నప్పటికీ ఇచ్చట ఖాళీ బండ్లపైనగూడ పన్ను వసూలుచేయబడుచున్నది. ఒంటెద్దు బండికిని ఝట్కాకును సంవత్సరం 1కి రు. 7-4-0 రెండెడ్లబండిపై సంవత్సరం 1కి 4-8-0 వసూలు చేయబడుచున్నది. టోల్‌గేటు దాటి తిరిగి లోపటికి వచ్చినను పన్ను చెల్లింపవలసి వచ్చుచున్నది. అట్లె అమ్మకము కొరకు వచ్చు పశ్వులపైన శాల్తి 1కి రు. 0-1-0 మేకలు గొర్లకు శాల్తి 1కి 0-1-0 తీసుకొందురనియు తట్టతో కూరగాయలు అమ్మకొను వారివద్ద గూడా

*(మిగతా 51వ పేజీలో...)*

**వలస వెళ్లే కార్మికుల ద్వారా వచ్చే ఆదాయంతో లాభపడదామనే తప్ప, వారి కష్ట, నష్టాలకు అక్కడా ఇక్కడా ఏ ప్రభుత్వాలు బాధ్యతపడడం లేదని అంటున్నారు వై. రామచంద్రం**

# ఎండమావులవుతున్న వలస బతుకులు

మన రాష్ట్రంనుంచి గల్ఫ్‌దేశాలకు వలసవెళ్లడం స్వాతంత్ర్యానికి పూర్వమే ఉంది. బ్రిటిష్ పాలనాసమయంలో కోస్తాంధ్ర నుంచి కార్మికులు బర్మా, మలేషియా దేశాలకు వలస వెళ్లేవారు.

1991లో వచ్చిన నూతన ఆర్థిక విధానాల ఫలితంగా అప్పటివరకు అరకొరగా సాగుతున్న కులవృత్తులు, కుటీర పరిశ్రమలు, వ్యవసాయరంగం మీద ఆధారపడి బతుకుతున్న ప్రజలను రెక్కలు విరిచి అడుక్కునేలా చేసింది. భూమికి సాగునీరు లేకపోవడం, నిరుద్యోగం వల్ల తాము పుట్టిపెరిగిన ప్రాంతాల నుండి దేశంలోని ఇతర ప్రాంతాలకు, గల్ఫ్‌దేశాలకు వలస పోయే పరిస్థితి ఏర్పడింది. నిస్సహాయ స్థితిలో ఉన్న ప్రజలను గల్ఫ్‌దేశాలకు పంపిస్తామని ఏజెంట్లు ఆశ చూపి అక్కడ నెలకు పదివేల నుంచి పదిహేను వేలు సంపాదించుకోవచ్చని మాయ మాటలు చెప్పి విజిటింగ్ వీసాకు 70 నుండి 80 వేల వరకు, కంపెనీ వీసా అయితే లక్షకు పైగానే ముందే వసూలు చేస్తారు. ముందు డబ్బులు ఇచ్చి వాళ్ల చుట్టూ తిరిగి మోసపోయిన వాళ్లు ఎందరో ఉన్నారు. ఒకవేళ అన్నీ అనుకూలించి వెళితే అక్కడ దిగిన తరువాత వచ్చింది విజిట్ వీసా అని తెలుస్తుంది. దాంతో నిర్ఘాంతపోయి వచ్చేముందు భూమి కుదువపెట్టి ఎక్కువ వడ్డీలకు తెచ్చిన అప్పు గుర్తుకు వచ్చి కండ్లల్ల నీళ్లు తిరుగుతుంటే తమాయించుకొని, అక్కడ ఇదివరకే ఇలాంటి బాధల బారిన పడిన మిత్రుల దగ్గరికి చేరడం జరుగుతోంది. విజిట్ వీసా మీద పోయినవారు అరవై రోజుల్లో తమ దేశాలకు తిరిగివెళ్లాలి. అక్కడే ఉంటే ఆ దేశచట్టాలు అక్రమ వలసదారులుగా భావించి జైళ్లలో వేస్తారు. గడువు ముగిసినప్పటి నుండి అభద్రతా భావంతో అక్కడి అధికారుల కంటపడకుండా దూరప్రాంతాల్లో భయంభయంగా తమ బతుకులను అడ్డాకూలీలుగా వెళ్లదీస్తున్నారు. పని చేసే క్రమంలో జరుగుతున్న ప్రమాదాలకు, అసహజ మరణాలకు అక్కడి ప్రభుత్వం, కాంట్రాక్టర్లు బాధ్యత వహించరు. తోటి స్నేహితులు ప్రమాదం జరిగి రక్తపు మడుగులో పడి ఉన్నా, వాళ్లను హాస్పిటల్‌కు తీసుకుపోయే పరిస్థితి లేదు. ఎందుకంటే వారు కల్లివెల్లి (వీసా కాలపరిమితి ముగిసిన కార్మికులు)లో ఉన్నారు కాబట్టి ఎక్కువ మాట్లాడితే జైల్లో వేస్తారనే భయంతో అక్కడి నుండి వీలైనంత త్వరగా వెళ్లిపోయే హృదయవిదారకమైన పరిస్థితులు ఉన్నాయి.

కంపెనీ వీసామీద వెళ్లినవారు అక్కడికి వెళ్లేదాకా వారు ఏ పని చేయాలో చెప్పరు. జీతం వివరాలు చెప్పరు. తీరా అక్కడికి వెళ్లిన తరువాత వాళ్లు చేసే పనికి వాళ్లకు అందుతున్న జీతాలకు సంబంధం ఉండదు. రోజుకు పన్నెండు గంటలు 50 నుండి 60 డిగ్రీల సెంటిగ్రేడ్‌ల ఎండవేడిలో పని చేస్తే వాళ్లకు అందుతున్నది నెలకు అయిదు నుండి ఆరు వేలు మాత్రమే. కొద్ది మందినయితే ఎడారి ప్రాంతాలలో గొర్లు, ఒంటెల కాపర్లుగా ఉంచి వారికి నెలరోజుల వరకు మనుషులతోని ఎటువంటి సంబంధం ఉండని స్థలాల్లో ఉంచుతారు. వారికి రోజుకు ఆహారం కింద రొట్టెలు, కర్జూర పండ్లు రెండు, మూడు రోజులకు సరిపడే విధంగా ఒకేసారి ఇస్తుంటారు. దేశంకాని దేశంలో మనుషులతో సంబంధం లేక మానసిక వేదనను ఎంతో మంది అనుభవిస్తున్నారు. రాయలసీమ, ఉత్తరాంధ్ర నుంచి ఇళ్లలో పనిచేసే వాళ్లుగా స్త్రీలు వెళుతున్నారు. వాళ్లు అక్కడ సెక్స్‌వర్కర్లుగా మారిపోతున్న దౌర్భాగ్యమైన పరిస్థితి ఉంది.

భవననిర్మాణ రంగంలో పనిచేస్తున్న కార్మికులకు ప్రమాదాలు జరిగినప్పుడు, మరణించినప్పుడు అంతర్జాతీయ కార్మిక చట్టాల ప్రకారం నడుచుకోవడం లేదు. దీనికి నమూనాగా బహ్రెయిన్ టవర్స్ కన్‌స్ట్రక్షన్స్ కంపెనీ బహ్రెయిన్ రాజధాని మనామా పట్టణానికి దగ్గరలోని ఒక ఇంటి నిర్మాణాన్ని చేపట్టింది. తొంభై శాతం పని పూర్తయి రెండవ అంతస్తులో పనిచేస్తున్న మొహిసిన్ మహ్మద్ కాలుజారిపడి తలపగిలి చనిపోయాడు. మొహిసిన్‌ను 'గుర్తుతెలియని' వ్యక్తిగా అక్కడే ఖననం చేయాలనే ప్రయత్నంలో ఆ కంపెనీ ఉండగా, ఆంధ్రప్రదేశ్ నుండి వ్యాపారరీత్యా వెళ్లిన రుద్రశంకర్ మొహిసిన్ విషయం తెలిసి అతని బంధువు, అక్కడి మరొక కార్మికునితో కలిసి కంపెనీ యజమానుల దగ్గరకి వెళ్లారు. వెళ్లగానే ఎందుకొచ్చారని అరబ్బీ భాషలో అడగ్గా శంశుద్దీన్ జవాబు చెప్పబోతుంటే 'మీరు చెప్పేది నేను ఏమీ వినదలచుకోలేదు. ఇక్కడి నుండి వెళ్లిపొమ్మని' చాలా బెదిరింపు ధోరణితో అన్నారు. 'మీ కంపెనీలో కార్మికుడు పనిచేస్తూ చనిపోయాడు, బాధ్యత వహిస్తారా లేదా?' అని అడగడం, ఆ కార్మికుడి మీద ఆధారపడ్డ కుటుంబ పరిస్థితి గురించి చెప్పినప్పుడు కంపెనీ బాధ్యత వహించి అన్ని

చట్టపరమైన నిబంధనలు పాటిస్తామని యాజమాన్యం ఒప్పుకోవడం జరిగింది. డెత్ క్లియరెన్స్ కోసం భారత ఎంబసీలో అప్లికేషన్ పెట్టారు. భారత తెలుగు సంఘం అధ్యక్షున్ని కలిసి సి.ఐ.డి. రిపోర్ట్ తీసుకున్నారు. బిల్డింగ్ రెండవ అంతస్తు నుండి పడి చనిపోయినట్లుగా ఉంది. దీన్ని ఆధారం చేసుకొని అతికష్టంమీద కంపెనీనుండి రావలసిన సదుపాయాలను రాబట్టి, బంధుమిత్రుల సహాయంతో శవాన్ని సొంతగ్రామం ఆదిలాబాద్ జిల్లా మంజులాపూర్ పంపించారు.

కళ్లివెళ్లి అయిన కార్మికులు పనిచేస్తూ ప్రమాదవశాత్తు చనిపోయినప్పుడు అక్కడి ప్రభుత్వాలు కాని, ఇక్కడి ప్రభుత్వం కాని కనీసం చనిపోయినవారి మృతదేహాలను స్వగ్రామాలకు చేర్చకుండా, గుర్తు తెలియని శవాలుగా చెప్పి రెండు నెలల తరువాత సంబంధీకులు ఎవరూ రాకపోతే అక్కడి పోలీసు సిబ్బంది అక్కడే ఖననం చేస్తారు. ఇది చూసిన తోటి కార్మికులు మానవతా దృక్పథంతో కొంత ఆర్థిక సహాయం చేసి నలుగురి మృతదేహాలను వారి వారి స్వంత గ్రామాలకు చేరవేశారు. ఇక్కడ సమస్యలు ఇలా ఉంటే వీసా కాలపరిమితి ముగిసిన వారిని పంపించడానికి ప్రతి అయిదారు సంవత్సరాలకు ఒకసారి అక్కడి ప్రభుత్వాలు 'ఔట్' ప్రకటిస్తాయి. ఆ విధంగా ఇటీవలే దుబాయ్ ప్రభుత్వం ఔట్ ప్రకటించింది. ఇది అక్కడ చట్ట వ్యతిరేకంగా ఉంటున్న వాళ్లు ఎలాంటి జైలుశిక్షలు లేకుండా వారివారి దేశాలకు వెళ్లడానికి అక్కడి ప్రభుత్వం కల్పిస్తున్న క్షమాభిక్ష. ఈసారి కూడా జూన్ 3 నుండి సెప్టెంబర్ 3 వరకు తిరిగి వెళ్లిపోవడానికి గడువు విధించింది. ఆ గడువును నవంబర్ 3 వరకూ పెంచింది. దుబాయ్‌లోని విజిట్ వీసాపై వచ్చి పనిచేస్తున్న వాళ్లు ఈ వార్తవిని తీసుకొచ్చిన అప్పుతీరక మానసికంగా కృంగిపోతున్నారు. విజిట్ వీసా మీద మన రాష్ట్రంనుంచి ఎనభై వేల మందివరకు వెళ్లారు. అందులో తెలంగాణ జిల్లాలైన కరీంనగర్, నిజామాబాద్, వరంగల్‌కు చెందిన వారే ఎక్కువమంది ఉన్నారు. 'ఔట్' ప్రకటించడాన్ని ఆధారం చేసుకొని అక్కడి కంపెనీలు కళ్లివెళ్లి కార్మికులకు రావలసిన డబ్బులు ఎగవేస్తున్నారు.

ఇతర దేశాల్లో ఇన్ని ఇబ్బందులను ఎదుర్కొంటున్న ఆంధ్రప్రదేశ్ కార్మికులకు ప్రభుత్వం ఉచిత రవాణా సదుపాయం కల్పించి ఆదుకోవాల్సి ఉండగా, అన్ని ఏర్పాట్లు చేస్తామని పత్రికా ప్రకటనలకు పరిమితమై ఆచరణలో 150 నుండి 200 మందికి మాత్రమే ఉచిత సౌకర్యం కల్పించారు. మన పక్క రాష్ట్రాలైన కేరళ, తమిళనాడు ప్రభుత్వాలు వారి గల్ఫ్ బాధిత ప్రజలకు ఉచిత రవాణా సౌకర్యం కల్పించారు. మన రాష్ట్రం నుండి గల్ఫ్‌కు వెళ్లిన వాళ్లు పదిలక్షలకు పైబడి ఉన్నారు. వీరిలో 70 శాతం మంది నిరక్షరాస్యులు. అక్కడ తెలుగు వాళ్లకు కంపెనీలతో వచ్చే ఇబ్బందులను భారత ప్రభుత్వం ఎంబసీకి విన్నవించుకుందామంటే అక్కడ ఉండే అధికారులు అంతా కేరళకు చెందిన వారు కావడం వల్ల భాషా పరంగా ఇబ్బంది ఎదుర్కొంటున్నారు. వీరి అభ్యర్థనలను కనీసం వినేవారు లేక అవస్థ పడుతున్నారు. రెండు మూడు నెలలు పనిచేసిన డబ్బులతో టిక్కెట్ కొనుక్కొని ఇంటికి వస్తే, ఇంట్లో బాధ చూసి తట్టుకోలేక నెల రోజుల వ్యవధిలోనే పదిహేను మంది చనిపోయారు.

ఉన్న ఊర్లో సంవత్సరాల తరబడి ఉపాధి లేక, కుటుంబ పోషణ భారమై ఇతర దేశాలకు వలసవెళ్లి, చేసిన అప్పులు తీరేవరకు అక్కడే అష్టకష్టాలు పడుతూ ఉండి, చేతిలో కొంత డబ్బు పోగుచేసుకొని తిరిగి స్వగ్రామం వచ్చేసరికి కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నమవుతున్న పరిస్థితి ప్రతి గ్రామంలోనూ ఉంది. గల్ఫ్ నుండి తిరిగివచ్చిన బాధితులు 'స్వగ్రామంలో ఉన్న భూములకు నీరు ఉండి, పంట పండితే పరాయి దేశాలకు వెళ్లి బానిస బతుకులెందుకు బతుకుతాం' అని అంటున్నారు.

దుబాయ్‌లో అనుమతి లేకుండా ఉన్న దాదాపు 80వేల మంది వెళ్లిపోవాలని అక్కడి ప్రభుత్వం హెచ్చరికలు జారీ చేయడంతో తిరిగి రావడానికి డబ్బులు లేక ఆర్థిక, మానసిక ఇబ్బందులకు లోనవుతూ ఇంకా అక్కడే 40 వేల మంది వరకు ఉన్నారు. 80 వేల మందిలో అధికభాగం తెలంగాణ జిల్లాలకు చెందిన వారే ఉన్నారు. తిరిగి వస్తే ఇక్కడ చేయడానికి పనిలేదు. అప్పు ఇచ్చిన వారు వెంటపడే పరిస్థితి ఉంది. వీటన్నింటిని ఎట్లా ఎదుర్కోవాలనే భయం వాళ్లను నీడలా వెంటాడుతోంది. విజిట్ వీసా మీద ఇన్ని వేలమంది వెళ్లి అక్కడే ఉంటున్నారనే విషయం మన భారత విదేశీ వ్యవహారాల శాఖకు గాని, దుబాయ్ ప్రభుత్వానికి గాని తెలియని విషయం కాదు. వీరి వద్ద అన్ని అధికారికమైన ఆధారాలు ఉన్నాయి. వీళ్ల ద్వారా వచ్చే ఆదాయాన్ని మాత్రమే సొమ్ము చేసుకునే ప్రయత్నం చేస్తున్నారు కానీ, రెండు దేశాల ప్రభుత్వాలు బాధ్యతలను విస్మరిస్తున్నాయి.

భారతదేశంలో సహజ సంపదలు, భూసంస్కరణల చట్టాలు, ఆదివాసి చట్టాలు, పంచవర్ష ప్రణాళికలు, గరీబీ హఠావో, ఇతరత్రా ఎన్ని అమలు పరచినా సామాన్య ప్రజల జీవితాల్లో చెప్పుకోదగ్గ మార్పు రాలేదు. మనదేశంలో వలసలు వెళ్లేవారిలో ప్రథమ స్థానంలో నిలిచిన ఆంధ్రప్రదేశ్ పరిస్థితిని మన పాలకులు మెరుగుపర్చలేకపోయారనేది ఒక చేదు నిజం. వీటన్నింటి నుంచి బయటపడటానికి డెబ్భై శాతం ఆధారపడిన భూమి సామాన్య ప్రజలకు చెందేలా చేయాలి. దానికి కావలసిన సాగునీరు, మౌలిక సదుపాయాలు కల్పించాలి. పండించిన పంటకు గిట్టుబాటు ధర కల్పించాలి. జిల్లాల్లో మూసివేసిన ఖాయిలా పడిన పరిశ్రమలను పునరుద్ధరించడం వల్ల ఉపాధి లభించి రాష్ట్రంలో ఆత్మహత్యలు, వలసలు ఆగడానికి తోడ్పడుతుంది. ◆

**వచ్చే సంచికలో...**

- ఫోకస్ - ఆంధ్రప్రదేశ్ ఆర్థిక వ్యవస్థ - బలాలు, బలహీనతలు
- చేనేత రంగం - కొన్ని ప్రశ్నలు - తడ్కయాదగిరి
- దారిద్ర్య రేఖను 'చెరిపేసిన' ఇందిరమ్మ గృహాలు
- వ్యవసాయరంగం - సహకార రంగ పరపతి - మచ్చ శ్రద్ధానందం

**ప్రజాజీవితంలో ఉన్నవారు, పదిమందికి నీతులు చెప్పేవారు, కళలో ఆదర్శాలకు పోతపోసే వారు మొదట తమ మాటలు, చేతలు పంపుతున్న సందేశాలేమిటో గ్రహించాలంటున్నారు కాశ్యప్**

# చెప్పేవారికి వినేవారు లోకువా?

సినిమాల్లో కథానాయకులు ఆదర్శానికి నిలువుటద్దాల్లా ఉంటారు. విలువల కోసం వారు సర్వసంపదను తృణప్రాయంగా వదులుకుంటారు. తను ప్రేమించిన రిక్షాకార్మికుడి కూతురి కోసం తండ్రిని, కోట్ల ఆస్తిని ఎడమకాలి గోటితో మన కథానాయకులు తన్నేస్తూ ఉంటారు. దారిన పోయే దానయ్యలను రక్షించడానికి వారు తమ ప్రాణాలను పణంగా పెడుతుంటారు. బజారు రౌడీలు మానవతులను ఏడిపిస్తుంటే కథానాయకులు రక్తం చిందించి, దెబ్బలకు ఓర్చి సమాజానికి దారి దీపాలవుతారు. వెండి తెరమీద కథానాయకుల హీరోచిత చర్యలకు అభిమానులు ఉబ్బితబ్బిబ్బవుతారు – తట్టుకోలేక హీరోల వాల్‌పోస్టర్లకు, కటౌట్లకు రక్త తిలకాలు దిద్దుతారు – క్షీరాభిషేకాలు చేస్తారు.

అభిమానం ఎంత పనైనా చేయిస్తుంది. సంతోషం. ఇంకొకరికి ఇబ్బంది లేనంతవరకు ఎవరిష్టం వారిది. అయితే అంతులేని అభిమాన సంపదను హీరోయిజం భుజకీర్తులను చూసి కథానాయకులు ప్రవరిస్తున్న తీరు మాత్రం వారు తెరమీద నటిస్తున్న ఆదర్శాలకు పూర్తి విరుద్ధంగా ఉంటోందనడానికి తాజా ఉదాహరణ మెగాస్టార్ సోదరులు గారైన పవర్‌స్టార్ పవన్ కళ్యాణ్ పెళ్లి కేసు.

అన్నగారి కూతురి మొదటి ఎంగేజ్‌మెంట్ ఉదయ్‌కిరణ్‌తో జరిగిన లోకోత్తర సన్నివేశంలో పిలవని పేరంటంగా వచ్చారంటూ పవన్ కళ్యాణ్ డెక్కన్ క్రానికల్ ఫోటోగ్రాఫర్, ఆంధ్రభూమి ప్రతినిధిపై పవర్ ప్రదర్శించడం కూడా అభిమానులు మురిసి ముప్పందుమైన సంఘటనే. చనిపోయిన పరిటాలరవితో పవర్‌స్టార్ సుహృద్భావ వాతావరణంలో మెలిగిన సన్నివేశం గురించి జూబ్లీహిల్స్‌కొండలు గోరంతలు కొండంతలు చేసి చెబుతున్నాయని అభిమానులు ఆవేదన పడ్డంలో అర్థముంది. కానీ, తాళి కట్టించుకున్న భార్య న్యాయపోరాటం చేస్తుంటే, ఆ అమ్మాయి గురించి, ఆ అమ్మాయి తండ్రి గురించి బెదిరింపు ధోరణితో మాట్లాడ్డం మాత్రం తెంపరితనం, మూర్ఖత్వం, చట్టం గురించి తెలియక పోవడమే.

అభిమానులకు అభిమానం పొరలు అడ్డొచ్చినా, రాకపోయినా చట్టప్రకారం పవర్‌స్టార్‌గారికి సంప్రదాయ శైలిలో మెగా కుటుంబం సమక్షంలో నందినితో పెళ్లి జరిగింది. తరువాత మనస్పర్థలు, రాయబారాలు, అమ్మాయికి వేధింపుల ఆరోపణలు, అత్తవారింటి నుండి నందిని పుట్టింటికి వెళ్లిపోవడం జరిగాయి. మనస్పర్థలకు ఎవరిదెంత బాధ్యత? నందిని పవర్‌స్టార్ గారి పసి హృదయాన్ని ఎంతగా క్షోభ పెట్టింది? లాంటి మౌలిక, తాత్విక, న్యాయ, ధర్మ సందేహాలకు పోలీసులు, ఫ్యామిలి కోర్టు, భారత శిక్షాస్మృతి తదితరాలు సమాధానం చెప్పాలి కానీ – అభిమానులు కాదు. అంతర్జాతీయ పవన్‌ఫ్యాన్స్ అసోసియేషన్‌ల సమాఖ్య అధ్యక్షుడి హోదాలో గుంపులో గోవిందయ్య టీవీ గొట్టాల ముందు పవన్ పూనకం ఊగిపోయి నందిని తండ్రిని అనరాని మాటలన్నంత మాత్రాన రేణుదేశాయ్ చట్ట ప్రకారం ఆయన భార్య కాదు. నందిని భార్య కాకపోదు.

ప్రజాజీవితంలో ఉన్నవారు, పదిమందికి నీతులు చెప్పేవారు, కళలో ఆదర్శాలకు పోతపోసే వారు మొదట తమ మాటలు, చేతలు పంపుతున్న సందేశాలేమిటో గ్రహించాలి. భార్య నందిని బతికి ఉండగానే, ఆమె మానసికంగా, శారీరకంగా బాగుండగానే, ఆమె నుండి విడాకులు పొందకుండానే, ఆమె అనుమతి లేకుండానే రేణుదేశాయ్‌ని పెళ్లి చేసుకుని కాపురం పెట్టి, కొడుకును కని, విశాఖ తీరంలో నందిని కేసులో "ఏం జరుగుతుందో చూద్దాం" అని పవర్‌స్టార్ భుజాలెగరేస్తుంటే అభిమానుల ఈలలే ఈలలు – కేకలేకేకలు. పైగా చట్టాన్ని చాపచుట్టి అవతల పడేసింది కాక, న్యాయం కోసం పోరాడుతున్న భార్య కుటుంబాన్ని అభిమానులు బెదిరించడం చూస్తుంటే సభ్యసమాజం ఇంతగా స్పందన లేకుండా ఉందేమిటన్న బాధ కల్గుతుంది.

పవన్ కళ్యాణ్ వ్యక్తిత్వానికి, ఆత్మాభిమానానికి, హీరోయిజానికి భంగం కలుగుతుందట – నాలుగ్గోడల మధ్య అతి రహస్యంగా విచారించారట. తాళికట్టిన భార్యకు చోటులేకుండా చేసి, ఇంకొక మహిళతో సంతానాన్ని కూడ కంటే మామూలు మనిషిని ఏమంటారో పవన్‌కళ్యాణ్‌ను కూడా అలాగే అనాలి. అలా చేసిన మామూలు వ్యక్తిని ఎలా విచారిస్తారో పవన్‌కళ్యాణ్‌ను కూడా అలాగే విచారించాలి. అప్పుడే న్యాయదేవత చేతిలో త్రాసు న్యాయన్యాయాలను సమదృష్టితో బేరీజు వేసినట్లు. వీధికో నందిని ఉన్న ఈ సమాజంలో ఇలా అయితే ఇంటికో పవన్ కళ్యాణ్ పుట్టి కోర్టు మెట్లమీదనే 'ఏమవుతుందో చూద్దాం" అంటూ టీవీ ప్రత్యక్ష ప్రసారాల సాక్షిగా భుజాలు ఎగరేస్తూ ఉంటారు.

తమ్ములుంగారు చట్టాన్ని చట్టుబండలు చేస్తే చేశారు, ఆదర్శానికి తానే కేరాఫ్ అడ్రస్ అనుకుని, ఇతరులు కూడా అలాగే అనుకోవాలని సవినయంగా కోరుకునే అన్నగారు చిరంజీవి అయినా మంచీ – చెడూ చెప్పలేకపోయారా? లేక తమదాకా వస్తే ప్రమాణాలు వేరని భావిస్తున్నారా? పైగా రాష్ట్రంలో రెండు ప్రధాన పార్టీలు గాడితప్పితే రాష్ట్ర సారథ్యం కాడిమోయడానికి భుజాన్ని సర్వసంసిద్ధంగా ఉంచుకుని

**ఇరాక్‌పై జరుగుతున్న అమెరికా చర్యలో భాగంగా ప్రైవేట్ మిలిటరీ కంపెనీలు చాలా చురుగ్గా సైనిక కార్యకలాపాలు నిర్వహిస్తున్నాయని అంటున్నారు ఇతిహాస్**

# యుద్ధం ఇప్పుడు లాభసాటి వ్యాపారం

సెప్టెంబర్ 16 ఆదివారం నాడు బాగ్దాద్ నగరానికి దగ్గరలో బ్లాక్ వాటర్ అనే అమెరికన్ కంపెనీకి చెందిన సైనికులు విచక్షణా రహితంగా జరిపిన కాల్పుల్లో ఎనిమిది మంది ఇరాకీ పౌరులు మరణించారు. ఈ సంఘటన ఇటీవలి కాలంలో పెరుగుతున్న ప్రైవేట్ మిలిటరీ కంపెనీల వ్యాపారం గురించీ, ప్రపంచ భవిష్యత్‌పై ఈ యుద్ధ వ్యాపారం వేయగల ప్రభావం గురించీ మరోసారి చర్చ లేవదీసింది.

చరిత్రలో జరిగిన చాలా సైనిక సంఘర్షణలకు వెనుక ఉన్నది వాణిజ్య ప్రయోజనాలేనన్నది బహిరంగ రహస్యమే. ఇరాక్‌పై యుద్ధానికి అమెరికా చూపినవి కుంటిసాకులేనని అసలు కారణం ఆ దేశపు చమురు సంపద దోచుకోవడమేనని ఇప్పుడు అందరికీ తెలుసు. అయితే యుద్ధం అనే ప్రక్రియ కూడా ప్రైవేటు కంపెనీలకు వేల కోట్ల డాలర్లు కురిపించే విధంగా మారిపోవడం ఇప్పుడు ఇరాక్‌పై దాడిలో మనకు కనపడుతుంది.

మొదటి ప్రపంచ యుద్ధంలో పాల్గొన్న అమెరికన్ జనరల్ స్మెడ్లీ బట్లర్ 1935లో రాసిన 'వార్ ఈజ్ ఏ ర్యాకెట్' అనే పుస్తకంలో యుద్ధంలో లాభాన్ని తీసి వేయగలిగితే ఇక యుద్ధాలనేవే ఉండవని అన్నాడు. యుద్ధం ఒక లాభసాటి వ్యాపారంగా మారిపోయిన ఈ కాలంలో ఆనాడు ఆయన ముందుచూపుతో రాసిన ఆ మాటల విలువ పూర్తిగా అవగతం అవుతోంది.

మొదటి, రెండో ప్రపంచ యుద్ధాల్లోనూ అనేక ప్రైవేట్ కంపెనీలు బాగా లాభపడ్డాయి. బేయర్ అనే జర్మన్ మందుల కంపెనీ అయితే ఏకంగా యూదులను చంపడానికి ఉపయోగించిన విషపూరితమైన వాయువును సరఫరా చేసి సొమ్ముచేసుకుంది. మొదట్లో కేవలం యుద్ధరంగంలో కావలసిన ఆయుధాలు, మందుగుండు ఇంకా ఇతర సేవలు అందించడానికే పరిమితమయిన ప్రైవేట్ కంపెనీలు 1990ల దశకానికి వచ్చేసరికి నేరుగా యుద్ధరంగంలో ప్రత్యక్షంగా పాల్గొనే సేవలు అందించడం మొదలుపెట్టాయి. ఇక జార్జ్ డబ్ల్యూ. బుష్ నేతృత్వంలో ఇరాక్‌పై రెండోసారి దాడి మొదలయ్యాక ఈ ప్రైవేట్ సైనిక కంపెనీల వ్యాపారం వ్యవస్థీకృతమై వటవృక్షంలా ఎదిగింది. ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా వివిధ రకాల సైనిక కార్యకలాపాలు నిర్వహిస్తున్న ప్రైవేటు మిలిటరీ కంపెనీలు వందదాకా ఉన్నట్లు అంచనా. ఎంత లేదన్నా సాలీనా వీటి వ్యాపార లావాదేవీల విలువ 10,000 కోట్ల డాలర్ల పైమాటే.

ప్రైవేట్ మిలిటరీ ఇప్పుడు ప్రపంచంలోని అనేక ప్రాంతాల్లో తమ 'సేవలు' అందిస్తున్నాయి. అఫ్ఘానిస్తాన్ అధ్యక్షుడికి వ్యక్తిగత భద్రతా సిబ్బందిని సమకూర్చడం, ఇరాక్‌లో అమెరికన్ సైన్యానికి చేదోడు వాదోడుగా ఉండటం వంటివే కాక నైజీరియా, బల్గేరియా, తైవాన్ వంటి దేశాల సైన్యాలకు శిక్షణ ఇవ్వడం వంటి పనులు చేస్తున్నాయి ఈ ప్రైవేట్ మిలిటరీ కంపెనీలు.

1977లో జెనీవా ఒప్పందానికి చేసిన సవరణ ప్రకారం యుద్ధరంగంలో ఆయుధం పట్టుకుని పోరాటం చేసే కిరాయి సైనికులకు యుద్ధఖైదీలకు ఉండే హోదా లభించదు. వారు చట్టవ్యతిరేక పోరాటకారులుగా శిక్షార్హమవుతారు. అందుకేనేమో అమెరికా ఈ సవరణను ఒప్పుకోలేదు.

సెంటర్ ఫర్ పబ్లిక్ ఇంటిగ్రిటీ అనే సంస్థ వెల్లడించిన వివరాల ప్రకారం 1994 నుండి అమెరికా రక్షణ శాఖ 12 ప్రైవేట్ మిలిటరీ కంపెనీలకు 30,000 కోట్ల డాలర్ల విలువైన కాంట్రాక్టులు అప్పజెప్పింది. అమెరికా అధ్యక్ష ఎన్నికల కొరకు ఈ ప్రైవేట్ మిలిటరీ కంపెనీలు మిలియన్ల కొద్దీ డాలర్లను విరాళాలుగా ఇస్తున్నాయి. ఇలా ఎన్నికైన అధ్యక్షులు సహజంగానే 'రుణం' తీర్చుకునేందుకు ప్రయత్నిస్తారు.

---

ఉబలాటపడుతున్న ధీరాధిధీరుడు, హీరాధిహీరుడు తమ్ముడి గారి విషయంలో మిన్నకున్నారంటే పవన్‌ది కరెక్టేనని ఆయన భావిస్తున్నట్లు మనం అనుకోవాలి.

ఇక పవన్‌కళ్యాణ్ పెళ్లికేసు విషయంలో కొన్ని తెలుగు టీవీ ఛానెళ్ల అత్యుత్సాహం వారి బాధ్యతారాహిత్యాన్ని పవన్ మీద ప్రేమను, చట్టం గురించి కనీస అవగాహన, గౌరవంలేకపోవడాన్ని స్పష్టంగా చెబుతోంది.

పవన్ ఏ తప్పూ చేయలేదన్న అభిప్రాయాన్ని ప్రచారం చేసే బాధ్యతను మీద వేసుకోవడం వెనుక కారణాలను అరటిపండు వలిచి పెట్టినంత సులభంగా ప్రేక్షకులు అర్థం చేసుకోగలరు. సినిమాలు, వ్యాపారాలు, ఇమేజ్ చట్రాలు ఎవరిగోల వారిది. ఐతే ప్రజాస్వామ్యంలో చట్టం ముందు అందరూ సమానులేనన్న భావనకు, స్ఫూర్తికి పవర్ ప్రదర్శనలు గొడ్డలిపెట్ట కాకూడదు. చట్టం చట్టుబండలు అయితే కావచ్చుకానీ, కనీసం తప్పును తప్పని చెప్పగలిగే సమాజం, తప్పును ఒప్పుగా ఒప్పుకోవాల్సి రావడం కన్నా దౌర్భాగ్యం మరొకటి ఉంటుందా? ఈతప్పు, అక్రమాన్ని ప్రశ్నించలేని సమాజానిదా? మామూలు మనుషులు కాము అనుకుని కాలరెగరేసుకు తిరిగే కలవారిదా? ఎందరో నందినిలు, అడుగడుగునా పవన్‌లు. మొద్దుబారిపోయిన సమాజం మనది. పవన్‌కు జై! పవన్ అన్నకు జైజై!! పవన్ అభిమానులకు జైజైజై!!! ◆

ఇరాక్‌పై జరుగుతున్న అమెరికా సైనిక చర్యలో భాగంగా ప్రైవేట్ మిలిటరీ కంపెనీలు చాలా చురుగ్గా సైనిక కార్యకలాపాలు నిర్వహిస్తున్నాయి. ఒక అంచనా ప్రకారం ఇరాక్‌లో వివిధ హోదాలలో 1,20,000 మంది ప్రైవేట్ మిలిటరీ కంపెనీల సిబ్బంది ఉన్నారు. అమెరికా, ఇరాక్ సంకీర్ణ ప్రభుత్వంతో కుదుర్చుకున్న ఒప్పందం ప్రకారం ఈ ప్రైవేటు సైనికులు ఇరాకీ చట్టపరిధిలోకి రారు. చేతిలో అత్యాధునిక ఆయుధాలు చేబూని ఎటువంటి జంకూగొంకూ లేకుండా ఇరాకీల పై ఈ ప్రైవేట్ సైనికులు సాగిస్తున్న అరాచకాలు పెచ్చుమీరుతున్నాయి. అబూగ్రాయిబ్ జైలులో ఇరాకీలపై జరిగిన ఆకృత్యాలు మొట్టమొదటిసారిగా ఈ ప్రైవేట్ సైనికుల గురించి బయటి ప్రపంచానికి తెలియజెప్పాయి. ఆ దారుణం చేసిన సిఎసిఐ అనే కంపెనీ సైనికులపై విచారణ నామమాత్రంగా సాగింది. 2005 అక్టోబర్ 27న ఇంటర్నెట్‌లో విడుదలైన ఒక వీడియోలో ఏజిస్ డిఫెన్స్ సర్వీసెస్‌కు చెందిన సైనికులు బాగ్దాద్‌లో పౌరులపై విచక్షణారహితంగా కాల్పులు జరపడం చూపారు. ఇక మొన్న సెప్టెంబర్ 16న బ్లాక్‌వాటర్ గ్రూప్‌కి చెందిన సైనికులు హెలికాప్టర్ గన్‌షిప్ నుండి పౌరులపై జరిపిన కాల్పుల్లో ఎనిమిది మంది మరణించారు. దీంతో ఆగ్రహోద్రగుడైన ఇరాకీ ప్రధానీ నూరి-అల్-మాలికి బ్లాక్‌వాటర్ సంస్థపై నిషేధం విధించాడు. ఇరాక్‌లో ప్రైవేట్ మిలిటరీ కార్యకలాపాల్లో బ్లాక్‌వాటర్‌దే సింహభాగం. బుష్‌కు, డిక్‌షెనీకి చాలా దగ్గరి సంబంధాలు కలిగిన బ్లాక్‌వాటర్ ఇరాక్ యుద్ధంతో బాగా లాభపడింది. ఇప్పుడున్న ప్రైవేట్ మిలిటరీ కంపెనీలన్నిట్లోనూ బ్లాక్‌వాటర్‌దే అగ్రస్థానం. అమెరికాలోని మయోక్ వద్ద ఈ కంపెనీకి అత్యాధునిక సైనికస్థావరం ఉంది. ఒక చిన్నపాటి దేశానికి ఉండేంత సైనిక ఆయుధ సంపత్తి ఈ కంపెనీకి ఉన్నాయి. బి-52 బాంబర్ విమానాలతో సహా సమకూర్చుకున్న బ్లాక్‌వాటర్ వంటి మిలిటరీ కంపెనీలపై అమెరికా గడ్డపైనే చాలా వ్యతిరేకత వెల్లవడవుతోంది.

ఇలాంటి కిరాయి సైనిక కంపెనీలను ప్రోత్సహించడంతో అమెరికా మరోసారి కొరివితో తలగొక్కుంటుందనీ, డబ్బు కోసం ఏ పనైనా చేయడానికి వెనకాడని ఈ కంపెనీల్లో ఏదో ఒకదాన్ని శత్రువులే అమెరికాపై దాడికి ఉపయోగించే ప్రమాదం ఉందని కొందరు విశ్లేషకులు అంటున్నారు.

అధికారంలో ఉన్న పెద్దల ఆశీస్సులతో ఈ ప్రైవేట్ మిలిటరీ కంపెనీలు అనేక అక్రమాలకు, అరాచకాలకు పాల్పడుతున్నాయి. గత వారమే వెలికిచూసిన ఒక వార్త ప్రకారం ఎలాంటి లైసెన్సులు లేకుండా భారీ ఎత్తున ఆయుధాలు, మందుగుండును బ్లాక్‌వాటర్ కంపెనీ ఇరాక్‌కు పంపించింది. గత ఏడాది కాలంలో ఇరాక్‌లో ఆరుసార్లు బ్లాక్‌వాటర్ సైనికులు పౌరులపై కాల్పులు జరిపారు. ఇందులో పది మంది ఇరాకీలు మృత్యువాత పడ్డారు.

సహజ వనరులకోసం, వ్యాపారాభివృద్ధికోసం యుద్ధం చేయడం అనే దశనుండి యుద్ధమే వ్యాపారంగామార్చిన ఘనత మాత్రం అమెరికాదే. మనిషి రక్తాన్నిమరిగిన ఈ ప్రైవేట్ మిలిటరీ కంపెనీలు మిగతా బహుళజాతి కంపెనీల్లాగే వ్యాపారాభివృద్ధికోసం కొత్త 'మార్కెట్లు' సృష్టించుకోవడం మొదలుపెడితే ప్రపంచం ఎంత అల్లకల్లోలంగా మారుతుందోననే ఊహే భయానకంగా ఉందిప్పుడు. ◆

---

*(...46వ పేజీ తరువాయి)*

పన్ను తీసుకొనబడుచున్నదనియు తెలిసినది. కేవలము టోలుగేటు హర్రాజు ఆదాయమే సంవత్సరం 1కి సుమారు రు. 8,000-0-0 గలదు. అట్లయ్యును గ్రామ పరిశుభ్రత బొత్తిగా బాగులేదు. ఒక్క ముఖ్యమైన రోడ్డు తప్ప తక్కిన సందుగొందులలో వెల్తురుయేర్పాట్లు ఏమియులేదు.

**విద్య :** గద్వాలయందు ఒక హైస్కూలును మూడు గ్రామాదులు అనగా అయిజా గట్టు, రాజుగోలులలో తహతాన్యా పాఠశాలలును, ఈ ప్రకారము మొత్తము నాలుగు పాఠశాలలు గలవు. ఈ సంస్థానమందు నాల్గు అయిదువేల జనసంఖ్యగల గ్రామములు పెక్కులున్నవి. కాని వాటికి పాఠశాలల లేవు.

**కల్దారు శిక్కా :** ఈ సంస్థానమందలి కొన్ని గ్రామములందు మాల్గుజారి పైకము కల్దారు శిక్కాలో వసూలు చేయబడుచున్నది. పెచ్చురేటునందు కూడా చాలా అక్రమము జరుగుచుండును. అందువలన రైతులకు నష్టము కలుగుచున్నది. ఈ సంస్థానమందు కొన్ని గ్రామములు సంస్థానాధిపతి చుట్టపక్కముల జాగీర్లు, వానియందుగూడా హాలీ సిక్కాకుమారుగా మాల్గుజారి పైకము కింద కల్దారు నాణెములు వసూలు చేయబడుచున్నవి. ఒక రూపాయి హాలీకి బదులు ఒక రూపాయి కల్దారు తీసుకొందురు. దీని ఫలితమేమనగా ఒక్క రూపాయికి మారుగా రు. 1-2-0 పన్ను గైకొనబడుచున్నది.

**నజరానా :** బందొబస్తులో రైతుల పేర పట్టా అయిన భూములను గూడా శేరి ఇనాం భూములుగా నిర్ణయించి య॥ 1కి రు. 4-0-0 చొప్పున నజరానా వసూలు చేయబడుచున్నది.

**సంస్థానపు ఆదాయము :** మాల్గుజారి పైకము వలన 5 లక్షల 88 3/4 వేయిలను ఆబ్కారివలన సుమారు 4 లక్షల 66 వేయిలను మొత్తం సుమారు 10 లక్షల ఆదాయము కలదు. ఇతర విధముల సుమారు 1,00,000 ఆదాయము కల్గుచుండవచ్చును. భృత్యులజీతములకొరకై నెల 1కి రు. 11,000 చొప్పున సంవత్సరానికి ఒక లక్ష 32 వేలు ఖర్చు ఆగుచున్నవి. కాని ప్రజోపయోగకరమైన నిర్మాణకార్యములపై బొత్తిగా ఖర్చు అగుట లేదు. తక్కిన పైకము ఏ ఏ విషయములందు ఖర్చు అగుచున్నదో తెల్యదు.

**ముగింపు**

మేము తెలుసుకొనగలిగిన సంగతులను సంగ్రహముగా విన్నవించితిమి. ఈ రిపోర్టు రాయుటయందు చాలా పనిచేయబడినది మాకు తెలిసిన విషయములు కొన్ని ఇందు వదిలిపెట్టబడినవి. తీరిక వెంట వేరువేరు గ్రామములందు తిరిగి స్థితిగతులు విచారించినయెడల బహుశా కొన్ని కొత్త విషయములుగూడ వెల్లడియైయుండును. ఈ సంస్థానపు రైతాంగము అనేకములగు ఆపదలపాలై దుస్సహమును అనిర్వాచ్యమగు ఓ జీవితము గడుపుచున్నది. ఇచ్చటి రైతులు నిరాశాపూరితమగు మిక్కిలి కష్ట పరిస్థితులందున్నారు. ఈ ఉపద్రస్థులకు తక్షణము సహాయము చేయవలసియున్నదని విన్నవించుచు ఈ రిపోర్టును ముగించుచున్నాము. ◆

## 1.. 2.. 3.. మధ్యంతరం?

అమెరికాతో అణు ఒప్పంద వ్యతిరేకిస్తున్న వామపక్షాలు యు.పి.ఎ. ప్రభుత్వానికి మద్దతు ఉపసంహరించుకుంటే మధ్యంతర ఎన్నికలు అనివార్యమౌతాయి. ఏ మొఖం పెట్టుకొని ప్రజల దగ్గరికి పోవాలో అర్థం కాని మీమాంసలో అధికార, ప్రతిపక్షాలు ఆలోచిస్తున్నాయి. 'ది వీక్' సర్వే ప్రకారం బి.ఎస్.పి. సహకారంతో యు.పి.ఎ. మళ్లీ ప్రభుత్వం ఏర్పాటు చేసే అవకాశాలు ఉన్నట్లు తెలుస్తోంది. ఏది ఏమైనా నందిగ్రామ్ కాల్పులతో అప్రతిష్ఠ పాలైన లెఫ్ట్, ముదిగొండ, సెజ్‌లతో అభాసుపాలైన రైట్ దొందూదొందేనని ప్రజలు అనుకుంటున్న తరుణంలో మధ్యంతరానికి కాలుదువ్వే సాహసం చేస్తారా, వేచి చూడాలి.

## దేశవ్యాప్త సమ్మెకు పిలుపు

కార్మిక వ్యతిరేక, ప్రజావ్యతిరేక ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా పలు కేంద్ర కార్మిక సంఘాలు అక్టోబర్ 30న దేశవ్యాప్త సమ్మెకు ఆగస్ట్ 21న పిలుపునిచ్చాయి. రాష్ట్ర ప్రభుత్వ కార్మిక సంఘాలు కూడ మద్దతు తెలిపాయి. అసంఘటిత రంగ కార్మికుల హక్కుల పరిరక్షణకై సమగ్రమైన చట్టాలను తేవాలనీ, ఔట్‌సోర్సింగ్ విధానాన్ని నిలిపివేయాలనీ, వ్యవసాయ కార్మికులకై ప్రత్యేకమైన చట్టాలు చేయాలనీ, ఉద్యోగాలను కాంట్రాక్ట్‌కు ఇవ్వడాన్ని నిలిపివేయాలనీ కార్మిక సంఘాలు డిమాండ్ చేసాయి. కార్మిక చట్టాల ఉల్లంఘనలను నిరోధించాలనీ, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను నిలిపివేయాలనీ, ప్రభుత్వ రంగ సంస్థలను నీరుగార్చడానికి ఉద్దేశించిన పెట్టుబడుల ఉపసంహరణ విధానాన్ని నిలిపివేయాలనీ డిమాండ్ చేసాయి. స్పాన్సరింగ్ కమిటీ తరపున జరిగిన ఈ సమావేశంలో ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ (ఎ.ఐ.టి.యు.సి), ది హిందూ మజ్దూర్ సభ, సెంటర్ ఆఫ్ ఇండియన్ ట్రేడ్ యూనియన్స్ (సి.ఐ.టి.యు), ది ఆల్ ఇండియా సెంట్రల్ కౌన్సిల్ ఆఫ్ ట్రేడ్ యూనియన్స్, ది ట్రేడ్ యూనియన్ కో-ఆర్డినేషన్ సెంటర్, ది యునైటెడ్ ట్రేడ్ యూనియన్ సెంటర్ ఇంకా యు.టి.యు.సి (ఎల్) మొదలైన కార్మిక సంఘాలు పాల్గొన్నాయి.

## కంచే ఇక్కడ చేనుమేస్తోంది

ఆదాయానికి మించి ఆస్తులు ఉన్న కేసులో పంజాబ్ మాజీ డి.జి.పి. ఎస్.ఎస్. విర్క్‌ను విజిలెన్స్ విభాగం అధికారులు సెప్టెంబర్ 9న అరెస్ట్ చేశారు. మాజీ ముఖ్యమంత్రి అమరీందర్ సింగ్ హయాంలో డి.జి.పి.గా విధులు నిర్వర్తించిన విర్క్ వద్ద దాదాపు మూడు వందల కోట్ల రూపాయల విలువ చేసే ఆస్తులు ఉన్నట్లు గుర్తించారు. ఢిల్లీ నుంచి మోహాలికి తరలించి విర్క్‌ను కోర్టుముందు ప్రవేశపెట్టారు. న్యాయస్థానం ఆయనని ఒకరోజు పోలీసు కస్టడీకి పంపించింది. మహారాష్ట్ర క్యాడర్‌కు చెందిన విర్క్ 1984 మేలో స్వర్ణదేవాలయంలో జరిపిన 'ఆపరేషన్ బ్లూస్టార్'లో పాల్గొన్నారు. ఉత్తమ సేవలకు కేంద్ర ప్రభుత్వం నుండి 'పద్మశ్రీ' అవార్డును అందుకున్నారు.

## సామాజిక దృష్టిలేని వ్యాఖ్య

సెక్యులర్ భావనకు అర్థాలు మారిపోయి రాజకీయాల్లోకి, విద్య, పాలనలలోకి, భాషలోకి మతం చొచ్చుకురావడం చాలాకాలం క్రితమే మొదలైంది. ఈ కోవలోకి వచ్చేదే అలహాబాద్ కోర్టు జస్టిస్ ఎస్.ఎన్. శ్రీవాత్సవ్ చేసిన వ్యాఖ్య. భిన్న జాతులు, విభిన్న సంస్కృతులు, మతవిశ్వాసాలు కలిగిన భారతదేశంలో భగవద్గీతను జాతీయ ధర్మశాస్త్రంగా ప్రకటించాలని అభిప్రాయపడడం బాధ్యతారాహిత్యం, అప్రజాస్వామికం.

## అసంతృప్తి సూచికలు

బీహార్‌లోని వైశాలి జిల్లా ధేల్‌పూర్వాలో సెప్టెంబర్ 13 తెల్లవారు ఝూమున ఆ గ్రామస్తులు పది మంది దొంగలను కొట్టి చంపారు. తరచు దొంగతనాలు జరుగుతుండడంతో గ్రామస్తులు కొందరు యువకులతో బృందంగా ఏర్పడి గస్తీ ఏర్పాటు చేసుకున్నారు. ఆ రోజు గస్తి తిరుగుతున్నవారికి వాహనం కోసం ఎదురుచూస్తూ పదమూడు మంది అపరిచిత వ్యక్తులు తారసపడ్డారు. వివరాలు అడగగా పారిపోయే ప్రయత్నం చేసారు. పదమూడు మందిలో ఇద్దరు తప్పించుకోగా మిగిలిన వారిని గ్రామస్తులు పట్టుకొని కర్రలు, ఇనుప రాడ్లతో చావబాదారు. చివరి క్షణంలో చేరుకున్న పోలీసులు ఒక వ్యక్తిని ప్రాణాలతో కాపాడారు. మృతులంతా నట్స్ అనే సంచార జాతికి చెందినవారు. ఇవే కాక బీహార్‌లో ఇటీవలి ఒక చిల్లర దొంగను మోటర్ సైకిల్‌కు కట్టి ఒక పోలీసు ఈడ్చుకెళ్లడం, బైక్ దొంగలించారంటూ ముగ్గురి కళ్లు పీకెయ్యడం బీహార్‌లో క్షీణిస్తున్న సామాజిక స్థితికి అద్దం పడతాయి.

## రిజర్వేషన్లలో సామాజిక న్యాయమెంత?

ఉన్నతవిద్యా సంస్థల్లో రిజర్వేషన్లను వ్యతిరేకిస్తూ దాఖలైన పిటిషన్‌పై సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి కె.బి. బాలకృష్ణన్ నేతృత్వంలో ఐదుగురు సభ్యుల ధర్మాసనం సెప్టెంబర్ 12న విచారణ జరిపింది. ఇటీవల ఇతర వెనుకబడిన వర్గాల (ఒ.బి.సి) జాబితాలో పెరుగుతున్న కులాలపై సుప్రీంకోర్టు ఆందోళన వ్యక్తం చేసింది. అసలు దేశంలోని మొత్తం కులాల జాబితా ఉందా అని సుప్రీంకోర్టు ప్రశ్నించింది. పిటిషనర్ల తరపు న్యాయవాది కె.కె. వేణుగోపాల్ ఈ కేసు వాదిస్తున్నారు. 1950లో 1373 కులాలు ఒ.బి.సి. జాబితాలో ఉండగా 2006 నాటికి అవి 5013కి పెరిగాయని తెలిపారు. ఎన్నికల దృష్టితో ఒ.బి.సి. జాబితాలోకి కులాలను చేర్చుతూ పోతున్నారని వేణుగోపాల్ అన్నారు. ఇప్పటికైనా సమగ్ర అధ్యయనం జరిపి దామాషా పద్ధతిన కులాలవారీగా, ఆర్థిక, సామాజిక, రాజకీయ రంగాలలో ప్రభుత్వ, ప్రైవేట్ రంగాలలో ప్రాతినిధ్యం కల్పిస్తే కొంతైనా న్యాయం జరగవచ్చు.

## ప్రజా వ్యతిరేక ఒప్పందం

అణు ఒప్పందం ద్వారా కాంగ్రెస్ ప్రభుత్వం భారత దేశ ప్రయోజనాలను, సార్వభౌమత్వాన్ని అమెరికాకు తాకట్టు పెట్టిందని సి.పి.ఐ. (మావోయిస్టు) కేంద్ర కమిటీ ధ్వజమెత్తింది. అమెరికా సామ్రాజ్యవాద శక్తులకు ఈ ఒప్పందంతో దాసోహమవడం ద్వారా తన జాతీయ వ్యతిరేకతనూ, ప్రజా వ్యతిరేకతనూ ప్రభుత్వం చాటుకుందని ఆ పార్టీ అధికార ప్రతినిధి అన్నారు. జూలై 22నే ఒప్పందంపై సంతకం చేసినా ఆగస్ట్ 3వ తేదీ వరకు వివరాలను వెల్లడించకపోవడం ద్వారా తన అమెరికా విధేయతను ప్రభుత్వం చాటుకుందన్నారు. ◆

## నేపాల్‌లో ఏం జరుగుతోంది

ఐదు నెలలుగా నేపాల్ ప్రభుత్వంలో భాగస్వాములుగా ఉన్న నేపాల్ కమ్యూనిస్టుపార్టీ (మావోయిస్ట్) మంత్రులు నలుగురు రాజీనామా చేసి ప్రభుత్వం నుండి వైదొలిగారు. రాజరికాన్ని రద్దు చేసి, నేపాల్‌ని గణతంత్రంగా ప్రకటించాలని మావోయిస్టులు చేసిన డిమాండ్‌ని నేపాల్ ప్రధానమంత్రి గిరిజాప్రసాద్ కోయిరాలా తోసిపుచ్చారు. ఆ కారణంగానే తాము ప్రభుత్వం నుండి తప్పుకొంటున్నామని, ఐతే శాంతి ప్రక్రియని విడనాడే ఉద్దేశ్యమేమీ లేదని, తిరిగి ఆయుధాలు చేపట్టబోమని మావోయిస్టులు స్పష్టం చేశారు. ఒక దశాబ్దకాలంపాటు విప్లవాన్ని నడిపి, నేపాల్‌లోని అనేక ప్రాంతాలపై తమ పట్టుసాధించి, చివరికి శాంతియుత చర్చల్లో పాల్గొని, ఆపైన ప్రభుత్వంలో కూడా భాగస్వాములైన మావోయిస్టులు ఇప్పుడు ఏ మార్గాన వెళ్తారో వేచి చూడాల్సిందే.

## అధికారం కోసం...

పాకిస్తాన్ మాజీ ప్రధానమంత్రి నవాజ్‌షరీఫ్ ఎన్నో ఏళ్ల తరువాత పాకిస్తాన్‌లో అడుగిడిన వెంటనే పాకిస్తాన్ ప్రభుత్వం అరెస్ట్ చేసి, సౌదీ అరేబియాకు పంపించేసింది. పాకిస్తాన్ సుప్రీంకోర్టు నవాజ్‌షరీఫ్, అతని సోదరుడు షెహబాజ్ షరీఫ్‌లను పాకిస్తాన్‌కి రావడానికి అనుమతించ వలసిందిగా ప్రభుత్వాన్ని ఆదేశించిన తరువాతే నవాజ్‌షరీఫ్ పాకిస్తాన్‌కి ప్రయాణమయ్యారు. రాగానే ఆయన్ని ప్రభుత్వం అరెస్ట్ చెయ్యవచ్చుననే ఊహాగానాలున్నాయి కానీ, వచ్చిన ఐదు గంటల లోపే ఆయన్ని అరెస్ట్ చేసి, తిరిగి సౌదీకి పంపేస్తారని ఎవరూ ఊహించలేదు. ఇక షరీఫ్ అనుచరులు ఈ విషయంపై పాకిస్తాన్ సుప్రీంకోర్టుకి వెళ్లడానికి నిశ్చయించుకొన్నారు.

## మరుభూమిగా మార్చిందెవరు?

ఓ.ఆర్.బి అనే బ్రిటిష్ సర్వే సంస్థ ఇటీవల విడుదల చేసిన అంచనాల ప్రకారం ఇరాక్‌లో 2003 యుద్ధం నాటి నుంచి ఇప్పటి వరకు కనీసం పది లక్షలమంది ఇరాకీలు హింసమూలంగా చనిపోయి ఉంటారు. గత సంవత్సరం అక్టోబర్‌లో లాన్‌సెట్ అనే పత్రిక 6,55,000 ఇరాకీలు చనిపోయి ఉండవచ్చునని ప్రకటించింది. ఇప్పుడీ సంఖ్య దాదాపు రెండింతలు పెరిగింది. ఓ.ఆర్.బి. చేసిన సర్వేలో 1461 మంది ఇరాకీలు పాల్గొన్నారు. సర్వేని ఇరాక్‌లోని పదిహేను ప్రాంతాల్లో చేసారు. ప్రతి కుటుంబంలో సగటున ఎంత మంది హింసాత్మక పరిస్థితుల వలన చనిపోయారనే సంఖ్యని ఆధారంగా చేసుకొని లెక్కవేస్తే 2003 నుండి ఇప్పటికి ఇరాక్‌లో 12,20,580 మంది చనిపోయారని లెక్కతేలింది. బాగ్దాద్‌లోని కుటుంబాలలో దాదాపు 50 శాతం కుటుంబాలు కనీసం ఒక కుటుంబ సభ్యున్ని కోల్పోయారు. చనిపోయిన ఇరాకీలలో 48 శాతం గన్నులకి, 20 శాతం కారు బాంబులకి, 9 శాతం వైమానిక దాడులకి, 6 శాతం ప్రమాదాలకి, 6 శాతం ఇతర మందుగుండు సామాగ్రికి బలయ్యారు.

## జపాన్‌కు కొత్త ప్రధాని

ఒక సంవత్సరకాలంగా జపాన్ ప్రధానిగా ఉన్న షిన్‌జో అబే చాలా అనూహ్యంగా ప్రధాని పదవి నుంచి తప్పుకొన్నారు. తన విదేశాంగ విధానాలకి, అమెరికాతోపాటు, జపాన్ సాగిస్తున్న 'ఉగ్రవాదం మీద యుద్ధానికి' ప్రజలనుంచి ఎటువంటి మద్దతు లేకపోవడమే తన నిర్ణయానికి కారణమని ఆయన ప్రకటించారు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం జపాన్ ఎటువంటి యుద్ధ సంబంధిత వ్యవహారాల్లోనూ పాలుపంచుకోకూడదని తన రాజ్యాంగంలో రాసుకొని, ఇంతకాలం దానికే కట్టుబడి ఉంది. ఐతే, ఇటీవలి కాలంలో అమెరికన్ నావలకి చమురునందించే పని జపాన్ చేస్తూంది. ఈ విషయంపై జపాన్ పార్లమెంట్‌లో ప్రతిపక్షాలు తమ తీవ్ర అభ్యంతరాన్ని తెలిపాయి. పార్లమెంట్ నుంచి, ప్రజలనుంచి మద్దతు కోల్పోయినందుకే జపాన్ ప్రధాని పదవికి రాజీనామా చేసారు. అమెరికా చేస్తున్న యుద్ధాలకి మద్దతు పలికినందుకు, తమ దేశ ప్రజల నుంచి తీవ్ర వ్యతిరేకతని ఎదుర్కొన్న అనేక దేశాల నాయకుల జాబితాలోకి అబే కూడా చేరారు.

## నింగినంటిన ధరలు - వెల్లువెత్తిన నిరసనలు

మిలిటరీ పాలిస్తున్న మయన్మార్ (బర్మా)లో ప్రజానిరసన వెల్లువెత్తుతోంది. గత నెలలో మయన్మార్ ప్రభుత్వం చమురు ధరలని పెంచడంతో అత్యవసర వస్తువుల ధరలన్నీ పెరిగాయి. ఈ పెరుగుదలకి వ్యతిరేకంగా మొదలైన ప్రజల నిరసనలో ఇప్పుడు బౌద్ధ భిక్షువులు కూడా పాలుపంచుకోవడంతో ఒక కొత్త మలుపుతిరిగింది. వేలమంది భిక్షువులు, మామూలు ప్రజలు కలిసి ప్రభుత్వ వ్యతిరేక ర్యాలీలు, మార్చ్‌లు నిర్వహించారు. వాళ్లపైన ప్రభుత్వం దమనకాండ సాగిస్తుందనే భయం ప్రజల్లో ఉన్నప్పటికీ పెరుగుతున్న ధరలకీ, దిగజారిపోతున్న ఆర్థిక పరిస్థితికీ వ్యతిరేకంగా ప్రజలు స్పందించారు. గత పదేళ్లలో ప్రజలు ఇంతగా స్పందించి, పాలుపంచుకొన్న ఉద్యమం ఇంకోటి లేదు.

## మూకొద్దీ అభివృద్ధి

పెరూలోని మూడు జిల్లాల్లోని ప్రజలు మినెరా మజాజ్ అనే గనుల కంపెనీకి తమ భూములను తవ్వకాలకు ఇవ్వడాన్ని నిరాకరించారు. ఆ మూడు జిల్లాల్లోని అరవై శాతం ప్రజలు, గ్రామాలు, టౌన్ల నుంచి పోలింగ్ సమయానికి చాలా ముందుగానే బూత్‌లకి వచ్చేసి తమ ఓటు వేశారు. మినెరా మజాజ్ కంపెనీకి, అక్కడి ప్రజలకి 2002లో ఖనిజాన్వేషణ ప్రారంభమైనప్పటి నుంచి, గొడవలు జరుగుతూనే ఉన్నాయి. కంపెనీ కార్యకలాపాలకి వ్యతిరేకంగా ప్రజలు పాల్గొన్న ఉద్యమాల్లో చాలా మంది గాయపడ్డారు, మరణించారు కూడా. ఐతే ప్రజల ఈ రిఫరెండంని పట్టించుకునేది లేదని, ఇదంతా దేశ ప్రగతిని అడ్డుకొనేందుకు కమ్యూనిస్టులు చేస్తున్న కుట్ర అని, ఆ మూడు జిల్లాల ప్రజలని ప్రలోభపెట్టో, భయపెట్టో ఓటు వేయించారని పెరూ అధ్యక్షుడు ఎలన్‌గార్షియా, ప్రధాని జార్జ్‌డెల్‌కాస్టిలో ప్రజలఓటుని కొట్టిపారేస్తున్నారు. తమ భూములని, నదులని, పంటలని దెబ్బతీస్తున్న గనులకి, ఖనిజ అన్వేషణకి తమ సహకారం అందించబోమని, అటువంటి కంపెనీలని రానివ్వబోమని ఈ మూడు జిల్లాల ప్రజలు చాలా గట్టిగా చెబుతున్నారు. ప్రపంచీకరణ నేపథ్యంలో, ప్రతి దేశంలోనూ ప్రజలని నిర్వాసితులను చేసే ప్రాజెక్టులే ప్రగతిగా నిర్వచిస్తున్న తరుణంలో పెరూ ప్రజలపోరాటం ఇతర దేశాల ప్రజలకికూడా ఒకమంచి ఉదాహరణగా ఉంటుంది. ◆

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. ఆ సహజ మరణపు వయోపరిమితి దేశ కాల పరిస్థితులను బట్టి, జీవన ప్రమాణాలను బట్టి అరవైల నుంచి తొంభైల దాకా ఉండవచ్చు. కాని మన సమాజంలో సాధారణ ఆయు ప్రమాణం 63 సంవత్సరాలు అయినప్పటికీ ఎంతోమంది పుట్టుకలోనే మరణిస్తున్నారు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ మరణం అనేక రూపాలలో సంభవిస్తోంది. ఆకలి, అనారోగ్యం, మానసిక ఆందోళనలు, సామాజిక అసమానతలు, వరకట్న మరణాలు, నిర్లక్ష్యం, అంటరాని తనం, వ్యవసాయం, చేనేత వంటి రంగాల్లోని సంక్షోభాలు, పారిశ్రామిక అశాంతి, జీవనోపాధి లేమి అసహజ మరణాలకు లెక్కలేనన్ని కారణాలున్నాయి. మన పక్కనె మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైనపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే, ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

| తేది | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| 21.8.07 నుండి 27.8.07 | 3 | – | 4 | – | – | – | 6 | 1 | – | – | 17 | 52* | – | – | – | – | 2 | – |
| 28.8.07 నుండి 03.9.07 | 1 | – | 10 | – | – | – | 8 | 5 | – | – | 16 | 14 | 6 | – | – | – | 4 | – |
| 04.9.07 నుండి 10.9.07 | 4 | – | 6 | – | – | – | 7 | 6 | – | – | 48 | 10 | – | – | – | – | 7 | – |
| 11.9.07 నుండి 20.9.07 | 3 | – | 10 | – | – | – | 11 | 2 | – | – | 22 | 11 | 5 | – | – | – | 2 | 34 |
| మెదక్ | 9 | – | – | – | – | – | – | 3 | 3 | – | 40 | 12 | 7 | – | – | – | – | – |
| కడప | 1 | – | 15 | – | – | – | 6 | 8 | – | 9 | 24 | 6 | 10 | – | – | – | – | – |
| గుంటూరు | 2 | – | – | 1 | – | – | 21 | 3 | – | 15 | 20 | 36 | 3 | – | – | – | – | 18 |
| శ్రీకాకుళం | 6 | – | 8 | – | – | – | 7 | – | – | – | 27 | 6 | 12 | – | – | – | – | – |
| మొత్తం | **29** | **–** | **53** | **1** | **–** | **–** | **66** | **28** | **3** | **24** | **214** | **147** | **43** | **–** | **–** | **–** | **15** | **52** |

* కోఠి గోకుల్‌చాట్, లుంబినీ పార్కుల్లో జరిగిన బాంబు పేలుళ్లలో చనిపోయినవారు; ఈ శీర్షికకు సహకారం అందిస్తున్న వారు :
హైదరాబాద్ – డి. విజయభాస్కర్; మెదక్ – కె. రాజు; కడప – ఎన్.ఎస్. ఖలందర్; గుంటూరు – బి. అంజమ్మ; శ్రీకాకుళం – జి. సుధీర్

*గమనిక : మీ అందరి సహకారంతో అన్ని జిల్లాల పూర్తి సమాచారంతో భవిష్యత్తులో ఈ శీర్షికను మరింత సమగ్రంగా అందించే ప్రయత్నం చేస్తాం.*

RNI Regn. No. APTEL/2003/11482 Published on 27.09.2007 PRINTED BOOK





# మహిళల ఆర్థిక ప్రగతికి సోపానం ఇందిర క్రాంతి పథం



- 30 లక్షల పేద కుటుంబాలకు ప్రయోజనం కల్పించాలన్నదే లక్ష్యం
- మూడేళ్ళలో పావలా వడ్డీకి మహిళలకు రూ.6,500 కోట్ల రుణాల మంజూరు. (దేశంలోనే తొలి ప్రయత్నం)
- వ్యవసాయ ఉత్పత్తుల వ్యాపారంలో మహిళల ముందంజ
- సామాజిక బాధ్యత దిశగా మహిళాసంఘాలు
- ప్రపంచ దృష్టిని ఆకర్షించిన మన మహిళా సంఘాలు







ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## వ్యవసాయోత్పత్తుల వ్యాపారంలో మహిళలు ముందంజ

జారీచేయువారు : సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.

R.O.No. 395/Sou/Advt.I/2007-08

Printed, Published and Owned by V. Hanumantha Rao and Printed at Charita Impressions for Nutan Art Printers, 11-5-417-420, Red Hills, Lakdi-ka-pool, Hyderabad-500 004 and published at 8-3-898/22, Nagarjuna Nagar,Hyderabad-500 073. Editor : V. Hanumantha Rao